అట్టలోపలివైపున అచ్చువేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# రాంగేయ రాఘవ

మధురేశ్

అనువాదం : జ్వాలాముఖి



సాహిత్య అకాడెమీ

*Rangeya Raghava* Telugu translation by Jwalamuki of Madhuresh's monograph in Hindi on Rangeya Raghava Sahitya Akademi, 1998
Rs. 25/-



First edition : 1998

ISBN : 81 - 260 - 0362 - 6

**సాహిత్య అకాడెమీ**

రవీంద్రభవన్, 35, ఫిరోజ్ షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

విక్రయ విభాగం · 'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

ఏడిఏ రంగ మందిర, 109, జె సి. రోడ్, బెంగళూరు - 560 002

గుణ బిల్డింగ్, 304-305, అన్నా సాలై, మద్రాసు - 600 018

జీవన్ తారా బిల్డింగ్, 4వ అంతస్తు 23A/44x, డైమండ్ హార్బర్ రోడ్,
కలకత్తా - 700 053

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్, దాదర్,
ముంబాయి - 400 014

వెల : రూ. 25

Typeset at M/s Type Shop - Bangalore

Printed at - Balaji Offset Prints, Bangalore

# విషయ సూచిక

అనువాదకుని మాట

# నభూతో నభవిష్యతి

— జ్వాలాముఖి

రాంగేయ రాఘవ నలభైవసంతాల్ని (1923–1962 39 సం") కూడా పూర్తిగా చూడలేదు. ఏ ఆకర్షణకూలోనుగాక పాతికేళ్ళు (1937–1962) రచనా వ్యాసంగాన్నే జీవితంగా స్వీకరించాడు. వివాహం చేసుకుంటే సాహిత్యోపజీవనానికి ఆటంకం అని భావించి, తనకు 33వ ఏడు వచ్చేదాకా వివాహాన్ని వాయిదావేశాడు. రాబోయే అర్ధాంగి సులోచన రచనావ్యాసంగానికి దోహదపడగలదని విశ్వాసం కుదిరాకే వివాహం చేసుకున్నాడు. (1956). ఆరేళ్ళ దాంపత్యజీవితం జ్ఞాపక చిహ్నంగా ఒకే ఒక కూతురు సీమంతిని. రాఘవ మెడమీద లేచిన రాచపుండు బ్లడ్‌క్యాన్సర్ అని చాలా ఆలస్యంగా తేలింది. అకాలమృత్యువు అతడిని శాశ్వతంగా కాటేసింది.

యం.ఏ., పి.హెచ్.డి పట్టాఉన్నా, ఉద్యోగాలు తలుపు తట్టినా పట్టువదలక రచననే జీవనవృత్తిగా స్వీకరించి అయినవారి కానివారి విమర్శలపాలయ్యాడు. పుంఖానుపుంఖంగా రచనలు చేసినా ప్రచురణకర్తలు బాగుపడ్డారు కాని అతడికి కీర్తి తప్ప మరేమీ దక్కలేదు. ఆర్థిక ఇబ్బందులు కుంగదీసినా, క్యాన్సరు వ్యాధి కోతపెట్టినా, జీవితావసరాలు గీపెట్టినా రాఘవ రచనా వ్యాసంగాన్నివదలలేదు. ఉద్యోగం చేయలేదు —

ఇలా రచనావ్యాసంగానికే రాఘవ కట్టుబడి, ఉద్యోగం చేయక రచనలో లీనమైపోవడాన్ని, వృత్తిలోకి జారి ఇరుక్కుపోయిన వేశ్యతో సరిపోల్చాడు ఈ గ్రంథమూలరచయిత మధురేశ్ — ఇది సరైన పోలిక కాదు — దీన్ని 'నీచోపమ' అని అంటారు. రచనాప్రవృత్తి ఎలాంటిదైనా అది వేశ్యావృత్తితో సమానంకాదు. మధురేశ్ ఈ విషయంలో తొందరపడ్డాడు. ఈ తొందరపాటు సంస్కారాన్ని ప్రశ్నిస్తుంది! [చూడండి : పేజీ 20 — పేరా 3].

రాఘవ ఇంట్లో ఉన్నవి అమ్మి అప్పటి అవసరం తీర్చుకున్నాడు.

అర్ధాంగి సులోచన జ్ఞాపకాలు "పునః" రాఘవ జీవనరేఖాచిత్రానికి కన్నీటికుంచెలు. రాఘవ జీవితాంతం రచనావ్యాసంగ నిమగ్నుడు.

రచయితకు 'నిబద్ధత 'అవసరమని వాదించినా, రచనాస్వేచ్ఛ అంతకన్నా ముఖ్యమని పోరాడాడు రాఘవ; సామయిక విషయాలు కావ్యవస్తువులయినా కాలపరిమితుల్ని అధిగమించి ముందుకుపోయే సత్యాన్వేషణే సాహిత్యంలో శాశ్వతత్వం సాధించాలని కోరాడు. అభ్యుదయవాదం, మానవవికాసం, చారిత్రకదృష్టి, సమసమాజం, అతఃకరణ, దోపిడీనిర్మూలన, అన్యాయ ప్రతిఘటన మున్నగు ఆదర్శాలు అతడి రచనాప్రేరణలు, మార్క్సిజం రాఘవ సత్యాన్వేషణకు తోడ్పడిన వివేకచూడామణి.

బహుశా హిందీలో మొట్టమొదటిసారి కావ్యరచనలో 'అంతర్జాతీయ దృష్టి'ని ప్రవేశపెట్టినవాడు కూడా రాఘవే కావచ్చు. నాజీలదురాక్రమణను ప్రతిఘటిస్తూ, సోవలిష్టురష్యాప్రజలు సాగించిన వీరోచితపోరాటానికి జోహార్లు అర్పిస్తూనే, వారంతా సకలదేశాల పీడితమానవాళి ప్రతినిధులని 'అజేయ్ ఖండహార్'లో పేర్కొన్నాడు. బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని ఫాసిజాన్ని భూస్వామ్యవిధానాన్ని, వాటి సంకరసంస్కృతిని తూర్పారబట్టడంలో రాఘవ వెనుకాడలేదు. దేశవిభజన విషాదాల్ని రాయడంలో యశ్‌పాల్ (ఝూటాసచ్), భీష్మసహానీ (తమస్) నవలలకు భిన్నవైఖరి తీసుకొని కేవలం ఒక కథగా 'తబేలేకా ధుంధలకా' అనే కథరాశాడు. ఇందులో మిగతా రాజకీయాల జోలికి పోక, మానవుడి పరాధీన పరిస్థితిలో స్వార్థపరులు అన్నివిలువల్ని అణగదొక్కి తోటివారిని ఎలా దోపిడీచేస్తారో, వారి నీచసంస్కృతి ఎంత హీనమైనదో చిత్రించాడు, ఇలా రాఘవ ప్రతి విషయంలోనూ భిన్నవైఖరి తీసుకొని చేదునిజాల్ని బయటికి తెచ్చాడు.

ఆర్యులు ఎంతటి క్రూరులో, వర్ణదంభులో, విస్తరణవాదులో స్పష్టంగా చెబుతూ మొహెంజదారో నాగరికతను ఉచ్చదశకు తీసుకెళ్ళిన ఆదిభారతీయులు ద్రావిడులు, ఎక్కువ నాగరికత కలవారని రుజువుచేశాడు రాఘవ, 'ముర్దోంకటీలా' , ఆ నేపథ్యంతో రాయబడిన చారిత్రకనవల. భారతీయ చారిత్రిక పరిణామక్రమాన్ని, మానవవికాసానికి మైలురాళ్ళుగా నిలిచిన సంఘటనల్ని పాత్రల్ని ప్రధానంగా చూపుతూ 'గాథల' ప్రక్రియను ప్రవేశపెట్టి

నాలుగుభాగాల చరిత్రగ్రంథం 'మహాయాత్రా' రాయాలనుకున్నాడు. రెండుభాగాలే రాసి చనిపోయాడు. రాఘవ చారిత్రిక అవగాహనకు, మానవతకు వికాసచింతనకు, సత్యాన్వేషణకు ఈ రచన చక్కని అక్షరసాక్ష్యం — అతడి 'అంతర్భుక్తి సిద్ధాంతం' జ్ఞానచక్షువు.

పౌరాణిక పాత్రలైన ద్రౌపది, భీష్ముడు, యుధిష్ఠిరుడు మున్నగు పాత్రల్ని గొప్పతర్కంతో మలుస్తూ, వారు తమ తమ యుగ–యధార్థాలలో ఉంటూకూడా యుగాతీతంగా బతికారని రాఘవ వాదించాడు. దీనికి చలించిన మైథిలీశరణ్‌గుప్త్ అభ్యంతరానికి వివరణ ఇస్తూ — భీష్ముడు మున్నగు పౌరాణికపాత్రలగురించి ముందే స్థిరపడిపోయిన భావాల ఆధారంగా ఆలోచించడంవల్ల సత్యసాక్షాత్కారం జరుగదని సుదీర్ఘమైన లేఖ రాశాడు. అది నేటికీ సాహిత్యలక్ష్యలక్షణ వివరణ. అలాగే చరిత్రపురుషులైన రామానుజాచార్య మున్నగువారి గురించి కూడా రాఘవ నాటి సంస్కరణాభిలాషను వివరించాడు.

వామాచారం, దేశాభిమానలేమివల్ల బౌద్ధం పతనమైందని, తద్భిన్నంగా జైనం పురోగమనపాత్ర నిర్వహించిందని రాఘవ వివరణ ఇచ్చాడు. క్షత్రియుల్ని ఓడించి, గెలిచిన భూమిని బ్రాహ్మణులకు దానంచేసినా ఆ బ్రాహ్మణ భూమిలోనే పరశురామునికి నిలువనీడ లేకపోవడం గమనార్హమని వాదిస్తూ, తర్వాతియుగాల్లో బ్రాహ్మణులు క్షత్రియులు కలిసి పోరాడాల్సిన అవసరం వచ్చిందని తేలాడు. ఋగ్వేదం మారిన రూపమే సామవేదం అని వివరణ ఇచ్చాడు. ఇంగ్లీషువారు విమర్శించినందువల్లే వాజిదలీషా అందరిదృష్టిలో పడిపోయాడని, కాని సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా భారతసైన్యాన్ని సమీకరించిన ధీరుడని రాఘవ స్పష్టీకరించాడు. పతనమవుతున్న నవాబుల యుగంవాడు, కావడమే అతడి దురదృష్టమని, అయినా ప్రజలు అతన్ని బాగా ప్రేమించారనీ, నాయకుడు లేకుండానే ఆతర్వాతి వారు ఇంగ్లీషువారిని ప్రతిఘటించారని రాఘవ చరిత్రకర్థం చెప్పాడు. కపటియైన అక్బరు ఏవిధంగానూ సమర్థనీయుడుకాదని రాఘవ చరిత్రరహస్యాలు వెలికితీశాడు.

'మేధావి–రచయిత'గా రాఘవ హిందీరచయితల్లో అగ్రభాగాన

నిలుస్తాడు. అతడిలో ఎంతటి తర్కం, వివేకం కనబడతాయో అంతేలోతుగా అంతఃకరణ తొణికిసలాడుతుంది. రచనల్లో, జీవితపు ఉద్రేకఘట్టాల్లో రాఘవ కనబరిచిన అనుభూతిస్సనివేశాలు అద్వితీయం – 'గదల్' కథ ప్రేమచంద్ కథలను ఢీకొనే సత్తాకలది; చరిత్ర గాథలరచనలో రాహుల్జీని, నవలలో యశపాల్, ప్రేమచంద్‌లను, కావ్యరచనలో జయశంకర్ ప్రసాద్ నిరాలాలను, సాహిత్య విమర్శలో రామచంద్ర శుక్ల, రామ్‌విలాస్ శర్మలను ఎదురొడ్డి నిలిచిన సమర్థుడు రాఘవ. 'ప్రతి రచనల' సాంప్రదాయం సృష్టించి సమకాలీన రచయితలను తారెత్తించాడు రాఘవ, మౌలికతను, భావుకతను, సృజనాత్మక శక్తిని అలవరచుకున్న ప్రతిభాసంపన్నుడు. కథలకు, నవలలకు, మిగతా పుస్తకాలకు పెట్టిన పేర్లలోనే అతడి భావుకత, నవ్యత వ్యక్తమవుతాయి.

బెంగాల్ కరువును ఆధారం చేసుకొని – రాఘవ వెళ్ళి, చూసి – రాసిన 'తుఫానోంకే బీచ్' పత్రికారచనలో హిందీ పత్రికారిపోర్టింగ్ ఆధునిక పద్ధతికే శ్రీకారం. అలాగే పోలీసుకాల్పులను నిరసించే రచన 'యహ్ గ్యాలియర్‌హై' అతడి కార్మికవర్గ సంఘీభావానికి కలికితురాయి. ''ప్రగతిశీల రచయితల సంఘం''. (అరసం)తో పెనవేసుకుపోయిన అతడి సాహిత్య మమేకత్వం అభ్యుదయ సాహిత్యోద్యమానికే కీర్తికిరీటమైంది.

మౌలికతను భావంలో, భాషలో కాపాడడానికి అనువాదం చేసేప్పుడు తగు జాగ్రత్తలు తీసుకున్నాను. మూల హిందీ రచయిత మధురేశ్ ఎన్నుకున్న రచనాప్రణాళిక మేరకు పునరుక్తులు తప్పలేదు. మూలవిధేయానువాదంగానే నా రచన సాగింది. హిందీ వాక్య రచనాపద్ధతినే తీసుకున్నా, తెలుగు భాషాదృష్టిని ఆచరణలో పెట్టాను. హలంతనామాన్ని అజంతంచేశాను.

అనితరసాధ్యమైన సాహిత్యవ్యక్తిత్వంగల రాంగేయ రాఘవ మూలరచనలు చదవడం సాహిత్య జిజ్ఞాసువులకు చాలా అవసరం. అతడు మన యుగంలో నిజాయితీగల నిబద్ధరచయిత. మానవతా ప్రవక్త. వికాసపరిశీలకుడు. చరిత్రలో విజ్ఞతాబాధ్యతలు తెలిసిన సంస్కారి. అంతటి రచయిత నభూతో న భవిష్యతి. జోహార్లు!

జ్వాలాముఖి

27–4–1989

# పునః

కీ॥ శే॥ రాంగేయ రాఘవ కుటుంబాన్ని దర్శించడానికి [31 మే, (గురువారం) 1990] జయపూర్ వెళ్ళాను. అతని భార్య శ్రీమతి సులోచనా రాంగేయ రాఘవ, కూతురు శ్రీమతి సీమంతిని, అల్లుడు అశోకశాస్త్రి మనవరాలు వాగ్మి (చిన్నారి)ని చూశాను. చాలా తృప్తి కలిగింది. శ్రీమతి సులోచనను ఇంకా రాఘవ జ్ఞాపకాలు ఆవహించివున్నాయి. 'పునః' రాసిన ఆమె తన జ్ఞాపకాల రెండోభాగంగా ''పునశ్చ'' రాస్తున్నారు. అప్పటికి టీవీలో ''కబ్‌తక్‌పుకారూ'' సీరియల్ వస్తూవుండేది; దానికి సంభాషణలు రాసింది అశోక్ శాస్త్రి. ఆ కుటుంబమంతా సాహిత్యంలో లీనమైవున్నట్లు కనిపించింది. శ్రీమతి సులోచన జయపూర్ విశ్వవిద్యాలయంలో సోషియాలజీలో అధ్యాపకురాలు. కూతురు మరోచోట ఇంగ్లీషులెక్చరరు. ఆ సాహిత్య కుటుంబానికి నమస్కారం చెప్పి రాఘవను చూసినంత తన్మయత్వంతో తిరిగివచ్చాను. అతడి మాతృభాష హిందీ కాకపోవడంవల్ల కూడా హిందీసాహిత్యంలో అతడు చాలానిర్లక్ష్యానికి గురయ్యాడు. ఆపై ''ద్రావిడవాది'' అనే ముద్ర కూడాపడింది. నిజానికతడు తన యుగపరిమితులను అధిగమించి సత్యాన్ని సాక్షాత్కరింపజేసిన స్రష్ట. రాఘవ నిబద్ధరచయితలకు ప్రాతఃస్మరణీయుడు, అన్ని విధాలా మార్గదర్శకుడు.

రాంగేయ రాఘవ సాహిత్య వ్యక్తిత్వాన్ని నిష్పాక్షికంగా బొమ్మకట్టించడంలో మూల రచయిత మధురేశ్ కృత కృత్యుడయ్యాడు. విమర్శకులునిరాధారంగా విమర్శించి రాఘవ సాహిత్య ఔన్నత్యాన్ని మరుగు పరచారని మధురేశ్ ఎంతోచక్కగా వివరించాడు. రాఘవ చారిత్రక దృష్టిని ''అంతర్భుక్తి వాదాన్ని'', ''గదల్'' కథలోని అద్వితీయతను, ''మహాయాత్రా'' గాథలలోని విశ్లేషణను, నవలల జీవనవాస్తవికతను సాహిత్య విమర్శలోని నిగూఢతను వివరించడంలో మధురేశ్ చూపిన సామర్థ్యం ప్రశంసనీయమైనది. అతనికి లేఖద్వారా అభినందనలు కూడా తెలిపాను. ఈ అనువాదం ఒక మహదవకాశం. అకాడమీవారికి ధన్యవాదాలు.

జ్వాలాముఖి
7-4-1991

జ్వాలాముఖి,
2-3-64/డి, తిరుమలనగర్, అంబర్ పేట్,
హైదరాబాదు-500 013.
[ఫోను నం: 46654]

## అధ్యాయం 1

# వ్యక్తిత్వం – యుగసందర్భం

రాంగేయ రాఘవ పూర్వీకులు సుమారు రెండున్నర శతాబ్దాలకు పూర్వం దక్షిణ ఆర్కాట్‌నుండి వలసవచ్చి, రాజస్థానంలోని సరిహద్దు గ్రామాలైన వైర్, దాని సమీపంలోని "వారౌలీ" జాగీరుక్షేత్రాలలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఈ వంశంలోనివాడైన శ్రీనివాసాచార్యుల పాండిత్యానికి మెచ్చి, నాటి జయపూర్ రాజు అతడికి ఒక జాగీరును ఇచ్చాడు. అక్కడ ఒక సీతారామస్వామి ఆలయం నిర్మించి, దానికి అతడిని ప్రధాన పురోహితుడిగా కూడా నియమించాడు – అగ్రహారీకులు వీరు.

తమిళ, సంస్కృత భాషల్లో గొప్ప పండితులుగా పేరొందిన శ్రీ రంగాచార్యులు ఈ వంశవృక్షంలోనుంచి వచ్చినవాడే. అతడి సుపుత్రుడుగా రాంగేయ రాఘవ జనవరి 17, 1923న జన్మించాడు. తండ్రి శ్రీ రంగాచార్యులు తమిళ, సంస్కృత భాషల్లో విద్వాంసుడు. ఎన్నో శాస్త్రాలు తెలిసినవాడు. తల్లి కనకవల్లి తమిళ, కన్నడ భాషల్లో ప్రావీణ్యం పొందిన జ్ఞాని. ఆమెకు వ్రజభాష కూడా వచ్చు. ముగ్గురుసోదరుల్లో రాఘవ చివరివాడు కావడంమూలాన అతడు చాలాగారాబంగానే పెరిగాడు.

రాఘవ మేనత్త అక్కాజీ విదుషీమణి. వ్రజభాషలో ఆమెకు ప్రవేశం ఉండేది. ఆమె భర్త దేశికాచార్యులు వేదవేదాంగపారీణుడు. తండ్రి, మామలతో సమానంగా మేనత్త అక్కాజీ రోజూ శాస్త్రచర్చల్లో పాల్గొనేది. బాల్యంలో రోజూ కొనసాగే ఈ చర్చలప్రభావం రాఘవమనస్సుపైన గాఢంగా పడింది. శాస్త్రజిజ్ఞాస, సాహిత్యసంస్కారం అతడికి ఇంటివద్దే పుష్కలంగాలంభించాయి.

రాంగేయ రాఘవ పూర్తిపేరు తిరుమలైనంబాకం వీరరాఘవాచార్య – ఈ పేరే స్కూలు, కాలేజీ రికార్డులో ఉంది. కాలేజీ వార్షిక సంచికల్లోని తొలినాటి రచనలు కూడా ఈ పేరుతోనే వెలువడ్డాయి. అతని సన్నిహిత కవిమిత్రుడు కీ।। శే।। భారతభూషణ్ అగర్వాల్ సూచన మేరకు తన

పేరును కాస్త ఆధునికం చేసుకున్నాడు – రంగాచార్య పుత్రుడు రాఘవ అని అర్థం స్ఫురించేట్లుగా తండ్రిపేరులోని మొదటిపదాన్ని తన పేరులోని మధ్యపదాన్ని జోడించి, ఒక సమాసంగా రూపొందించి, హిందీభాష సంప్రదాయానుకూలంగా తన పేరును హలంతం చేసి 'రాంగేయ్ రాఘవ్' గా నామకరణం చేసుకున్నాడు. (తెలుగులో అజంతంచేశాను 'రాంగేయ – రాఘవ')

తర్వాత రచనలన్నీ ఈ కొత్త పేరుతోనే వెలువడ్డాయి. ఈ పేరుతోనే సాహిత్యప్రపంచంలో అతనికి ఎనలేని గౌరవం లభించింది. ఈ పేరే అంతటా స్థిరపడింది.

తమిళ, సంస్కృత, పారసీక భాషా సాహిత్యాల్లో విద్వాంసులైన కుటుంబంలో పుట్టినప్పటికీ రాఘవ, అతని సోదరుల విద్యాభ్యాసం ఇంగ్లీషు మీడియంలోనే జరిగింది. తండ్రి శ్రీ రంగాచార్యులు మామూలు జాగీరుదారుగానే ఉన్నప్పటికీ, అతడు వేగంగా మారుతూ వస్తున్న కాలప్రభావాన్ని, యుగావసరాన్ని గుర్తించిన దూరదర్శి. అందువల్లే అతడు తన సంతానానికి ఆధునిక ఆంగ్లవిద్య కూడా వచ్చేట్లు ఏర్పాటు చేశాడు. చురుకైన రాఘవ అనువంశికమైన ఆలయవిధులను నిర్వహిస్తే బాగుండునని తండ్రి కొన్నిసందర్భాల్లో అనుకున్నాడు కూడా, కాని రాఘవ ఎదిగి వస్తూన్న మార్గాన్ని చూసి ఆ ప్రయత్నం మానుకున్నాడు.

ఆగ్రాలోని విక్టోరియాస్కూలులో రాఘవ ప్రాథమిక విద్య కొనసాగింది. ఆ తర్వాత అక్కడ ఉన్న సెయింట్ జాన్స్ కాలేజీలో డిగ్రీవిద్య ప్రారంభమైంది. 1941 సం॥లో ఆంగ్ల సాహిత్యం, తత్వశాస్త్రం, ఆర్థికశాస్త్రం మున్నగు విషయాలతో రాఘవ డిగ్రీవిద్య పూర్తిచేశాడు. ఈ రోజుల్లోనే అతడు ఆర్థికశాస్త్రం తరగతిపాఠాలు మాని "ఘరౌందా" నవలను రాశాడు. దీనివల్ల అతడు ఆర్థికశాస్త్రం చదువులో వెనుకబడిపోయాడు. దానిని ఆ తర్వాత రాసి డిగ్రీ పూర్తిచేశాడు. 1943లో హిందీసాహిత్యంలో ఎం.ఏ. పట్టా పొందాడు. పిదప ప్రొఫెసర్ హరిహరనాథ్ టండన్ మార్గదర్శకత్వంలో "భారతీయ మధ్యయుగాలలో సంధికాల అధ్యయనం

– గోరఖ్‌నాథ్ యుగం" అనే అంశంమీద పరిశోధనకు పూనుకున్నాడు.

రాఘవకు పి.హెచ్.డి. పట్టా ఆగ్రా విశ్వవిద్యాలయంనుండి లభించింది. అతడు తన పరిశోధనా సామగ్రి కోసం బెంగాల్‌లోని శాంతినికేతన్ విశ్వవిద్యాలయందాకా ప్రయాణం చేశాడు. ద్వివేది, "నాథ సాంప్రదాయ్యం" అనే గ్రంథాన్ని రాసినా అది అప్పటికి అచ్చుకాలేదు. రాఘవపరిశోధనాసక్తిని చూసి ద్వివేది దాన్ని అతడికి ఇచ్చాడు. ఆ గ్రంథాన్ని రాఘవ అక్కడే ఉండి అధ్యయనం చేసి తన పరిశోధనావిషయాన్ని సమగ్రంచేసుకున్నాడు. అంతటితో ఆగక అతడు వారణాసికూడా వెళ్ళి 'మణినాథ మఠం' దర్శించి నాథసాహిత్యాన్ని కూలంకషంగా అధ్యయనంచేశాడు.

వ్యయప్రయాసలకోర్చి మిక్కిలి ప్రతిష్ఠాత్మకంగా పొందిన పి.హె.చ్.డి. పట్టాని రాఘవ ఎన్నడూ సాహిత్యరంగంలో గొప్పలకోసం, పరిచయాలకోసం వాడుకోలేదు. అతడెన్నుకున్న పరిశోధనాంశం కూడా కేవలం సాహిత్య సంబంధికాదు. తాత్విక చింతనాధారను తెలియజేసే సాహిత్యదర్శనం.

1937లో "సాప్తాహిక్ విశ్వామిత్ర" పత్రికలో రాఘవ తొలిరచనగా ఒక గీతం వెలువడింది. అదే అతని భవిష్యత్తును నిర్ణయించింది. రాబోయే కష్టనష్టాల చెడుపరిణామాలను ఊహించి కూడా రాఘవ సాహిత్య వ్యాసంగాన్ని జీవనాధారంగా స్వీకరించాడు. ఆర్థిక ఇబ్బందులు భయపెట్టినా, వ్యామోహాలు తొందరపెట్టినా రాఘవ ఎన్నడూ తాను ఎన్నుకున్న మార్గంనుండి వైదొలగలేదు. రచయితగానే అతడు జీవించాలని కోరుకున్నాడు. ఆ మార్గంలో అతడికి కష్టాలు వచ్చినా నిరాశ మాత్రం కలగలేదు. విద్యార్థిజీవితకాలంలోనే "ఘరౌందా" నవలతో ప్రారంభమైన రాఘవ రచనావ్యాసంగం, క్రమంగా సాహిత్య ప్రక్రియలన్నింటిలోనూ ప్రవేశించి అతడి స్థానాన్ని అనతికాలంలోనే సుస్థిరం చేసింది. అది ఏదో అలభ్యంగా వచ్చిపడిన వరప్రసాదంకాదు. జీవితాన్ని సాహిత్యానికి అంకితం చేసుకొని సాగించిన సుదీర్ఘ యాత్రాఫలితం. దీక్షాదక్షతగా క్రమవికాసం చెందిన రాఘవ సాహిత్యవ్యక్తిత్వానికి ఆశ్చర్యపడిన అతడి ఆగ్రావిద్యాలయం గురువు ప్రొఫెసర్ ప్రకాశ్‌చంద్ర చెప్పినమాటలు ఇక్కడ అప్రస్తుతాలు

కావు: "సాహిత్యాకాశంలో రాంగేయరాఘవ ఉదయించడం అందరికీ ఒక తోకచుక్కకాంతి కెరటంలా తోచింది!"

రచనవ్యాసంగానికి ఆటంకం అనుకొని రాఘవ చాలాకాలందాకా అవివాహితుడగానే ఉండిపోయాడు. రచనావ్యాసంగానికి కేంద్రగా ఉన్న అతడి గ్రామం వైర్‌లో కరెంటుసౌకర్యంకూడా ఉండేది కాదు. వేసవిరాత్రుల్లో దోమతెరలో లాంతరు వెలిగించుకొని జాగారం చేస్తూరచనలు చేసేవాడు. ఇది సుమారు అతడి దినచర్యగానే మారిపోయింది. ఇంటిపైకప్పుకు వేలాడే విశాలమైన గుడ్డపంఖాను తాడుతో లాగుతూ అందరూ ఆ రోజుల్లో ఉక్కపోతనుండి బయటపడేవారు. రాఘవకూడా పగటిపూట ఆ లాగుడుపంఖాతాడును కాలికి చుట్టుకొనిలాగుతూ, బోర్లాపడుకుని రచనలు కొనసాగించేవాడు – ఇదీ అతని పట్టుదల.

సులోచనతో వివాహం అయ్యేనాటికి రాఘవ వయస్సు 33 సం॥లు. ఆమె అతడికన్నా 14 సం॥లు. చిన్న. వారి వివాహం 1956లో జరిగింది. అదీ అంత సులభంగా జరుగలేదనే చెప్పాలి. రచనావ్యాసంగం కుంటుపడుతుందనే భయంతో రాఘవ తన వివాహాన్ని తరుచూవాయిదా వేసేవాడు. ఓమారుతనకోసం చూసి నిర్ణయించిన అయ్యంగార్ల అమ్మాయి శకుంతలను తన అన్న టి.యన్.యల్. ఆచార్యకు ఇప్పించి వివాహం జరిపించాడు. ఆమె చెల్లెలే సులోచన. పరస్పరవిశ్వాసాలు కుదిరాక, రచనావ్యాసంగానికి ఆటంకం రాదనే నమ్మకం ఏర్పడ్డాక, ఆమె పరిచయంలో ఆ మేరకు హామీ లభించాక రాఘవ వివాహానికి ముందుకు వచ్చాడు. అయినప్పటికీ ఆమె కేవలం మెట్రిక్‌దాకే చదువుకుంది. రాఘవ, సులోచనల వివాహం బొంబాయిలోని మాతుంగాలో మే 7, 1956న చాలా మామూలు పద్ధతిలో జరిగింది. ఆరు సంవత్సరాల వారి దాంపత్యకాలంలో కూడా వారు కలిసివున్నది చాలా తక్కువ, రాఘవ కోరిక, పట్టుదల ప్రకారం సులోచన బొంబాయిలోనే ఉండి ఇంటరు పూర్తిచేసింది. ఆ తర్వాత జైపూర్ వచ్చి బి.ఏ. పూర్తిచేసింది. అలా ఆనాడు రాఘవ పట్టుబట్టి సులోచన చదువును కొనసాగించడం, ఆమె తన సొంతకాళ్ళమీద నిలబడేట్లు

చేయడం తర్వాతకాలంలో సులోచనకు ఎంతగానో తోడ్పడింది. చివరకలా జరుగుతుందని ఆనాడు ఎవరూ ఊహించనైనా ఊహించలేదు. సులోచనా రాఘవల ఏకైక సంతానం ఒక అమ్మాయి – ఆమె పేరు 'సీమంతిని', రాఘవ తన 39వ ఏట మరణించేనాటికి ఆ పాపవయస్సు 4 సం॥లు. అసంఖ్యాకంగా రాఘవరచనలు వెలువడినా అతడి ఆర్థికపరిస్థితి ఎన్నడూ మెరుగుపడలేదు. తల్లి కనకవల్లితో రాఘవకు విడదీయరాని గాఢమైన అనుబంధం ఉండేది. 1959 సం॥లో ఆమెక్యాన్సరువ్యాధి సోకి మరణించింది.

1960లో జయపూరు వచ్చేనాటికి, రాఘవ మెడపైన ఒక రాచపుండు బయలుదేరింది. ఆగ్రా వెళ్ళినా అదినయంకాలేదు. తిరిగి జయపూర్ వచ్చాక, జర్మనీడాక్టరు హైలింగ్ ఆ వ్యాధి క్యాన్సర్ అని తేల్చాడు. ఆ తర్వాత రాఘవ బొంబాయిలోనే టాటా ఆసుపత్రిలో చేరాడు. అక్కడ డా॥ జస్సావాల ఎన్నో వైద్యపరీక్షలు చేసి ఆ రాచపుండును హాజ్‌కిన్స్ అనబడే బ్లడ్‌క్యాన్సర్‌గా నిర్ధారించాడు. మిక్కిలి శ్రద్ధాసక్తులతో చికిత్స కొనసాగినప్పటికీ ఆ రోగం నయంకాలేదు. సెప్టెంబరు 12, 1962 నాటి మిట్టమధ్యాహ్నం రచనా భాస్కరుడుగా వెలుగుతూన్న రాఘవ అమాంతంగా అస్తమించాడు.

క్వీన్స్ రోడ్డులోని చందన్‌వాడి సోనాపూర్ శ్మశాన వాటికలో, వాన పడుతుండగా, నూటయాభైదాకా మౌలిక రచనలు చేసిన మహారచయిత చివరకు ఒక చిన్నఎముకలరాశిగాను, పిడికెడు బూడిదగాను మిగిలి పోయాడు. పుట్టిన ప్రతివాడు గిట్టక తప్పదు. అది ప్రతివాడికీ ఎదురయ్యే యధార్థమే. అయితే రాఘవలా అల్పాయువు జీవితంలో అనితరసాధ్య మైన సాహిత్య విజయాలు సాధించడం అవరోధాలను అధిగమించడం అసాధ్యం.

అతి తక్కువకాలంలో ఎక్కువరచనలు చేసిన రచయితలు ఏ భాషలోనైనా వేళ్ళమీద లెక్కపెట్టదగినవారుగానే ఉంటారు. అనతికాలంలోనే సాహితీరంగంలో చెరగనిముద్ర వేసినవారు మనకు అన్ని భాషల్లోను దొరుకుతారు. కాని రాఘవలా అనతికాలంలోనే అన్ని అవరోధాలను

అధిగమించి సాహిత్యంలో సుస్థిరస్థానాన్ని సంపాదించిన ప్రతిభాశాలిురు దేశ, విదేశ సాహిత్యంల్లో సత్కృత్తు. కృషికి తగిన ఫలితం, నిజాయితీకి తగిన స్థానం అతనికి లంభించాయా? అనేవి శేషప్రశ్నలు.

"కహానీ" పత్రికలోనూ, గదల్, భూమిదాన్ మున్నగు రచనలతోపాటు వెలువడిన రాఘవ ఛాయాచిత్రం అందరికీ సుపరిచితం. అతడాచిత్రంలో చాలాబలహీనపడినట్లుగా కనిపించినా, చూడగానే ప్రసాద్‌లా స్ఫురిస్తాడు.

ధోవతి, పైనవదులు లాల్చీ, అడ్డంగా ఉత్తరీయంతో కనిపించే రాఘవస్వరూపమే అందరికే తెలుసు. కాలేజీరోజుల్లో అతడికి దుస్తులపై ఇష్టం చాలావుండేది. అందుకే అతడు ఒకేసారి ఎన్నోజతల బట్టలు కుట్టించుకునేవాడు. ఆ రోజుల్లోనే ప్యాంటు, షర్టు వేసేవాడు. ఆ తర్వాత అతడు ధరించినవి ధోవతి లాల్చీలే. చలికాలంలో మాత్రం అప్పుడప్పుడూ బిగుతు లాగూ, షేర్వానీ వేసేవాడు.

మొదట్లో రాఘవ తలమీద దట్టమైన నల్లనిజుట్టు ఉండేది. క్రమంగా ఆ జుట్టు రాలిపోయాక అతని ఫాలం, తల చాలా పెద్దవిగా కనిపించేవి. మొనతేలిన అతని పొడవైన ముక్కు, లోతుగా చూసే అతని కళ్ళు రాఘవ స్ఫురద్రూపానికి ఆనవాళ్ళుగా ఉండేవి. రచనావ్యాసంగానికి ప్రత్యేకంగా రూపొందినట్లు అతని చేతివేళ్ళు సన్నగా పొడవుగా ఉంటూ చురుగ్గా కదలాడేవి. అతడి శరీరనిర్మాణ సమతూకం తగు నిష్పత్తిలో చూస్తే – అతడి పిక్కలు మాత్రం చాలాపెద్దవిగా తోచేవి. అవి మాంసలంగానూ బలిష్ఠంగానూ ఉండేవి. అతడు కాళ్ళను తన్ని నేలమీద నిలుచున్నప్పుడు అతడి బలిష్ఠమైన కాలిపిక్కల్లోని మాంసం ముద్దలు చెదిరి మెలికలు తిరిగి చేపపిల్లల్లా కనిపించేవి. అతడి బలిష్ఠమైన పిక్కలు రచయితల్లో నవ్వులాటకోసమే అయినా చర్చనీయాంశాలయ్యాయి. అమృత్‌రాయ్ ఓ ప్రస్తావన తెస్తూ, తన పలుచని పిక్కలను సరిపోల్చుకుని వాపోతూ జ్ఞాపకాలు రాశాడు. ఆగ్రా, బనారస్‌లాంటి పట్టణాల్లో ఈ విషయచర్చ ప్రతిష్ఠాత్మక మైంది కూడ.

రాఘవ వ్యక్తిత్వంలో కనిపించే నిరాడంబరత, పట్టువదలని కర్మణ్యతాభావం అతడి సుగుణాలుగా నిలిచిపోయాయి. నిజానికవి అతడు సృష్టించిన కథానాయకుల ఉన్నతాదర్శాలే. పురావైభవ ప్రాభవంనుండి వైదొలగి, భౌతిక సంపదనుండి వైముఖ్యం చెంది, అతి సాధారణరూపం దాల్చి, విశ్వకల్యాణంకోసం జీవితాలను ధారపోసే సాధనసంపత్తిగా ఆ ఆదర్శాలు సంక్షుభితసమాజంలో జాజ్వల్యమానంగా ప్రకాశించేవి.

జీవితపరమార్థాన్ని రాఘవ ఒకసారి అర్థంచేసుకున్నాక అతడు ఎప్పుడూ ఆ సాధనామార్గంలో చలించేవాడు కాదు.

రాఘవ మరణించాక సెప్టెంబరు 1963 నాటి "లహర్" పత్రికలో నేనొక పరిచయవ్యాసం రాస్తూ, అతడి గుణదోషాలను ముందుకు తెచ్చాను. "రాంగేయ రాఘవ – అధ్యయన సమస్యలు" అనే ఆ వ్యాసంలో రాఘవ రచనల అతివ్యాప్తిదోషాన్ని పేర్కొంటూ, సృజనశీలతలో దానివల్ల సంక్రమించిన అరిష్టాల, చెడుప్రభావాలను చర్చించాను. రాఘవ అనితరసాధ్యంగా సృష్టించిన కథ, నవల, నాటకం, కావ్యం, విమర్శ, చరిత్ర, పత్రికారచన, సామాజిక శాస్త్రం మున్నగు సాహిత్యప్రక్రియల పూర్వాపరాలను, వాటి మంచిచెడులను, పాఠకుల దృష్టికి తెచ్చాను. ఆ ప్రస్తావన ప్రస్తుతం తప్పనిసరి.

"రాఘవ రచనావైవిధ్యాన్ని చూసి మొదట జిజ్ఞాసతో పాఠకుడు ఆవేశపడిపోతాడు. రచనాబాహుళ్యానికి వెరచి చదవడానికి చూపాల్సిన ఉత్సాహాన్ని మందగింపజేస్తాడు అతడంటే పూర్తిగా తెలిసివున్నవాళ్ళ విషయంలో కూడా ఇది యధార్థమే, అతడి ప్రస్తావన రాగానే వారెలాగూ సర్వం బోధపడినవారిలాగా వాదిస్తారు".

అప్పుడూ, ఇప్పుడూ రాఘవ సమస్త సాహిత్యం, అధ్యయనం చేసి వెలగట్టగల ధైర్యం, నిష్ఠగలవారు దొరుకుతారా? అనేది శేషప్రశ్న!

రాఘవ అచ్చయిన నవలలు 38 – ముర్దోంకాటీలా, కబ్‌తక్ పుకారూ, అఖరీ ఆవాజ్, లాంటి ప్రసిద్ధనవలలు ఆ ముద్రిత రచనల్లో

ఉన్నాయి. ఒక్కొక్క సంపుటంలో వెయ్యేసిపేజీలు గల రెండు సంపుటాల "మహాయాత్రా" అనబడే సుప్రసిద్ధ బృహత్ రచన, అందులోని అపూర్వగాథలు, వాటి చారిత్రకవివరణలు, పరస్పర సంబంధాలు ఈ రచనలో చోటుచేసుకున్నాయి.

రాఘవ ముద్రిత కథలు 30 – వాటిలో పంచ్ పరమేశ్వర్, తబేలేకా ధుంధలకా, గదల్, కుత్తేకీదుమ్ ఔర్ శైతాన్‌కీ పూంచ్ లాంటి కథలు సుప్రసిద్ధాలు.

అజేయ్ ఖండహర్, మేధావి, పాంచాలి లాంటి కావ్యకృతులు, చారిత్రిక నేపథ్యంతో రాసిన నాటకాలు, బెంగాల్ కరువునాధారం చేసుకొని రాసిన రిపోర్టుల సంకలనం తుఫానోంకే బీచ్, ఇంకా సాహిత్యవిమర్శలు, చారిత్రకరచనలు, సామాజికశాస్త్ర విశ్లేషణలు మున్నగు రచనలు రాఘవ మేధాశక్తిని, రచనా బాహుళ్యాన్ని తెలియజేస్తాయి. అతడి అనువాదసాహిత్యంలో గ్రీకు నాటకాలు, షేక్స్పియర్, గాల్స్‌వర్తనుండి శూద్రకుడు, కాళిదాసు, విశాఖాదత్తుడు మున్నగు రచయితల రచనల అనవాదాలు ప్రముఖంగా ఉన్నాయి.

సాహిత్య విమర్శలో రాఘవ వివాదాస్పద రచనలు చేశాడు. తనను నిర్లక్ష్యంచేశారనే భావంతో అతడు విమర్శకులమీద దాడి చేశాడు. అదుపుతప్పిన అతడి రచన అతడి సాహిత్యానికి ఎంతటి ఉపకారం చేసిందీ ఆనాడు 'లహర్' వ్యాసంలో వివరించాను. ఒక వైపు మొండిపట్టుదల, మరోవైపు బయటి సవాళ్ళను ఎదుర్కోవాలనే ప్రతీకారవాంఛ రాఘవ సాహిత్యంలో సగందాకా నిండిపోయి అతడి సాహిత్యాన్ని సీమితం చేశాయి.

ఎన్ని ఇబ్బందులపాలైనా వ్యాసంగాన్ని బతుకుతెరువుగా కొనసాగించాలనేదే రాఘవ మొదటి పట్టుదల. ఆ నాడు పుస్తక ప్రచురణ నేటిలాగ ఒక పరిశ్రమగా వ్యాపారంలా లేదు, అలాగే ఆ రోజుల్లో రచయితలకు వారి రచనలమీద రాయల్టీ ముట్టజెప్పే సౌకర్యమూ లేదు.

నేటిలాగా ఆనాడు పత్రికారంగం, రాయబార కార్యాలయాలు రచయితలకు భృతికల్పించడానికి ద్వారాలు తెరిచివుంచేవి కావు. ఇన్నిరకాల అభావాలమధ్య బతుకునీడ్చిన రాఘవ ఓ మారు జీవితావసరాలవత్తిడిని తట్టుకోవడానికి తనరచనలను చాలా తక్కువ పారితోషికానికి పబ్లిషర్లకు అమ్ముకోక తప్పలేదు. పబ్లిషర్లు కోరినవాటినే రాసి ఇచ్చాడు. తన చేదు అనుభవంమేరకు ఏవి అమ్ముడుపోతాయో అవే రాసి ఇచ్చాడు కూడా.

జీవితపు వేగంలో రాఘవ ఏనాడూ కుదుటగా కూర్చొని ఉన్నట్లు కనపడేవాడు కాదు. రైలుప్రయాణీకుడి తొందర అతడిలో ఆవహించి వుండేది. అతని జీవితమే ఒక నిరంతర ప్రయాణం. ఈ వేగంలో అతడు చాలాజాగ్రత్తగా రాయాల్సిన రచననుకూడా అతితొందరలో పూర్తిచేసేవాడు. ఒక రైలుదిగి మరోరైలు పట్టుకునే యాత్రికుని తొందర అతడిలో ఎప్పుడూ జొరబడివుండేది. కాస్త జాగుచేస్తే రైలు వెళ్ళిపోతుందనే భయం, దానివల్ల గంటలతరబడి ప్లాటుఫారాలమీద ఎదురుచూపులబతుకు సాగదీయాలనే బెంగ రాఘవనెప్పుడూ తొందరపెట్టేవి. బహూశా అతడు అకాలమృత్యువును పసిగట్టాడో ఏమో తెలియదు – ఆ రచనలతొందర చూస్తే ఎవరికైనా అలాగే అనిపిస్తుంది. అతడు తరచూ ఒక రచననుండి మరో రచనకు రైళ్ళమధ్య పరుగెత్తినట్లు పరుగెత్తేవాడు. ఒక రచన చేశాక కనీసం విరామం కూడా లేకుండా, ఆకళింపు అవసరాన్ని కూడా గుర్తించకుండా ముందుకు దూసుకుపోయేవాడు. ఉద్యోగం దొరికినా చేయరాదని, రచనల ద్వారా మాత్రమే జీవితం కొనసాగించాలని, రచయితగా నిలబడాలని రాఘవ పట్టుదల. అతడి సోదరులు, సమకాలీన రచయితలు అలా ఉద్యోగంలో బతికిన సందర్భాలున్నాయి. వారికి, రాఘవకు మౌలిక భేదం ఉంది. అతడి సమకాలీన రచయితలు ప్రేంచంద్, మైథిలీశరణ్ గుప్త్, బృందావన్‌లాల్ వర్మ, యశ్‌పాల్, జైనేంద్రకుమార్, అశ్క్, అమృత్‌రాయ్ మున్నగువారు మొదట్లో ఉద్యోగాలు చేసినవారే, లేదా ప్రచురణలపనితో సరిపెట్టుకున్నవారే. కాని రాఘవకు అలాంటి సౌకర్యాలేవీ లేవు. అంతేగాక అతడు కావాలనే తనను తాను ఒక చీకటిబొయ్యారంలోకి నెట్టుకున్నాడు. ఒక వైపు ఎలాగూ బయటపడే

దారి లేదు. మరోవైపు బయటపడడానికి వీలులేకుండా ముళ్ళదడితో మూసుకున్నాడు. అందులో అతడు జీవితమంతా రక్తసిక్తమై విలవిల లాడుతూ కూడా బయటపడే మార్గం చూసేవాడు కాదు. మార్గాంతరాలపై అతడికి నమ్మకం ఉండేదికాదు. ఈ దుస్థితిలో అతడికి మిగిలినవి రెండే రెండు మార్గాలు – ఒకటి తన అహంతో రాజీపడి సాహిత్యాన్ని జీవికగా వదలి జీవితాన్ని కాపాడడమో లేక సాహిత్యంతోనే తృప్తిపడి తన అహాన్ని బుజ్జగించడమో! రాఘవ రెండోమార్గాన్నే ఎన్నుకున్నాడు. అతడు అహాన్ని చంపుకుని జీవితంలో రాజీపడివుంటే ఇంతగా రచనలు చేసేవాడు కాదు. కష్టనష్టాలు అతన్ని పీడించినా, అకాలమృత్యువు అతన్ని కబళించినా అతని రచనలు మాత్రం చిరకాలం నిలిచివుంటాయనే సత్యాన్ని ఎవ్వరూ కాదనలేరు.

ఎడతెగని రచనా వ్యాసంగం, దానినే జీవనాధారంగా విపరీత పరిస్థితుల్లో కూడా రచనలు మాత్రం కొనసాగించడం అతని అంకితస్వభావానికీ, జీవితాశయానికీ గొప్పవిజయం. అది ముందుతరాల రచయితలకు నిత్యప్రేరణ. అతని పట్టుదల, మంచి – చెడులను పేర్కొంటూ "లహర్" లో చెప్పినదాన్ని ఇక్కడ తిరిగి ఉటంకిస్తున్నాను.

"శరీరాన్ని అమ్ముకునే వృత్తిని ఒకసారి స్వీకరించాక ఆ స్త్రీ పోరాడి బయటపడడం ఎలా అసాధ్యమో, సమారు అలాగే రచనావ్యాసంగాన్ని జీవికగా స్వీకరించిన రాఘవ తనదుస్థితినుండి బయటపడడం కూడా అంతే అసాధ్యం. ఈ దుస్థితిలో మానవుడిని నాలుగువైపులనుండి సంకెళ్ళు వెంటాడతాయి – వాటిలో కొన్నికనిపిస్తాయి, మరికొన్ని కనిపించవు. ఈ విషమ పరిస్థితి ఏ రచయితనైనా లొంగదీసి చెడుఫలితాలవైపు నెట్టుతుంది. స్థితప్రజ్ఞుడుగా రాఘవ అన్నిటినీ తట్టుకుని నిలిచాడు, పట్టు వదలలేదు. ఫలితం ఏమిటని ఆలోచించలేదు. ఆ పట్టుదలతోనే కొన్ని రచనలు చేస్తూ ప్రకాశకుల కోరికలను మన్నించడం అతడికేనాడూ పట్టింపుగాలేదు. దాన్నతడు తప్పుగానూ భావించలేదు. షేక్స్‌పియర్ నాటకానువాదాలు, సామాజిక శాస్త్రాల గ్రంథావళి అతడు సునాయాసంగా రాయగలిగింది

అందువల్లే, ప్రకాశకులు రాఘవను అమ్ముడుపోయేవి, గొప్ప విషయాలకు సంబంధించినవి – అటువంటి రచనలు చేయమని బలవంతపెట్టి వుంటారు. అవీ, ఇవీ కావాలని తొందర కూడా చేసివుంటారు. రాఘవ సవ్యసాచిలా అవీ తీసుకొండి, ఇవీ తీసుకోండి అనే ధోరణిలో రచనలు – వాటిని తన అవసరం మేరకు వేగాతి వేగంగా – అందించివుంటాడు. ఈ పరాధీనతను ఓ మేరకు అర్థంచేసుకోవచ్చు. కానీ నిజం అది కాదు. అదే నిజమైతే, రాఘవ రచనలను అర్థం చేసుకోవడానికి అడ్డంవచ్చే అవరోధాలు సులభంగానే తొలగిపోయేవి. ఆచ్ఛాదనగా మారిన అతడి రచనా–వ్యాసంగశాపం కూడా అవలీలగానే బోధపడేది. ఇందుకు భిన్నంగా కూడా అతడి రచనలు సాగాయి. అతడి మహత్తర రచనలు సైతం ఈ పరాధీనవేగంనుండి రాలిపడ్డ వాస్తవాలే. ఈ దుస్థితిలో వెలుపడినందువల్లే అతడి గొప్ప రచనలు సైతం నాటి వత్తిళ్ళ ప్రకోపానికి నల్లబడక తప్పలేదు. నాటి సామాజిక జీవితానికి అద్దంపట్టిన నవల 'ముర్దోంకాటీలా" – కాని అదికూడా రాఘవ రచనావేగంలో ముక్కచెక్కలైంది. జీవితవ్యాఖ్యానంగా మొదలైన ఆ నవల చివరకు ప్రేమ, ఈర్ష్య, వాంఛల, చాపల్యాల, అంతర్ ద్వంద్వాల అభూతకల్పనలుగా కుంచించుకుపోయి, గొప్ప రచనావస్తువు దెబ్బతిని చతికిలపడడం అతడి రచనావైఫల్యమేనని చెప్పక తప్పదు. ఒకే ఒక మాసకాలంలో గీకి పారవేయబడిన మరో నవలారాజం "కబ్‌తక్ పుకారూన్" – కథాకథనంలో సమతూకం చెడడంవల్ల శిల్పం భారమై, వస్తువు ఘోరమై, అద్భుత ఘట్టాల సమాహారమై చమత్కార విశేషంగా ఆ నవల తేలిపోతుంది. ఒక గొప్ప రచన చదువుతున్నామనే అనుభూతి పోయి, ఒక అపరాధ పరిశోధకనవల చదివామనే కుతూహలం కొండకెక్కకుండా మిగులుతుంది!" (ఇది టీవీలో సీరియల్‌గా వచ్చింది కూడా)

– (లహర్ – సెప్టెంబరు, 1963; పేజీ 63)

రాఘవ మకరపుపట్టులో మరొకరకపు రచనా సంప్రదాయం కూడా బయటపడుతుంది. ఇతర రచయితలకు సమాధానంగా "ప్రతిరచనలు"

చేయడం రాఘవ సృష్టించిన సంచలన సంప్రదాయం. బంకించంద్ర చట్టోపాధ్యాయ రాసిన 'ఆనంద్‌మఠ్' నవలకు జవాబుగా 'సోనార్ బంగ్లా' కీర్తిని కుదించివేసిన కరువు ఆధారంగా రాఘవ 'విషాద్ మఠ్' అనే ప్రతినవల రాశాడు. భగవతీ చరణ్ వర్మ రాసిన 'టేఢే మేడే రాస్తే' నవలకు ప్రతిగా 'సీదా సాదా రాస్తా' రాశాడు. జయశంకర్ ప్రసాద్ 'కామాయనీ' కావ్యానికి పోటీగా మేధావి కావ్యం రాశాడు. యశ్‌పాల్ 'దివ్యా' నవలకు జవాబుగా 'చీవర్' నవల రూపొందించాడు. రాం విలాస్ శర్మ రాసిన 'ప్రగతిశీల్ సాహిత్యకీ సమస్యాయే' కి జవాబుగా 'ప్రగతిశీల్ సాహిత్యకే మాన్‌దండ్' అనే అభ్యుదయ కవిత్వలక్షణ గ్రంథం రాశాడు. కన్హైయ్యాలాల్ మున్షీవాదించిన 'బ్రాహ్మణాధిక్యత రక్తశుద్ధి'మున్నగు ఆర్యఔన్నత్య సిద్ధాంతాలకు సమాధానంగా రెండు సంపుటాల్లో 'మహాయాత్రా' రచన చేసి, అభివృద్ధి నిరోధక భావాలను పూర్వపక్షం చేశాడు. అదుపుతప్పిన రచనాబాహుళ్యం వల్ల పోటీ మనస్తత్వంతో 'ప్రతి రచనలు' (ప్యారడీలు) చేయడంవల్ల, అన్ని ప్రక్రియల్లోనూ తలదూర్చడంవల్ల అతడి రచనలగురించి, అతని గురించి అతని జీవితకాలంలోనే ఎన్నో 'వదంతులు బయలుదేరాయి'. రాఘవ రచనావిస్తృతికి వెరచి, ఎవ్వరూ అతని రచనలను ఆమూలాగ్రం చదివి 'కవిహృదయం తెలుసుకునేవారు కాదు. అందువల్లే అతడు ఉపేక్షకు లోనయ్యాడు. అపరిమిత సాహిత్యసృజన అతని జీవితంలో భాగమైపోయింది. రోజూ 18 గంటలదాకా రాసేవాడు. దీని కోసం అతడు ప్రత్యేకించి పాటుపడవలసింది ఏమీవుండేది కాదు. కారణం రచనావ్యస్తత అతని అలవాటుగా, మరోరకంగా చెప్పాలంటే వ్యసనంగా మారిపోయింది.

రాఘవ ఒక నవలను రాసేముందు ఒక ప్రణాళికను రూపొందించుకుని, కథాక్రమాన్ని అధ్యాయాలక్రింద విభజించుకునేవాడు. ఆ రచనా ప్రణాళిక అతని మెదడులో ఎల్లప్పుడూ ఉండేది. అధ్యాయాలను అతడు ఒక వరుసక్రమంలో రాయాలనే పద్ధతిని ఉల్లంఘించి, చివరి ఘట్టాన్ని ముందు, ముందు ఘట్టాన్ని చివర రాసేవాడు. అతడి జ్ఞాపకశక్తి, ధారణా నైపుణ్యం, భావుకతాకౌశలం అలాంటివి. ఈ మార్పువల్ల కథాక్రమం ఏమాత్రం చెడేది కాదు. లక్షలాది సంవత్సరాల మానవ వికాసాన్ని సజీవ

పాత్రలద్వారా క్రమం తప్పకుండా హత్తుకునేట్లు ఎంతో గొప్పగా చిత్రించేవాడు. రచనాశక్తి, కల్పనా వైచిత్రి, భావుకతా బాహుళ్యం అతడికి అలవాటైన సాహిత్యకళానైపుణ్యాలు. అతడి రచనా సామర్థ్యానికి కొందరు అసూయపడేవారు కూడా. వైవిధ్యంగల అతడి ప్రజ్ఞాపాటవాలు సాహిత్య జగత్తులోనే అనితరసాధ్యాలు.

రచనలు చేస్తుండగా మధ్యలో అలసట వస్తే దేవకీనందన్ ఖత్రీ నవలల ప్రస్తావన తెచ్చుకుని కాలక్షేపం చేసేవాడు. దానితోపాటు అతని కల్పనావైభవాన్ని నతమస్తకుడై గౌరవించేవాడు. సరదాలో కూడా సాహిత్య ప్రమాణాలను, విలువలను చులకన చేసేవాడు కాదు.

మిత్రులకు రాసే లేఖలను సరదాకోసం నవ్వులాటగా ఉపసంహార భాగంనుండి ప్రారంభించేవాడు. "మీరాంగేయ్ రాఘవ్" అని ప్రారంభించే అతడి లేఖారచన తీరకు కొందరు ఆశ్చర్యపడేవారు. ఇలా తుదిమొదళ్ళను క్రిందుమీదు చేయడం ఒక రచనా శిల్పంగా అతడినవలల్లో చోటుచేసుకుంది.

రాఘవ రచనా వ్యాసంగమంతా తరచూ వైర్, ఆగ్రా, జయపూర్‌లలోనే కొనసాగింది. వీటిలో వైర్‌కు చాలాప్రాముఖ్యత ఉంది. ఆగ్రా–రాజస్థాన్ పొలిమేరల్లో ఉండే భరత్‌పూర్‌లోని కుగ్రామమే వైర్. అక్కడే రాఘవ తాతలనాటి నివాసగృహం ఉంది. ఏ ఆధునిక సౌకర్యాలూ అక్కడ లేకపోయినా, రాఘవ రచనాలోకమంతా అక్కడే విరాజిల్లింది.

రాఘవ సతీమణీ సులోచన వైర్ గ్రామానికి తన వివాహంకన్నా కొంచెం ముందువచ్చి, అక్కడి ప్రశాంతవాతావరణానికి ప్రతిస్పందించి రాసిన వాక్యాలు వైర్ పరిచయపత్రాలు :

"– మేము అక్కడికి చేరిననాటినుండి నాకళ్ళు అతనికోసం వెదికేవి. అతడెక్కడా కనిపించేవాడు కాదు. దానివల్ల నాకు నిరాశ తప్పకపోయేది. ఎదురుచూపుల సాయంకాలం కూడా క్రమంగా రాత్రిలో కరిగిపోయేది. అప్పుడు విశాలమైన దివాణంలోకి మారుమూలలలో ఎవరో ప్రవేశించి దీపం వెలిగించేవారు. దానితో అక్కడి చీకటేగాక, నా మనస్సునలుముకుని

ఉన్న గాఢాంధకారం కూడా తొలగిపోయేది. ఆ క్షణికానందం తీరీతీరకముందే, వెలిగించిన దీపాన్ని చేతబట్టుకొని అతడు తన రచనామందిరంలోకి నిశ్శబ్దంగా వెళ్ళిపోయేవాడు. ఆ నిష్క్రమిస్తూన్న ఆకృతిని చూస్తూ, చేసేది లేక మౌనంగా ఉండిపోయేదాన్ని. అంతా ఒక రహస్యగాథాగమనంలా తోచేది. ఆ ఇల్లు అతివిశాలంగా ఉన్నా అతిప్రాచీనంగా ఉండేది."

["పునః"; పేజీ – 5]

ఈ సందర్భంలోనే సులోచన మరికొంత వివరిస్తూ రాఘవ వ్యక్తిత్వాన్ని పరిచయం చేసింది :

"నా బొంబాయి ప్రయాణానికి ఒకరోజు ముందు, తన రచనామందిరాన్ని చూపించడానికి అతడునన్ను ఆహ్వానించాడు, లోనికి, వెళ్ళగానే, నేనొక మున్యాశ్రమంలోకి ప్రవేశించినట్లు అనిపించింది. తాను కూర్చొని రాసుకునే స్థలంచుట్టూ పుస్తకాల రాసులు ఉన్నాయి. కలం. కాగితాలు మరో రచనావ్యాసంగానికి త్వరపడుతున్నాయి. బహుశా ఇవే ఆ సాహిత్యముని సాధనసంపత్తి కాబోలు! ఆ గది వెనుకభాగంలో తెరచిన కిటికీ ఉంది. ఆ వెనుక చాలాదూరందాకా విస్తరించిన పూలతోట ఉంది. ఆ తోటనుండి వీచే చల్లని సువాసనతెమ్మెరలు ఆ గదినంతా రసమయంచేస్తున్నాయి. పూలతోటమీద పరచివున్న నీరెండ వెండిలా ప్రకాశిస్తూ నేత్రపర్వం చేస్తూవుంది. వటవృక్షంలో మొలకెత్తిన చివుళ్ళు, వాటిమధ్య పక్షుల కలరవాలు ఆ వాతావరణాన్ని నాదమయంచేస్తున్నాయి. బహుశా ఈ ప్రకృతిశోభేనా ఈ కాళిదాసును రచనాలోకంలోకి తీసుకెళ్ళడానికి పూర్వరంగం సృష్టిస్తుంది కాబోలు!..." [అదేపుస్తకం – పేజీ 7–8]

ఈ సంఘటన జరిగిన ఒక సంవత్సరంతర్వాతే సులోచన గృహిణిగా ఆ ఇంట్లో ప్రవేశించింది. ఎవ్వరో సుదూరతీరాల్లో ఒక అపరిచితయోగి పిలిస్తే, సర్వంవదిలేసి పిచ్చిగా పరుగెత్తే చిన్ననాటి సుందరస్వప్నదృశ్యం నిజమైనాడు సాక్షాత్కరించినట్లు అప్పుడు ఆమెకు గృహప్రవేశకాలంలో తోచింది. ఆమె ప్రథమ సమాగమం కూడా సహజసంప్రదాయానికి భిన్నంగానే జరిగింది. జీవితపు రసమయఘట్టాల్లో కూడా రాఘవ

మనోప్రపంచం రచనా ప్రణాళికలలో భావావేశపూరితమై ఉండేది. అతడికి భౌతికావసరాల ధ్యాసే తక్కువ. స్పర్శల సమాగమసంబరమే మృగ్యం. అప్పుడే అతడు శాంతినికేతనం, దర్శించివచ్చాడు. కొత్తగా భావావేశాలు అతడి మనస్సును ఆవహించివున్నాయి. ప్రథమసమాగమనానికి నవోఢలా వచ్చిన సులోచనకు తన ప్రణాళికను ప్రణయనియమాలకతీతంగా చెప్పాడు. భారత ప్రాచీన విద్యాపీఠాలైన నలంద, తక్షశిలలాంటి విద్యాపీఠాన్ని అక్కడి వైర్ పరిసరప్రాంతాల్లో స్థాపించదలచినట్లు ఆమెకు తెలియజేశాడు. "నౌలక్ఖా" అనే స్థలాన్ని అందుకు ఎంపికచేసినట్లు, ఆ విద్యాపీఠానికి "తపోభూమి" అనేపేరు నిర్ణయించినట్లు ఆమెకు వివరించాడు... ఇదీ అతని ప్రథమసమాగమ ప్రణయ సన్నివేశ విశేషం!....

తన పూర్వీకుల ప్రాచీనభవనంలోకి ముప్పిరిగొన్న మనస్సుతో ప్రవేశిస్తున్న అర్ధాంగి సులోచనకు స్వాగతం చెబుతూ రాఘవ – ఆ ఇంటి ప్రతి చిన్నవస్తువుతోనూ పరిచయంచేసుకోమని మరీమరీ కోరాడు. ఈ సందర్భంగానే రాఘవ "పరిచయ్" అనే శీర్షికతో రాసిన సుదీర్ఘకవితలో అతని శ్రీమతి కేంద్రబిందువుగా ఉంది. ఈ ప్రణయకావ్యం హిందీసాహిత్య ప్రపంచంలోనే అద్వితీయమైన ప్రేమకవిత్వం. ఇది ఆనాటి రాఘవ మానసిక పరిస్థితిని తెలియజేసే అక్షరదర్పణం.

వారి వివాహం తర్వాత వైర్‌వాతావరణంలో వర్షఋతువు ప్రవేశించింది. అక్కడి శూన్యాకాశంలో ఉరుములు మెరుపులు నిండిపోయాయి. రంగురంగుల ఇంద్రధనుస్సు 'ప్రకృతినే సింగారించింది. ఆ వర్షాగమనవేళలో రెక్కలు విప్పుకొని ఇంటిపైకప్పు మీదికి ఎగిరే నెమలి సులోచనకు మరిదిగారిలా తోచేది, ఇరువైపులా నిలబడిన నేరేడుచెట్లు ఇరుగుపొరుగు గృహిణుల్లా పలకరించేవారు, ఎదురుగా నిలబడిన "బరగద" వృక్షం' సాక్షాత్తూ మా బావగారు!

"వృక్షవటము మీ బావగారూ
శిరసువంచి నమస్కారం చేయరాదూ!
విస్తరించిన దీని చల్లనినీడలోనే

కావ్యగీతాలెన్నో నేను రచన చేశాను!...."

".... గ్రీష్మం తన ప్రతాపాన్ని చూపించడానికి రంగ ప్రవేశం చేసింది. ఇక్కడి ఎండకు జింకలు కూడా నల్లబడతాయి. గ్రీష్మతాపాన్ని ఎదుర్కోవడానికి కరెంటులేని ఆ రోజుల్లో మానవప్రయత్నాలు విస్తృతాలు. పగటిపూట ఇంటితలుపులు, కిటికీలు పూర్తిగా మూసేసీ గదులను చీకటిగా చేసేవారు. పైకప్పుకు ఇంటిలో కిందికి వేలాడే పెద్దగుడ్డపంఖాలుండేవి. వాటికి తాళ్ళు బిగించి అస్తమానం లాగుతూ వాటికింద అందరూ విశ్రమించేవారు. దానివల్ల కొంత ఉపశమనం కలిగేది. ఈ లాగుడు పంఖా కిందికి ఇంటిల్లిపాదీ జనం చేరేవారు. దీని కిందికి అతడు వచ్చిన సందర్భాలే తక్కువ. ఎప్పుడైన ఉపశమనానికి వస్తే – తాడులాగే కుర్రవాడిని (గప్పు) ఆడుకోమని పంపేసేవాడు. ఆ తర్వాత తాను నేలమీద ఆ పంఖాకింద బోర్లాపడుకొని కాలివేళ్ళతో పంఖాతాడు లాగుతూ రచనా వ్యాసంగం కొనసాగించేవాడు. నేనలాగే చూస్తూఉండిపోయేదాన్ని. రాత్రిపూట విపరీతంగా వచ్చే వానపురుగుల (ఉసిళ్ళు) బెడదను తప్పించుకోవడానికి అతడు ఎన్నోజాగ్రత్తలు తీసుకునేవాడు. నవారు ఊడదీసిన పందిరి మంచంలో కుర్చీ, రాసుకునే బల్లా అమర్చి, లాంతరు వెలిగించి. పైనుంచి దోమతెరను నేలదాకా వేలాడదీసేవాడు. ఇలా ప్రకృతి ఆటంకాలకు ప్రతి ఉపాయాలు చేస్తూ, నిర్విఘ్నంగా సర్వకాలసర్వావస్థలయందు తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించేవాడు. ఎప్పుడూ ఎక్కడా అట్టహాసాలుండేవి కావు. నిరాడంబరత, పట్టుదల అతని ప్రత్యేకతలు, ఒక రచన పూర్తికాగానే అందలి విశేషాలను ఇంటివాళ్ళకు, గ్రామప్రజలకు వివరించేవాడు...."

[అదే పుస్తకం, పేజీ 29]

సులోచన గృహప్రవేశవేళ, ఇంటిలోని ప్రతివిషయంతోనూ, వస్తువు తోనూ పరిచయంచేసుకోమని రాఘవ కోరడంలో ఎంత అర్థంనిండివుందో ఇప్పుడర్థంకాకపోదు. వైర్ నివాసగృహపరిచయమంటే రాఘవతో పరిచయమని సారాంశం. ఈ గ్రామంలో కోట, శిథిలాలు, సెలయేరు, పురావస్తువులు, పుష్కలంగా లంభించే ప్రకృతిశోభ రాఘవ రచనాసంకల్పాన్ని

విజయప్రదం చేయడానికి ఎంతగానో ఆత్మీయుల్లా తోడ్పడేవి.

సాయంత్రం కాగానే రాఘవ నియమం తప్పక కాలినడకన వాహ్యాళికి వెళ్ళేవాడు. "భయ్యాజీ" అంటూ గ్రామప్రజలు సోదరప్రేమతో అతడిని గౌరవించి అభిమానించేవారు. వారితో మాట్లాడడం, వారి సుఖదుఃఖాలలో పాలు పంచుకోవడం, రాఘవ నిత్యవిధుల్లో ఒకటి.

ప్రేమచంద్ తర్వాత, మారుతున్న గ్రామీణ జీవనపరిస్థితులను రాఘవ తనరచనల్లో విపులంగానే చర్చించాడు. అవన్నీ వైర్ గ్రామీణ జీవన ప్రతిబింబాలే. పథ్‌కాపావ్, రాయి ఔర్ పర్వత్, ఆఖరీ ఆవాజ్ మున్నగు నవలల్లో చిత్రితమైన గ్రామీణ జీవితం వైర్ గ్రామీణ జీవిత ప్రతిరూపమే.

తన రచనావ్యాసంగానికి ప్రేరణనిచ్చి ప్రోత్సహించిన కుటుంబాలను బంధువులను, మిత్రులను ఆత్మీయులను రాఘవ ఆయాసందర్భాల్లో పలుమార్లు పేర్కొన్నాడు. వైర్‌గ్రామవృత్తుల విభిన్నజీవిత విశేషాలను రాఘవ తన రచనల్లో వర్ణించాడు. ధర్తీమేరా ఘర్, కబ్‌తక్ పుకారూ, గదల్‌లాంటి రచనలు వైర్ మట్టిలోనే పుట్టి మెరసిన మాణిక్యాలే. ఆర్ద్రతతో నిండిన సజీవభాష, జీవితపు ఉద్రేకఘట్టాలో అంతఃకరణను ప్రదర్శించే మానవసంస్కారం, సామాజిక పరిణామక్రమంలో మారుతున్న పరిస్థితులు, వాటిని అంటివున్న జీవితాలు, వాటినర్థంచేసుకునే అవగాహన ఒక ఉత్కృష్టరచనకు కావలసిన విశేషాలన్నీ రాఘవకు వైర్‌గ్రామంలోనే లంభించాయి. వాటిని అతడు సద్వినియోగం చేసుకున్నాడు.

రాఘవ కలలతోపాటు జీవించివుండే జవజీవాలవ్యక్తి. ఒకరకంగా చూస్తే అతడి పరిపూర్ణ అస్తిత్వమే కలలతో తయారుచేసినట్లుగా ఉండేది. అతడు ఒకవైపు బానిసత్వం, దోపిడీలనుండి విముక్తిని కోరే అపరిమిత జ్ఞానపిపాస, చైతన్యంగల మానవుడి సాంఘికస్వప్నాన్ని చారిత్రిక పరిణామక్రమంలో చూస్తూనే, మరోవైపు ఒక రచయిత ఆత్మవిశ్వాసంతో తనను తాను సుప్రతిష్ఠితం చేసుకుని, గౌరవమర్యాదలతో కనీస అవసరాలు తీరుతూ సర్వస్వతంత్రంగా జీవించాలనే స్వప్నాన్నికూడా దర్శించేవాడు.

ఇలా రెండుకలలను ఒకేసారి దర్శించినవారు వాటిని నిజంచేయడానికి పోరాడినవారు రచయితల్లో చాలా అరుదు.

చారిత్రక నేపథ్యంలో ఏనాడో తను మానవతా నిబద్ధతల పర్యవసానంగా కల్పించుకున్న ఊహాజగత్తు ఆధారంగా, స్వప్నాల సహకారంతో మానవుడి విజయయాత్రామార్గాలను నిరంతరం అన్వేషించేవాడు రాఘవ. అన్వేషణాపోరాటాలే అతడి సాహిత్యవ్యక్తిత్వ పరిచయాలుగా నిలిచిపోయాయి. విరుచుకుపడే జీవనదుర్భరదృశ్యాలేవీ అతన్ని మార్గచ్యుతుణ్ణి చేయలేకపోయాయి. అజేయమైన దృఢదీక్షా సంకల్పాలవల్ల హిందీసాహిత్యరంగానికి ఎంతోమేలు జరిగిందనే యథార్థాన్ని అతడి ప్రత్యర్థులు సైతం ఒప్పుకుంటారు.

ఉద్యోగం చేయరాదనే మొండిపట్టుదలను కుటుంబంలోని వారంతా వ్యతిరేకించినప్పటికీ, దానిని జీవితమంతా చేదునిజాలమధ్యకొనసాగించాడు. నిష్కారణంగానే కొందరు కేవలం పట్టుదలలవల్ల గౌరవానికి బహిష్కృతులు కావడం కూడా కద్దు. విపరీతాలమధ్య జీవితాలను బలిపెట్టి, పట్టు సడలనీయకుండా చివరదాకా తమదృఢసంకల్పాన్ని పెంచిపోషించి కృతకృత్యులైనవారు చాలాతక్కువగానే ఉంటారు.

సులోచన తన భర్తపట్టుదలను, సంవేదనను సహృదయతతోనే అర్థం చేసుకుని, జీవితపుయథార్థాలను భరించేది. అందుమూలాననే ఆమె రాఘవకు చివరిదశలో ఢిల్లీనుండి వచ్చిన ఉద్యోగపు ఉత్తర్వును అతడిదాకా పోనీయకుండానే చించివేసింది.

సులోచన చదువు, కుటుంబావసరాలు, ఎంతకూ చికిత్సకు లొంగిరాని రాఘవ క్యాన్సరువ్యాధి, విరుచుకుపడే జీవితావసరాలు, డబ్బు తప్పనిసరిగా కావలసివచ్చే అన్ని సందర్భాలు రాఘవను ఊపిరి సలపనీయకపోగా, ఎప్పుడు లొంగదీసి కట్టుబానిసను చేసుకోవాలా అని ఎదురుచూసేవి. రాఘవ అన్న జిల్లా ఆధికారిగా మంచి ఉద్యోగంలోనే ఉండేవాడు. అతడి పోషణ భారంలోనే రాఘవకుటుంబం కొనసాగేది.

ఆకారణంగా ఎప్పుడైనా ఎవరైనా అతడి రచనావ్యాసంగాన్ని చులకనచేసి చూస్తే రాఘవ ఏమాత్రం సహించేవాడు కాదు.

రాఘవ ఉన్నతవిద్య పూర్తికాగానే, అతడు ఉద్యోగం చేయదలచుకోలేదని ఎవరో అతడి అన్నగారికి లేఖ రాశారు. దానికి జవాబుగా అన్నగారు "ఫరావాలేదు. వాడిని పంపించండి. ఇక్కడే పడివుంటాడు" అని ప్రత్యుత్తరం ఇచ్చాడట. ఇది తెలిసిన రాఘవ చాలకాలందాకా తన అన్నవైపు తొక్కి కూడా చూడలేదు. అలాగే మరోసారి అతడు బొంబాయి టాటా ఆసుపత్రిలో రోగపీడితుడై రోజులు లెక్కిస్తున్న రోజుల్లో అన్నగారినుండి వస్తుందనుకున్న డబ్బురాలేదు. ఈ ఆలస్యంవల్ల అతడి రోగపరీక్షలు, చికిత్స కుంటుపడ్డాయి కూడా. రాఘవ మనస్సు కకావికలైంది. ఆ తర్వాత అన్నగారినుండి ఒక్కపైసాకూడా స్వీకరించరాదని భీష్మప్రతిజ్ఞచేశాడు. భార్య బంగారునెక్లెసు, గాజులు అమ్మి, అప్పటి ఉపద్రవంనుండి బయటపడడానికి ప్రయత్నించినట్టు అతడి శ్రీమతి సులోచన తన జ్ఞాపకాల రచన "పునః"లో రాసివుంది. రోగచికిత్సకోసం బొంబాయి వెళ్ళే సందర్భంలో అతడు వివాహంలోలభించిన సమస్త వెండిసామగ్రిని అమ్మి, నాటి డబ్బుకొరతను తీర్చుకున్నాడు. ఇలాంటి ఆర్థిక ఇబ్బందులు, భద్రతాలేమి అతడి స్వప్నాలను లొంగదీయడానికి నిరంతరం ఢీకొనేవి. అతడు పట్టణంలోనే కాపురం పెట్టి, భార్యాబిడ్డలకు కనీససదుపాయాలు కలిగించాలని తీవ్రంగా ఆలోచించేవాడు. ఈ కారణంగానే అతడు "వైర్"గ్రామంనుండి జయపూర్‌వచ్చేశాడు. తన ఇష్టప్రకారం జీవితం కొనసాగించే ఆకాంక్ష సఫలీకృతం కాబోతున్నందుకు సులోచన ఈ సందర్భంగా చాలాసంబరపడింది కూడా, తాతలనాటి ఇత్తడి పందిరిమంచాన్ని మార్చడంవల్ల అది సోఫాగా రూపొంది, ఒక సింహాసనంలాగా ఉండేది. అతడు ఫర్నీచరును తన ఇష్టప్రకారం తయారు చేయించాడు, వంటశాల విశాలంగానేకాక అందులో నిండివున్న పాత్రసామగ్రిని చూస్తే ఏ గృహిణికైనా అసూయకలిగేది. స్వయంగా బజారుకు వెళ్ళి లక్ష్మి, గణపతుల విగ్రహాలు తెచ్చి నాటి దీపావళిపూజను చాలాబాగా నిర్వహించాడు. ఈ సారి కూతురు పుట్టినరోజు పండుగను చాలాఘనంగానే చేయాలని సంకల్పించాడు.

ప్రణాళికలు వేయడం, వాటిని సాధించడానికి అంకితమై పనిచేయడం రాఘవ వ్యక్తిత్వ విశేషం. అలానే అతడు ఒక కొత్తగృహాన్ని నిర్మించాలని ఒక రూపురేఖను తయారు చేశాడు. ఇంటి నక్షాను, దాని విశేషాలను తరచూ మారుస్తూ, ఆ ఇల్లు ఎలా ఉండబోతూందో ఊహల్లో లీనమై చెబుతూ, తాను సంబరపడుతూ తన భార్యను సంతోషపెట్టేవాడు. అతడీ గృహనిర్మాణ ప్రణాళికలో ఎలా తనమునకలై ఆలోచించిందీ 'భూమిక' అనే రచనలో విస్తారంగా వివరించాడు. ఒకవైపు అతనిలో చాలాసామాన్యంగా కనిపించే కలలు ఉండేవి. మరోవైపు అతని భార్య వైర్ గ్రామంలో తెల్లని గుడ్డను రంగులో అద్ది చీరగాధరించే దుర్భరపరిస్థితులు గుమికూడి అతడిని కల్లోలపరిచేవి. దీనిని చూసి అతడు ఆమెను విలియంకపూర్ జాన్శిల్పన్ భార్యతో సరిపోల్చి, జీవితపుకొరతలను సాహిత్యకంగా మలచి కాలభారాన్ని తేలిక చేసేవాడు. జీవితావసరాలు తొందరపెడుతున్న దుర్భరపరిస్థితుల్లో, అతడు చేసేదిలేక తన రచనలను అతితక్కువ రుసుముకే ప్రచురణకర్తలకు ఇచ్చివేసేవాడు. 'కబ్తక్‌పుకారూ' అనే నవలను ఇలాంటి సందర్భంలోనే అతడు కేవలం పదిహేనువందలరూపాయలకు అమ్మివేశాడు. ఇలాంటి కష్టసమయాల్లోనే అతడు అనువాదసాహిత్య రచనకు పూనుకునేవాడు లేదా సాంఘికశాస్త్రాలను వరుసబెట్టిరాసేవాడు. దీనివల్ల అతడి సృజనాత్మకశక్తి, మౌలిక రచనవ్యాసంగం ఆటంకపడి పలుచబడిపోయేవి. ఆర్థిక ఇబ్బందులు, భద్రతాలేమి కారణంగాను, అతడు విరామమెరుగని రచనా శ్రమకు పూనుకునేవాడు. చివరకు అదే అతనికి ప్రాణాంతకంగా పరిణమించింది.

"ఆగ్రాలో 1953లో 'ప్రాచీన భారతీయ ఇతిహాస్ ఔర్ పరంపరా' అనే బృహత్ రచనకు పూనుకున్న సందర్భంలో రాఘవ 21 రోజులదాకా సర్వంమరచి ఒక సమాధిలో ఉన్నట్లు పనిచేశాడు. ఇంతటి ఏకాగ్రతలో కొనసాగిన ఆ రచనాయజ్ఞం ముగిసేనాటికి అతడికి వెంట్రుకలు వేగంగా రాలిపోతున్నట్లు అనిపించింది. శరీరంపట్ల కూడా ధ్యాసలేని అతని రచనాపటిమ సాటిలేనిది. అతడు రచనలో మునిగివున్న సందర్భాల్లో అన్నపానీయాలధ్యాసే ఉండేదికాదు. వెంటవెంటటీలు, సిగరెట్లు సేవించేవాడు...."

[రాంగేయ రాఘవ గ్రంథావళీ; పీఠిక పేజీ – 19]

సుమారు ఈ కాలంలోనే ఆప్తమిత్రుడైన సినీ నిర్మాత సత్యపాల్ శర్మతోపాటు బొంబాయి వెళ్ళి సినీప్రపంచంలో పనిచేసి, రచయితగా సొంతకాళ్ళమీద నిలబడాలనే పట్టుదలకు ఆధారంవెదికాడు. 'సీతామయ్యా, లంకాదహన్' లాంటి పౌరాణిక చిత్రాలకు కథ, సంభాషణలు రాశాడు కూడా, కాని వెంటనే అక్కడి వ్యవహారంతో విసిగివచ్చేశాడు. దీనివల్ల రాఘవ కేవలం సంపాదనాభిలాషగల రచయిత అనిగాక, అతనికి రచనావ్యాసంగంలో కొన్ని ఆదర్శాలున్నాయని స్పష్టం కాగలదు.

రాఘవ "మేఘదూత్ హిందీ అనువాదానికి, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితుడు ఇంగ్లీషులో ముందుమాట రాస్తే, దానిని ఇంగ్లీషులోగాక, హిందీచేసి ప్రచురింపజేశాడు. హిందీపట్ల తనకు గల ప్రేమకారణంగానే తానలా చేసినట్లు, ఇంగ్లీషురాదని, ఇంగ్లీషు అనువాదం చేయలేనని భావించరాదని కూడా రాఘవ హెచ్చరించాడు."

[పైపుస్తకం; పేజీ – 21]

ఆ రోజుల్లో "ఇమేజ్‌కోసం రచయితలు ప్రపంచ ప్రసిద్ధరచయితల రచనలను పనిగట్టుకుని అనువాదం చేసి, నలుగురి దృష్టినాకర్షించేవారు. ప్రచురణకర్తలు అందుకు బలవంతపెట్టేవారు. అలాంటి "ఇమేజ్ కోసంకాక, రాఘవ తన అవసరాల ఒత్తిడిలో షేక్స్పియర్ నాటకాలను ఒకటి రెండురోజుల్లోనే అనువాదం చేసి పారసేవాడు. అన్నిరకాలకొరతలు, అవసరాలు బలవంతపెట్టినప్పటికీ, ఇమేజ్‌లాంటి ప్రతిష్ఠాత్మక విషయాలు వెంటాడినప్పటికీ రాఘవ సృజనాత్మక అహం ఎక్కడా దెబ్బతినకుండా అష్టకష్టాలు పడుతూ ఆత్మాభిమానంతో వైపరీత్యాల మధ్య పోరాడేవాడు. బహుశా ఈ కారణంగానే అతడి రచనల్లో కవికళాకారుల పాత్రలు చాలా ఉదాత్తంగా చిత్రింపబడివుంటాయి. కాళిదాసు, గోరఖ్‌నాథ్, విద్యాపతి, కబీర్, తులసీదాస్, బిహారీ, భారతేందు హరిశ్చంద్రవర్మకు రచయితల ఆత్మగౌరవస్వరూపాలు ఆ విధాంగానే వెలుగుచూశాయి.

'ముర్దోంకాటీ'లా నవలలోని విల్లభితమ్లార్ కవి, 'మహాయాత్రా రెండోభాగం'లో కనిమ్కనిగాథకు సంబంధించిన కవి 'మహాత్మచేత్',

'రాహ్‌నరుకీ నవలలో ఆచార్య కర్‌వీర్, అతని నిరుపేదశిష్యుడైన కవి మున్నగు పాత్రలన్నీ కల నిజాలమధ్య కొట్టుకునే ఉద్రిక్తభావాలు' – అలాంటి జీవన ఉద్రిక్త యథార్థాలనుండి రాఘవకూడా నిత్యజీవితంలో ఎన్నడూ విముక్తి పొందలేదనేది గమనార్హం.

విశ్వవిఖ్యాతమైన అశ్వఘోషునికి బౌద్ధులరాజాశ్రయం లభించింది. అందువల్లే అతడి కావ్యాలు, దర్శనాలు ప్రచార స్వభావంవల్ల బరువుగా ఉండిపోయాయి. సుమారు అశ్వఘోషుని యథార్థాన్ని దృష్టిలో ఉంచుకునే రాఘవ 'మహాయాత్ర రెండో భాగంలో కనిష్కునిగాథ సందర్భంగా 'మాతృచేత్' పాత్రను సృష్టించాడు. ఈ కవి పాత్ర అశ్వఘోషునిలాగాక సర్వస్వతంత్రంగా బతికిన కవి.అతని గీతాలు అందువల్లే ఆసేతుహిమాచలం ప్రసిద్ధికెక్కాయి. దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవించినప్పటికీ మాతృచేతుడు తన ఆత్మగౌరవానికి, రచనాతేజస్సుకు క్షతి కలుగకుండా పోరాడాడు. ధనధాన్యాలకోసం మాతృచేతుడెన్నడూ ఏ రాజుముందూ తలవంచి ప్రాధేయపడలేదు. వాసవిద్వారాలభించిన గౌరవంవల్ల అతడి భార్య వసుమిత్రకు కలిగిన అనుభూతిలో రాఘవ నిజజీవిత సన్నివేశాలు మిళితమై వున్నాయి. 'రాహ్‌నరుకీ' నవలలో కనిపించే నిరుపేదకవి బాధలు, రాఘవ జీవన వైఫల్యాల ప్రతిబింబాలు.

''ఎంతగానో చేసిన సాధన ఒకవేళ ఎందుకూ పనికిరాకుండా పోతే మనిషి ఏమైపోతాడు ? ఔన్నత్యం, ఏ నీచత్వంలోనైతే పెరుగుతుందో, ఆ నీచత్వం ఎప్పుడూ, ఔన్నత్యాన్ని గుర్తించనూలేదు. అర్థంచేసుకేనూజాలదు.

(రాహ్ నరుకి; పేజీ 48)

రాఘవ అనుభవించిన కష్టనష్టాలను నిర్లక్ష్యం చేసి అతడిని విమర్శించిన విమర్శకులపాత్ర కూడా ఈ సందర్భంలో ఎక్కువగానే ఉంది. రామ్‌విలాస్ శర్మ, భగవతీ శరణ్ ఉపాధ్యాయ్‌లాంటి మార్క్సిస్టు విమర్శకులు కూడా రాఘవను సమీక్షించేటప్పుడు అతడిని సమగ్రజీవితంనుండి కాక, ద్రావిడజాతి దృక్కోణంనుండి చూసి, ఆ జాతి కోపతాపాల రచయితగా చిత్రించడం మరీబాధాకరంగా ఉంటుంది. రాఘవ సన్నిహిత మిత్రుల

కథనం ప్రకారం, రామ్‌విలాస్ శర్మ చేసిన ఘాటైన విమర్శలవల్ల సంవేదనాశీలి అయిన రాఘవ ప్రతి విమర్శలకు దిగాడు. ఈ ఖండనమండనలలో వేదనపడి, మార్క్సిజంతో తనకు ప్రమేయంలేదని కూడా రాఘవ అప్పుడప్పుడూ ప్రకటించేవాడు.

తాను అనుభవిస్తున్న మానసిక ఉద్రిక్తతలను, ద్వంద్వాలపోరాటాలను తన రచనల్లో ప్రతిబింబింపచేయడం రాఘవ సాహిత్య ప్రత్యేకతగా ఉండిపోయింది. తన అసంపూర్ణ రచన ''ఉత్తరాయణ్''లో భీష్మునిలాగా తాను ఉండటమేగాక, జీవితసత్యాన్ని, దాని రహస్యాన్ని తెలుసుకోవడంలో విఫలుడైనట్లు రాఘవ కనిపిస్తాడు. తన కౌటుంబిక పరిస్థితుల వత్తిళ్ళమధ్య తనకు జరిగిన అన్యాయం, దోపిడీ, దానివల్ల కలిగిన క్షోభ – వీటికి విరోధంగా లేచిన భీష్మవాణిలో రాఘవ మానసిక సంక్షోభమంతా కరిగి ప్రవహించినట్లు వ్యక్తమవుతుంది. తండ్రి కాముకుడై కొడుకును జీవన సుఖాలనుండి వంచించినా ఆలోచించనవసరంలేదా ? సర్వాధికారాలు లేకుండా పోయినప్పుడు భీష్ముడు తన అంతరంగికక్షోభను బయటపెట్టాల్సిన పనిలేదా ? భీష్ముని మారిన ఈ పరిణితిని ప్రతిబింబించిన ''ఉత్తరాయణ్'' రచనలోని కొన్ని భాగాలను తీసుకొని రాష్ట్రకవి మైథలీశరణ్ గుప్త్ భేదాభిప్రాయాన్ని ప్రకటించాడు. దానికి సమాధానంగా రాఘవ ఒక సుదీర్ఘలేఖను రూపొందించి పంపాడు. 'సంప్రదాయానుసారం పౌరానిక పాత్రలను, వాటి సందర్భాలను తీసుకొని మనం అభిప్రాయాలను ఏర్పరచుకొంటాం. అవి సాంప్రదాయపు చట్రాన్ని దాటిపోలేవు అంటూ రాఘవ తన రచన 'ఉత్తరాయణ్‌లోని భీష్మునిగురించి ఒక సర్వస్వతంత్రభావాన్ని ఆ లేఖలో తెలియజేశాడు.

''సంస్కృతి సంప్రదాయాలకతీతమైన వాస్తవంలో నివసించే మహామానవుణ్ణి నేను భీష్మునిలో దర్శించాను. అతడు రాచమర్యాదలు, అంతఃపుర ఆడంబరాలమధ్య ఉన్నా ఎన్నడూ వాటికిలొంగి ఓడిపోలేదు. ఆ కారణంగానే అతడు ఈనాటికీ సజీవంగా కనిపిస్తాడు. తన వ్యక్తిత్వాన్ని తనకుతానుగా సరిచూసుకునే భీష్ముడు చారిత్రక నేపథ్యంలో లోకవ్యవహారం

దృష్ట్యా కర్తవ్యనిబద్ధుడై కనిపించడం ఉచితంగానే తోస్తుంది. కాని ఆ మహామానవుడు ఇతరులకన్నా ఎంతో ఎత్తు ఎదిగినవాడు. అతడిలో కూడా మానసికద్వంద్వాలు ఘోషపెట్టాయి. కాని వాటినతడు బహిర్గతం చేయడం భావ్యంగా భావించలేదు. సంస్కృతీ సంప్రదాయాల ప్రకారం అతడు అప్పటి కర్తవ్యపారాయణతలో ప్రతిబద్ధుడై ఉన్నాడు. అయినా వైయక్తిక ఔన్నత్యంలో సమగ్రంగా దినదిన ప్రవర్ధమానం అవుతూనే పోయాడు. అతడు లోకవ్యవహారంలో తాదాత్మ్యం చెందుతూ కూడా లోకానికి అతీతంగా నిరాసక్తతలో నిలిచున్నాడు. ప్రాపంచిక విషయవాసనలను, వస్తుమయ జగత్తును పరిశీలించాడు.

(రాంగేయ రాఘవకే పత్ర సాక్షాత్కార్, ఏప్రిల్ 1985, పేజీ 9)

సంప్రదాయం, లోకబాధ్యతలనబడే ద్వంద్వాలు రాఘవ మనస్తత్వంలో ఎక్కువగానే చోటుచేసుకునివున్నాయి. సంస్కృతీ సంప్రదాయాలను లోకబాధ్యత అనే గీటురాయిమీద గీసి వెలగట్టే దృక్పథాన్ని రాఘవ మొట్టమొదటిసారిగా సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. ఈ దృక్పథం ఒక్క హిందీ సాహిత్యంలోనేగాక, మిగతా భారతీయభాషల్లో సైతం ఇదివరకు దుర్లభం. మొత్తం భారతీయ సాహిత్యానికీ ఈ దృక్పథాన్నిచ్చి అతడు గణనీయమైన నవ్యతను, హేతుబద్ధతను సమకూర్చి, ఒక కొత్త ఒరవడికి ఆద్యుడయ్యాడు.

భోగభాగ్యాలపట్ల వైముఖ్యంగలవారు మాత్రమే రాఘవను ప్రత్యేకించి గుర్తించి గౌరవించారు. భోగభాగ్యాల దృష్టి మనిషిని పశువుగా దిగజారిస్తుందనే యథార్థం వారి ఆదర్శం. భోగభాగ్యాల పట్ల కలిగే మక్కువను తృణీకరించి చూసే అతడి అలౌకిక ఋషిమునులను సాంప్రదాయానికి చెందిన ఉన్నత సంస్కారంలాంటిది. 'పక్షి ఔర్ ఆకాశ్' రచనలో కథానాయకుడైన 'ధనకుమారుడు, 'రాహ్ నరుకీ' రచనలోని 'పసిమతి మున్నగు పాత్రలు రాఘవ భోగభాగ్యాల' వైముఖ్యంనుండే పుట్టిపెరిగాయి. 'పసుమతి తల్లి ఆమెను 'తంట్రికూతురా!' అని సంబోధిస్తుంది. సిరిసంపదల విషవలయం, దాని దుష్ఫలితాలు, వాటివల్ల

కలిగిన తాత్త్వికదృష్టి, అది చేసే తత్త్వబోధమున్నగునవి అన్నీ 'వసుమతికి తన తండ్రి అయిన 'ధధివాహన్ నుండి సంక్రమించాయి. వసుమతి తల్లి 'రాణీధారిణి భర్త 'ధధివాహనుడినుండి, కూతురు 'వసుమతి నుండి ఈ వైరాగ్యజ్ఞానబోధను పొందడం కష్టమేమీకాదు. దయ ధనంకన్నా గొప్పది. అది ఉన్నవారే దానిని ఇతరులకు ఈయగలుగుతారు.

భోగభాగ్యాలపట్ల అనాసక్తి కలగడానికి మనిషి సన్యాసిలా మారవలసిన అవసరమూ లేదు. సాధారణంగా ఉంటూనే సంస్కారవికాసంవల్ల. భౌతికవాంఛలపట్ల వైరాగ్యంతో ఉండవచ్చు. అందుకు రాఘవజీవితమే ప్రబలసాక్ష్యం.

తన అనుభవసారంగా 'కబ్‌తక్‌పుకారూ నవలలోని 'సుఖ్‌రా వైరాగ్యభావాన్ని గ్రహించి అన్నమాటలు గమనార్హం : ''సిరిసంపదల మాయాజాలం ఒక పంజరంలాంటిది. ఈ పంజరంలో చిక్కిన మనిషి చిలుక దుస్థితికన్నా క్రిందకి జారిపోతాడు. పంజరం తలుపు తెరిచినా ఆ మనిషి బయటపడడానికి ప్రయత్నించడు.....

[రాంగేయ రాఘవ గ్రంథావళీ – 4; పేజీ – 16]

సిరిసంపదల మాయాజాలం ఏరూపంలోనూ తనపైబడకుండా రాఘవ జీవితమంతా శక్తినంతా ఒడ్డి ఎదిరించాడు. నిజానికి అతనిచుట్టూ ఎలాంటి పంజరమూ లేదు. ఇక అందులోంచి బయటపడేసమస్యే ఉత్పన్నం కాదు.

రాఘవ చైతన్యరాశి. అందువల్లే అతడు తన కాలపు సమస్త సాంఘిక రాజకీయవిషయాలతో మమేకంచెంది ఉండేవాడు. స్వాతంత్ర్యానికి ముందు జాతీయెద్యమంలో పాలుపంచుకుని పోరాడిన ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం మహత్తరమైనది. రాఘవ తన జీవితకాలంలో ప్రజల స్వాతంత్ర్యపోరాటాన్ని సామ్రాజ్యవాదవ్యతిరేక చైతన్యంగా వివేచించిన వైఖరి మిగిలినవారి వైఖరికన్నా భిన్నమైనది.

రాఘవ తండ్రి రంగాచార్యులు వైర్‌గ్రామ జాగీర్దారేగాక,

సీతరామస్వామి దేవాలయం ధర్మకర్తగా కూడా ఉండేవాడు. అర్చక విధులను నిర్వహించేవాడు. ఆశ్రయం కల్పించిన జయపూర్ మహారాజా కిషన్ సింహ్, మూడవదశాబ్దంలోనాటి 'పాపులర్ గవర్నమెంటును ప్రచారం చేయమని అతడికి బాధ్యతలు అప్పగించాడు. నాటి 'పాపులర్ గవర్నమెంటు ఉద్యమవైఫల్యంవల్ల జయపూర్ సంస్థానాన్ని ఇంగ్లీషువారు స్వాధీనం చేసుకున్నారు. అది 'కోర్ట్స్ ఆఫ్ వార్డ్'స్‌లోకి చేరిపోయింది. రంగాచార్య జాతీయభావాలుగల గాంధేయవాది. జాతీయోద్యమంలో అతడు విలీనమై , పాలుపంచుకున్నందువల్ల అతడిపై ఆంగ్లేయుల ఆంక్షలమేరకు రంగాచార్య ఆగ్రావచ్చి స్థిరపడ్డాడు. ఇక్కడే రాఘవ పుట్టి, పెరిగి, చదివి ప్రయోజకుడ య్యాడు. ప్రేమచంద్, యశ్‌పాల్ మాదిరి రాఘవ జాతీయోద్యమాన్ని ప్రత్యేకంగా పేర్కొంటూ రచనలు చేయకపోయినా, అతడికి చిన్ననాటినుంచే జాతీయోద్యమంతో విడదీయరాని సంబంధంఉంది.

సరిగ్గా ఈ సమయంలోనే వామపక్షభావాలు పుట్టి ప్రచారంలోకి వచ్చాయి. వామపక్షభావాలపట్ల, కమ్యూనిస్టు పార్టీ సాంస్కృతికరంగలో రాఘవ ఎప్పుడూ క్రియాశీలంగానే ఉండేవాడు. రచయితకు రాజకీయ చైతన్యం ఉండితీరాలనే వాదానికి రాఘవ ప్రాముఖ్యతనిచ్చినప్పటికీ, రచయిత పార్టీతో మమేకం చెందివుండాలనే వాదానికి అనుకూలంగా ఉండేవాడు కాదు. పార్టీలో చేరిపోతే రచయిత తన రచనాస్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకోగలిగే విజ్ఞతను కోల్పోతాడని రాఘవ అభిప్రాయం. రష్యాలో ఆ రోజుల్లో స్టాలిన్‌యుగ ప్రభావం ముమ్మరంగా ఉండేది. 'జ్దానోవ్ కల్ట్'' అంతటా వ్యాపించి ఉండేది. పార్టీపాలసీలమేరకు రచయితలమీద క్రమశిక్షణకు సంబంధించిన ఆంక్షలు కొనసాగేవి. దీని పరిణామంగా వచ్చిన ఆంతరంగిక వైమనస్యాలు, గీటుదాటిపోరాదనే ధోరణులు చూసి రాఘవ అసంతోషంగానే కనబడేవాడు. అయినా అతడు తన కాలపు అభ్యుదయశక్తులతోను, విప్లవభావాలతోనూ మమేకం చెందివుండేవాడు. ఆగ్రా ఆ కాలంలో అభ్యుదయ సాహిత్యోద్యమానికి కేంద్రంగా ఉండేది. రామ్‌విలాస్ శర్మ, ప్రకాశ్ చంద్రగుప్త మున్నగు సుప్రసిద్ధ క్రియాశీల అభ్యుదయ రచయితలేగాక విశ్వంభర్‌నాథ్

రామ్‌గోపాల్ సింహ్‌చౌహాన్, ఘన్‌శ్యాంమ్ అస్థానా, కుందల్‌లాల్ ఉప్రైతి, రాజ్‌నాథశర్మ, రాజేంద్ర రఘువంశి వగైరా యువరచయితలు ఆ రోజుల్లో ఒక టీముగా పనిచేసేవారు. 'ఇప్టా'గా పేరుపొందిన ప్రజానాట్యమండలి స్థానికశాఖ ఆగ్రాలో చాలాచురుకుగా పనిచేసేది. రాహుల్‌సాంస్కృత్యాయన్‌లాంటి మార్క్సిస్టు రచయితలు తరచూ ఆగ్రా వచ్చిపోయేవారు. నాటి సాహిత్య సమావేశాల్లో తరచూ వారి వారి రచనలు చదివేవారు. ఎలాంటి ఆంక్షలు లేకుండా తీవ్రంగా వేడివేడిగా సుదీర్ఘ చర్చలు సాగేవి. పరస్పరంగా బేభేదాభిప్రాయాలు ఎన్ని ఉన్నప్పటికీ, స్పర్థలు కొనసాగినప్పటికీ, ఎంతో క్రియాశీలంగా సాహిత్యసృష్టి విరాజిల్లిన ఉజ్జ్వల అభ్యుదయయుగం ఆనాడు ఆగ్రాను ఆవరించి వుండేది. బెంగాల్ కరువు, దేశవిభజనవల్ల కలిగిన వైక్లబ్యం, ఆపై మతకల్లోలాలు, దేశవ్యాప్తంగా సాగిన కార్మికుల సమ్మెలు, నావికాదళం తిరుగుబాటు, ప్రతిచోటా అమానుషంగా సాగుతున్న బ్రిటీషువారి నిర్బంధకాండ, కిరాతకమైన పోలీసుకాల్పులు మున్నగునవన్నీ 'ముక్తిబోధ్ చైతన్యం'లో బొమ్మకట్టి ''ఎన్నడూ ముగింపుకురాని సుదీర్ఘ కవిత'గా వెలువడిన ప్రజాఉద్యమాల రోజులవి.

బెంగాల్ దుర్భరకరువుపీడుతులను ఆదుకోవడానికి, ఆగ్రా అభ్యుదయ రచయితలసంఘం డా కుంటీ నాయకత్వాన ఒక వైద్యుల బృందాన్ని తూర్పుబెంగాలుకు పంపింది. ఆబృందంతోపాటే రాఘవ ఒక విలేఖరిగా వెళ్ళాడు. కరువు పీడితప్రాంతాల్లో అతడు విస్తృతంగా పర్యటించాడు. మానవజాతిపైన విలయతాండవం చేస్తున్న కరువురాక్షసిభీభత్స దృశ్యాలను, హృదయవిదారక సంఘటలను వివరిస్తూ రాఘవ రిపోర్టులు రాశాడు. విలేఖరి బాధ్యతలను ఉత్కృష్ఠంగా నిర్వహించాడు. ఆ పత్రికారచనల సంకలనమే తర్వాత 'తుఫానోంకే బీచ్' పుస్తకంగా రూపొందింది. 'హంస్' పత్రికకు రాఘవ సీరియల్‌గా రాసి పంపిన వార్తా రచనల్లో కరువువల్ల కలిగిన భయంకరమానవ విషాదాలను మాత్రమే వివరించలేదు. వాటితోపాటు సామ్రాజ్యవాదులకుట్రలను స్పష్టంచేసిచూపాడు. కరువుపీడుతులపట్ల మానవాంతఃకరణతో ఎంతగా ప్రతిస్పందించి రాశాడో,

అంతగానే సామ్రాజ్యవాదుల కుట్రల పట్ల ఆక్రోశిస్తూ నిర్భయంగా హెచ్చరికలు చేస్తూమండిపడ్డాడు. హిందీలో ప్రత్యేకంగా సంఘటనలను చూసి వార్తలు రాసిపంపే ధోరణి రాఘవ రిపోర్టులతోనే ప్రారంభమై ఉన్నత శిఖరాలనందుకుంది.

వంగభాషలో గొప్ప నవలాకారుడైన బంకించంద్ర చట్టోపాధ్యాయ స్వాప్నికజగత్తుగా రూపొందిన "ఆనంద్‌మఠ్ నవలలో జీవగడ్డ కరువువల్ల శ్మశానంగా మారిపోయింది. అక్కడి విషాదాలకు చలించిపోయిన రాఘవ మానవతానిర్వేదంతో పత్రికా రచన శైలిలో తన అద్భుతనవల 'విషాదమఠం' రాశాడు. నవలా రచనలో పత్రికా శైలిని తేవడం బహుశా రాఘవతోనే ప్రారంభమైందని చెప్పాలి.

సుమారు ఆకాలంలోనే గ్వాలియరులో కార్మికులపైన జరిగిన కాల్పులను ఆధారంగా చేసుకొని 'యహ్ గ్వాలియర్ హై' అనే పత్రికా రచన చేశాడు. ప్రజల బాధలను విషాదగాథలుగా చిత్రించి, వాటి వెనుక ఉన్న సామ్రాజ్యవాదుల దోపిడీ కుట్రలను బహిర్గతం చేస్తూ రిపోర్టులు రాసి పత్రికలకు ఈయడం రాఘవ నిబద్ధరచయితగా మొదలుపెట్టిన మంచి సాంప్రదాయం. బ్రిటిషుసామ్రాజ్యవాదుల కుట్రలకారణంగా జరిగిన 'దేశవిభజనను చూసి యశ్‌పాల్, భీష్మ సహానీ మున్నగు పంజాబీ రచయితలు చలించి రాసినట్లు రాఘవ రాయలేదు. ఆ కారణంగానే యశ్‌పాల్ రాసిన ''ఝూటాసచ్', భీష్మ్ సహానీ రాసిన 'తమస్' లాంటి ఉద్రేకాలు రాఘవరచనల్లో లంభించవు. కాని రాఘవ దేశవిభజన నేపథ్యంలో 'తబేలేకా ధుంధలకా' అనే వివాదాస్పదకథను రాశాడు. సుప్రసిద్ధ మార్క్సిస్టు విమర్శకుడు రామ్ విలాస్ శర్మ ఈ కథను చాలా తీవ్రంగా విమర్శించి ఖండించాడు. దేశవిభజనను ఆధారం చేసుకొని రాసే రచన ఏదైనా, అది తప్పక శరణార్థులు సర్వం కోల్పోయి వచ్చిన పంజాబీల నిరాశానిస్పృహలను, వాటి విషాదాలను చిత్రించాలనే భావనకు బద్ధుడై రామ్‌విలాస్ శర్మ రాఘవను తూర్పారబట్టాడు. కాని రాఘవ దృష్టి అందుకు భిన్నమైనది. అతడికి దేశవిభజన ఒక విషాధసంఘటన. రాజకీయకుట్రల దుష్పరిణామం.

పరిస్థితులకు వివశులై పరాధీనత ముందు మోకరిల్లిన ఎదుటివారి దీనస్థితినుండి వీలైనంతగా లాభంపొందాలని చూసేవారు కనీస మానవ నైతిక సూత్రాలను కూడా ఏవిధంగా ఉల్లంఘించి నిలువుదోపిడీకి పూనుకుంటారో ! - ఆ సాంఘిక వర్గదోపిడీ సత్యాన్ని ముందుకు తేవడమే రాఘవ కథ ఉద్దేశం, దీనిని రామ్ విలాస్ శర్మ అర్థంచేసుకోలేకపోయాడు. చారిత్రక సంఘటనలకు, దాని పరిణామాలకు కలతచెందడమే కాదు. ఆ దుర్భర పరిణామాల్లో కూడా స్వార్థపరులు ఏమేరకు దిగజారి, దీనులను దోస్తారో - ఆచేదునిజాలను చెప్పడంకూడా అవసరం. అదీ సాంఘిక బాధ్యత. ఆ సాంఘిక బాధ్యతనే రాఘవ సకాలంలో సక్రమంగా నిర్వహించాడు. వర్గదోపిడీని ఈ కథలో ప్రతిభావంతంగా ఎత్తిచూపాడు.

రాఘవ సర్వస్వతంత్రమైన ఆలోచనలనుండి పుట్టిన అతని స్థిరమైన అభిప్రాయాలపై చాలావివాదం చెలరేగింది. మార్క్సిస్టు విమర్శకులనబడేవారిని, వారి దృక్పథాలకు ఆధారమైన కమ్యూనిస్టు పార్టీ పాలసీలను రాఘవ వ్యతిరేకించిన సందర్భాలున్నాయి. మార్క్స్ భారతదేశం గురించి చేసిన రచనలకు సంబంధించి - అతడి అప్పటి సామగ్రి సేకరణలో బ్రిటిషువారి ఆధారాలు, వాటివల్ల, అధ్యయనంలో, వివేచనలో, సంక్రమించిన అసంపూర్ణతలు మున్నగు మార్క్స్ పరిమితులపట్లకూడా దృష్టిని కేంద్రీకరించి ఆలోచించమని రాఘవ ఇతరులను కోరాడు. అయితే అతడు మార్క్స్ రాజకీయ భావాలతో ఏనాడూ విభేదించలేదు. స్థానిక మార్క్సిస్టులతో విభేదించినంత మాత్రాన, మార్క్సిజంతో విభేదించినట్లు కాదు. నాటి స్థానిక మార్క్సిస్టుల సంకుచిత ఆలోచనాధోరణులకు కలతచెంది, రాఘవ ఆయాసందర్భాల్లో వారికి వ్యతిరేకంగా ప్రకటనలు చేశాడు. వాటి ఆధారంగానే విమర్శకులు రాఘవ మార్క్సిస్టుకాడని ముద్రలు వేశారు. నిజానికి అతడి రచనా బాహుళ్యాన్ని సాకల్యంగా చదివి ఒక అభిప్రాయానికి వచ్చిన విమర్శకులే లేరు. కేవలం పత్రికా ప్రకటనలను ఆధారం చేసుకొని, రాఘవలాంటి నిబద్ధప్రజారచయిత గురించి తొందరపడి వ్యాఖ్యానం చేయడం బాధ్యతారాహిత్యామే కాగలదు. రాఘవ మీద చేసిన విమర్శలన్నీ భ్రమాజనితస్పర్థలేనని చెప్పక తప్పదు.

ఆ వ్యాఖ్యలకు సిద్ధాంతపునాదికాని, వాస్తవాల ప్రమాణం కాని లేవని అతడి రచనలు చదివినవారికి తెలిసిరాగలదు.

రచయిత స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చే రచయిత రాఘవ. రచయితమీద ఉండితీరాలనే పార్టీపాలసీల అంకుశాలను పూర్తిగా వ్యతిరేకించేవాడు. అయితే అతడు సాహిత్యం, సంస్కృతి, కళలగురించి మార్క్స్, లెనిన్ చేసిన సూత్రీకరణలతో చాలామట్టుకు ఏకీభవించేవాడు. కాని నిత్యవ్యవహారంలో పార్టీసమర్ధకులుగా చలామణీ అయ్యేవారి తప్పిదాలను, భ్రమను రాఘవ ప్రతిసందర్భంలోనూ వ్యతిరేకించేవాడు. తార్కికమైన ఈ అభిప్రాయాల వ్యతిరేకత మార్క్సిజం వ్యతిరేకతగా ముద్రపడింది. మార్క్సిస్టు పరిధిలోనే భిన్నాభిప్రాయమని, మైనారిటీ అభిప్రాయమని భావించి, పార్టీసానుభూతిపరులతో ఐక్యత దృష్ట్యా, పార్టీ ప్రయోజనాల దృష్ట్యా, సామాజిక శ్రేయస్సుకోసం రాఘవను దూరం చేసుకోరాదని ఎవ్వరూ బాధ్యతగా ఆలోచించిన పాపాన పోలేదు. పుంఖానుపుంఖంగా రచనలు చేస్తూ కూడా రాఘవ తనకాలపు అభ్యుదయ సాహిత్యోద్యమచర్చల్లో ఎలా పాల్గొన్నాడనేది ఆశ్చర్యకరం! అంతేకాదు, ఆ చర్చల్లో తాను విభేదించే విషయాన్ని స్పష్టంగా, భిన్నాభిప్రాయంగా చెప్పేవాడు కూడా. ఒక సమస్యాపరిష్కారంలో రెండో అభిప్రాయం కూడా ఉంటుందనే సత్యాన్ని నాటి పార్టీ అధినేతలముందుకు నిస్సంకోచంగా తెచ్చేవాడు. అభివృద్ధినిరోధకులు, శ్రమ దోపిడీ కూటమివారు, ఫ్యూడల్‌వాదులు బయట చేసే అభ్యుదయవ్యతిరేక విమర్శలను, దాడులను, ఆరోపణలను రాఘవ ఎదుర్కొని రచనలు చేసేవాడు. మార్క్సిజాన్ని యాంత్రికంగా సాహిత్యానికి అన్వయించే తెలివితక్కువ ధోరణిని రాఘవ వ్యతిరేకించాడు. అతడెప్పుడూ సర్వం తెలిసినట్లు మిగతావారిలా నటించప్రయత్నించలేదు.

చరిత్ర, సంస్కృతికి సంబంధించిన రాఘవ విషయపరిశీలన చాలా విస్తృతమైనది. లోతైన తన ఆలోచనలతో అతడు మానవజాతి సమగ్రవికాసాన్ని చిత్రించడానికి పూర్తిప్రయత్నం చేశాడు. అతడి

కార్యసాధనలో ఎన్నోసవాళ్ళు ఎదురైనా తనవల్లతప్పులు జరుగవనే భ్రమలో తానెన్నడూ ఉండేవాడు కాదు. అంతర్ద్వంద్వాల పోరాటాలను అంగీకరించినవాడు తప్పులకతీతమనే భ్రమలో ఉండడు. మొత్తంగా చూస్తే రాఘవ, 'మానవుడి సుదీర్ఘమైన జైత్రయాత్ర "పైనే దృష్టిని కేంద్రీకరించాడనే" హజారీప్రసాద్ ద్వివేది వ్యాఖ్య నిత్యసత్యం. అతడు మానవవాదాన్ని చర్చించినప్పటికే అది ఎక్కడా అమూర్తభావంగా జటిలమైపోలేదు. డా॥ విశ్వంభర్‌నాథ్ రాఘవ ఆలోచనాధోరణిని చాలా స్పష్టంగా వివరించాడు. అది రాఘవ విమర్శకులకు కనువిప్పు.

"పరిశోధక వ్యాసాలు, చరిత్రగ్రంథాలు, సంస్కృతిమీద చేసిన విమర్శలు, మిగతారచనలు అన్నీ రాఘవ మార్క్సిస్టు దృష్టికోణంతో నేరాశాడు. అతడి మానవతావాదం బూర్జువా మానవతావాదం కాదు. బూర్జువామానవతావాదంలో మనిషిగురించి చక్కని ఆలోచన, సద్భావం మాత్రమే వ్యక్తమవుతాయి. రచనారంగంలో కూడా మానవుడి గురించి అతికోమల భావాలు వ్యక్తమవుతాయి 'సమాజానికి సంబంధించినంతవరకు బూర్జువామానవతావాదుల ఎదుట స్పష్టమైన ప్రత్యామ్నాయ వ్యవస్థ అనేది ఏదీ ఉండదు. వారు సమాజంలో సహజంగానే యథాస్థితివాదాన్నే సమర్థిస్తారు. కాని రాఘవ మనోప్రపంచంలో మానవుడికి సంబంధించినంతవరకు ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థ రూపురేఖలు చాలాస్పష్టంగా ఉండేవి. అవి మార్క్సిస్టు ఆలోచనలతో రూపొందిన సమసమాజ ప్రతిబింబాలు.

[రాంగేయ రాఘవ రచనా సంసార్; పేజీ - 184]

రాహుల్ సాంకృత్యాయన్, యశపాల్ మున్నగు రచయితలలాగా, రాఘవ ఎప్పుడూ మార్క్సిజాన్ని రుజువుచేయడానికి అందుకు పరిసరదృష్టాంతాలను తేవడానికి ప్రయత్నించలేదు. అంతేగాక వాటికి దూరంగా కూడా ఉన్నాడు. తన ఆలోచనా సరళిలోనూ, రచనా క్రమంలోనూ వచ్చే సందేహాలను, పేర్కొని వాటికి ప్రాముఖ్యతనిచ్చాడు. మార్క్స్, లెనిన్‌ల మౌలికభావాలతో అతడు పూర్తిగా ఏకీభవించాడు.

భారతీయ కమ్యూనిస్టు పార్టీ ఆలోచనలతో కూడా అతడికి అంగీకారం ఉంది. కాని పార్టీకార్యకర్తలతోను, వాఖ్యాతలతోను అతడికి తీవ్రమైన భేదాభిప్రాయం ఉండేది. రాఘవతో వ్యక్తిగతంగాను, సన్నిహితంగాను ఉన్న డా॥ విశ్వంభర్‌నాథ్ ఉపాధ్యాయ అతడి స్వతంత్ర ఆలోచనా ప్రవృత్తిగురించి తగిన ప్రమాణాలతో తేల్చిన సత్యాలు ఇక్కడ గమనార్హం.

"సామ్యవాదంనుండి సాంఘిక దృష్టిని, ఆర్థిక న్యాయపద్ధతిని, మానవప్రేమను రాఘవ స్వీకరించాడు. కాని ఆ వ్యవస్థలో ఉండే కొన్ని అంశాలపట్ల అతడు అసమ్మతినే ప్రకటించేవాడు. రష్యాలో సాగుతున్న వీరపూజపట్ల రచనా స్వాతంత్ర్యలేమిపట్ల అతడికి పూర్తిగా వ్యతిరేకత ఉండేది. వర్గరహిత సమసమాజంలో స్వాతంత్ర్యమే లేకుండాపోతే మానవ వికాసమే కుంటపడుతుందని రాఘవ అనేవాడు. వ్యతిరేకించే రచయిత దేశద్రోహిగా పరిగణింపబడకపోతే, అతడికి స్వేచ్ఛగా ఆలోచించి రాసేమినహాయింపు లంభించాలని రాఘవ అభిప్రాయం. కారల్ మార్క్స్‌కు ఆశ్రయం ఇచ్చిన ఇంగ్లాండు ప్రజాస్వామ్యాన్ని అతడు తరచూ ఉదహరించేవాడు. రష్యాలో ఆ వ్యవస్థను వ్యతిరేకించే మేధావిని బతకనిస్తారా? ఈ ప్రశ్న వినగానే పార్టీసమర్థకులు అగ్గిమీద గుగ్గిలం అయ్యేవారు. అది చూసి రాఘవ సరదాపడేవాడు కూడా".

– [అదే పుస్తకం – పేజీ – 185]

రాఘవ చివరిరోజుల్లో అతడి మనసులో చెలరేగే తాత్త్వికస్థాయిలోని ప్రశ్నలను కూడా డా॥ విశ్వంభర్‌నాథ్ ఉపాధ్యాయ పేర్కొన్నాడు. గతితార్కిక భౌతికవాదాన్ని ఆధారం చేసుకొని రాఘవ జీవితమంతా రచనలు చేసినప్పటికీ, ఆ వాదంపట్ల తనకుగల కొన్ని సందేహాలను వ్యక్తంచేసినట్లు డా॥ ఉపాధ్యాయ తెలియజేశాడు. అయినా అతడి రచనావ్యాసంగం నిస్సంకోచంగా జిజ్ఞాసతో ప్రగతిశీలంగా ముందుకు సాగిపోయిందని ఉపాధ్యాయ తేల్చాడు. తనలోని సందేహాన్ని అణచివుంచే అలవాటు రాఘవకు ఉండేదికాదు. అతనిలో చెలరేగే ప్రశ్నలను తీసుకొని, నాటి భౌతికవాదులకు పిలుపునిచ్చి వాటికి సమాధానాలను కోరుతూ సవాళ్ళను

విసిరేవాడు. వాస్తవానికి అతడివద్ద కూడా అసంఖ్యాకమైన శేషప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు ఉండేవి కావు. అతి ప్రాచీనమూ, అతివిశాలమూ అయిన సాంస్కృతిక ఔన్నత్యాన్ని తిరిగి వ్యాఖ్యానించడానికి రాఘవ సాహసించిన విషయం అసాధారణం. మహోన్నత సాంస్కృతిక ఔన్నత్యాన్ని తిరిగి వ్యాఖ్యానించడానికి రాఘవ సాహసించిన విషయం అసాధారణం. మహోన్నత సాంస్కృతిక వారసత్వంలో మానవజాతిని ముందుకు తీసుకుపోయే వికాసధోరణులు ఎక్కడ కనిపించినా వాటినతడు నిస్సంకోచంగా స్వీకరించాడు.

# 2. రాఘవ చారిత్రక దృష్టి

రాఘవ చారిత్రక దృక్పథం వివాదాస్పదం అయింది. ద్రావిడ జాతిపై పక్షపాతబుద్ధితో అతడు చరిత్రను పరిశీలించాడనీ, చివరకు సాంప్రదాయాన్ని సమర్థించే పునరుద్ధరణవాదిగా తేలాడని అతడిమీద నిందలు వచ్చాయి. అతడు ద్రావిడపక్షపాతి అని రుజువు చేయడానికి 'ముర్దోంకాటీలా' నవల 'రావ్‌కీదీపక్' లోని సంకలిత కవితలు ప్రబలసాక్ష్యాలుగా పేర్కొనబడ్డాయి. ఈ కవితాసంకలనంలో తరచూ ఉదహరింపబడే ఒక కవితలో అతడు తన ధమనుల్లో ద్రావిడరక్తం ప్రవహిస్తూవుందని చెప్పాడు కూడా. భగవతీశరణ్ ఉపాధ్యాయ 'ఆలోచన' [పూర్ణాంక్ – 16] పత్రికలో అతడి సుప్రసిద్ధ చారిత్రక రచన 'ప్రాచీన్ భారతీయ ఇతిహాస్ ఔర్ పరంపరా''ను సమీక్షిస్తూ రాఘవ సంప్రదాయవాది అని తేల్చాడు. రాఘవ సమస్తరచనలను ఆమూలాగ్రంగా చదివి బాధ్యతతో చేసిన విమర్శలఫలితాలుగా వచ్చిన వాక్యాలు కావివి. అందుకు భిన్నంగా అతడి రచనల్లోని కొన్ని అంశాలను, వాటి సందర్భంనుండి తాము చేయదలచిన విమర్శలకు అనుకూలంగా విడదీసి చేసిన ద్వేషపూరిత వ్యాఖ్యలవి. ఈ వ్యాఖ్యలన్నీ రాగద్వేషాల మూలంగా ఏర్పడినవేకాని, విషయ వివేచనవల్ల రూపొందినవి కావు. అంతేగాక అవి విమర్శకుల అహంభావాల ప్రేరణాఫలితాలు. రాఘవ తన 'ముర్దోంకాటీలా' నవలకు ముందుమాట రాస్తూ, అందులో డా॥ భగవతీశరణ్ ఉపాధ్యాయను విమర్శిస్తూ, అతడు పురాణాలతత్వం కలవాడని ఆరోపించాడు. డా॥ భగవతీశరణ్ ఉపాధ్యాయను సన్నిహితంగా చూసినవారు, అతడి రచనలను చదివినవారు అతడి అహంభావం ఎంత ప్రబలంగా ఉంటుందో తెలుసుకోగలరు. రాఘవ మృత్యువాత పడిన శోక సమయంలో కూడా 'నిష్ఠ' సాహిత్య పత్రికలో జ్ఞాపకాలపేరిట అతడు చేసిన రచన రాఘవ గురించికాక ఎక్కువగా తనగురించే చెప్పుకున్నాడు. రాహుల్ సాంకృత్యాయన్ కానీ, యశపాల్ కానీ, రాఘవకానీ లేక మార్క్సిస్టు రచయితలెవరైనా కానీ వారిగురించి రాసేప్పుడు భగవతీశరణ్ ఉపాధ్యాయ ముందే ఏర్పరచుకున్న రాగద్వేషాలమేరకు చాలా అహంభావంతో వారిని సమీక్షించేవాడు. ప్రతీసమీక్షలోను అతడికి తన అహం అడ్డువచ్చేది.

తత్ఫలితంగా అతడు గుణదోషాలను సమీక్షించేబదులు, కేవలం దోషాలనే స్వాధిక్యతాభావంతో ముందుకు తెచ్చేవాడు. ఆ దోషాలు కూడా తాను అహంభావంతో చూసిన కళ్ళద్దాలమేరకే ఉండేవి. ఆ కాలానికి సంబంధించిన కథ కావడంమూలాన, అందులో యోగీరాజ్ ప్రస్తావన వచ్చినందువల్ల, తద్వారా ఆ కథలో సమకాలీన వ్యక్తులు పాత్రలుగా కనిపించి, వాస్తవాలు వెళ్ళగక్కినందువల్ల భగవతీశరణ్ ఉపాధ్యాయకు రాఘవ రాసిన 'ముర్దోంకాటీలా' నవల చాలా హీనమైన పనికిమాలిన రచనగా కనిపిస్తుంది. సమకాలీన యథార్థాలు సాహిత్య సృజనలో చోటుచేసుకున్నప్పుడు విమర్శకులు సాపేక్షకంగానే బయటపడతారు.

రాఘవమీద సాగిన వ్యక్తిగతవిమర్శల్లో తర్కబద్ధతలోపించినప్పటికీ, వ్యాఖ్యలు భ్రమా జనితాలుగా ఉన్నప్పటికీ, ఆ సందర్భంగా పేర్కొనబడిన రాఘవ రచనల ఉదాహరణలు నిజాలను బయటపెట్టాయి. నిజానికి చరిత్రను ఎక్కడైనా అతడు ద్రావిడ పక్షపాతబుద్ధితో చూశాడా అంటే దానికి సాక్ష్యాధారాలులేవు. విమర్శకులు ఉటంకించిన సందర్భాలు కూడా తప్పుగా ఉన్నాయి. ఆర్యుల దురాక్రమణ సందర్భంలో పేర్కొనబడిన భారతీయ నాగరికత నిజానికి 'కీకట ద్రావిడనాగరికత' అని రాఘవవాదన. మగధ రాజ్యానికి ఉండే ప్రాచీనమైన పేరు 'కీకట'. సంచారజాతులుగా బతుకుతూ, పశుపాలన చేసే ఆర్యులనాగరికత కన్న ద్రావిడనాగరికత అభివృద్ధిచెందినదని రాఘవ తన నవల 'ముర్దోంకాటీలా'లో సాక్ష్యాధారాలతో రుజువుచేశాడు. ఈ భిన్ననాగరికతల సంఘర్షణల వికాసక్రమంలో ద్రావిడపాత్రలుగా రూపొందిన కవి విల్లిభిత్తూర్, 'గాయని వేణి', రాజకుమారి చంద్ర ఆత్మగౌరవంతో బతకాలనే సందేశం ఇస్తూ, ఆత్మగౌరవంతోనే మరణిస్తారు. ఈ చిత్రణవల్ల రాఘవ ద్రావిడ జాతిపక్ష పాతిగా ముద్రవేయబడ్డాడు. తరచిచూస్తే అది ఏ మాత్రం నిజంగాదని తేలుతుంది. సుప్రసిద్ధ సాహిత్యవేత్త, సాహిత్య చరిత్రకారుడు అయిన ఆచార్య రామచంద్రశుక్ల ఇలాంటి విషయాన్నే తీసుకొని రచనలు చేసిన రాఖాల్ దాస్ బందోపాధ్యాయను ప్రశంసించాడు. చరిత్రలో వదిలివేయబడినవాటిని రాఖాల్‌దాస్ తన కల్పనలతో పూరించి ప్రశంసాపాత్రుడయ్యాడు. ఈ

సందర్భంలో శుక్లావ్యాఖ్య ఇలాఉంది.

"నాటి పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని చూస్తే, నవలలో చూపబడిన శశాంక పాత్ర ఏవిధంగానూ అసమంజసంగా తోచదు. చరిత్ర ద్వారా వదిలి వేయబడిన విషయాలను కల్పనలద్వారా సజీవచిత్రణకు పూనుకొని పూరించడమే నవలాకారుని చారిత్రకకర్తవ్యం".

[శశాంక పీఠిక; పేజీ – 15]

'ముర్దోంకాటీలా" నవలలో రాఘవ చరిత్రలో వదిలివేయబడిన విషయాలను తన కల్పనలతో పూరించి, చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించాడు.

ఆనాడేకాదు ఈ నాడు కూడా ఆర్యద్రావిడ నాగరికతల సంఘర్షణల వికాసానికి సంబంధించిన సమాచారం సమగ్రంగాలభించదు. నవల 1948లో వెలువడింది. చరిత్ర పురాతత్వ విషయాలకు సంబంధించిన పరిశోధనల ఆధారంగానే, వాస్తవాలు గీటురాయిగా చేసుకొని, తిరిగి తన అద్భుత మైన కల్పనలద్వారా రాఘవ సృజనాత్మకంగా 'ముర్దోంకాటీలా' నవలను మహత్తరంగా రచించి సాటిలేనివాడయ్యాడు. దురాక్రమణదారులుగా జొరబడిన విదేశీఆర్యుల ఎదుట ఆత్మగౌరవంతో బతకమని ద్రావిడ పాత్రలు ఆ నవలలో అన్నందువల్లే రాఘవ ద్రావిడపక్షపాతి అయిపోతాడా? లేక అతడు ద్రావిడవర్గంనుండివచ్చాడు కాబట్టి ద్రావిడ అభిమాని అవుతాడా? నిజానికి సాహిత్యాన్ని ఆ విధంగా సంకుచితంగా విమర్శించడమే తప్పు.

రాఘవ దృష్టిలో ఆర్యులు దురాక్రమణదారులుగాను, ద్రావిడులు వారి దాడులవల్ల సర్వం కోల్పోయినవారుగాను 'ముర్దోంకాటీలా' నవలలో పేర్కొనబడినారు. ఈ చిత్రణ డా॥ రాంవిలాస్‌శర్మకు ద్రావిడపక్షపాత బుద్ధిగాతోచింది. ఈ సందర్భంలో రాఘవ జాతులప్రస్తావనే తేలేదు. ఈ నవలలోని ప్రధానపాత్ర 'విల్లిభిత్తూర్', అతడి సహచరుల్లో దేశీయ ద్రావిడులు, ద్రావిడేతరులు ఉన్నారు. వీరు, ఆర్యులు మణీబంధుని విరోధులుగా కనిపించరు. జాతుల ఆధారంగా వారిమధ్య శత్రుత్వం ప్రధానంగా ఉండదు. వారిమధ్య వైరానికిగల మూలకారణం ఆర్యులు

బర్బరులుగాను, ద్రావిడ సంస్కృతికి విరోధులుగాను, అన్నీకలిపి ముఖ్యంగా జనసామాన్యుల ఆనందంలో నిప్పులు పోసేవారుగాను వ్యవహరిస్తారు. విల్లిభిత్తూర్, చంద్రా ఆత్మాభిమానం కలవారు. వారు ఆర్యుల ఆధిపత్యానికి దోపిడీకి వ్యతిరేకంగా పోరాడి, ఆత్మగౌరవంతో బతకమని, ఆమార్గంలోనే ప్రాణాలు వదలమని ఇతరులకు ప్రబోధం చేస్తారు. ఆర్యుల అన్యాయానికి వ్యతిరేకంగా రూపొందిన చైతన్యజ్వాలలు ఈ పాత్రలు. వీరు ద్రావిడులు కావడం కాకతాళీయం. చంద్రా తండ్రి కీకటాధిపతి ద్రావిడజాతివాడే అయినా అతడు ఆర్యులదురాక్రమణ ముందు మోకరిల్లి, నిర్లజ్జగా తన భార్యాబిడ్డలను పణంగా పెడతాడు. విల్లిభిత్తూర్ ప్రేయసిగా ఉన్న ద్రావిడస్త్రీ వేణీ అతణ్ణి వదిలి, సుఖభోగాల జీవితంకోసం మణిబంధుని శయనమందిరం చేరుతుంది. ఆ తర్వాత ఆమె మేల్కొని ఆత్మగౌరవంకోసం మరణించినా ఫరవాలేదనే అభిమానంతో ప్రవర్తిస్తుంది. ఈ పాత్రల పరికల్పనలో, విషయ వివేచనలో రాఘవ చరిత్రను జాతుల దృష్ట్యాగాక మొత్తం భారతీయమానవ వికాసందృష్ట్యా పరిశీలించాడు. ఈ పరిణామపరిశీలనలో రాఘవ కేవలం ప్రజల తిరుగుబాటుకే ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చాడనే అంశాన్ని మరచిపోరాదు. ప్రజల తిరుగుబాటు ప్రబలంగా సాగినప్పటికీ కీకటరాజ్యం పతనమైంది. దానికి గల చారిత్రకకారణాలు వేరే ఉన్నాయి.

"ఆత్మాభిమానంతో తెగించి పోరాడుతున్న ప్రజల ఆశయాలకు భిన్నంగా, కేవలం ప్రాణభిక్షకోసం కీకటాధిపతి తన దేశాభిమానాన్ని విస్మరించి మోకరిల్లుతాడు. దాని ఫలితంగానే బర్బరులైన ఆర్యులు గెలిచారు. వారు గెలవడానికిగల కారణం – వారు క్రూరులేగాక నమ్మకద్రోహులుగా ఉండేవారు. సంఖ్యాబలంలోకూడా వారు ఎక్కువగానే ఉంటూ మోసపూరితయుద్ధాలతో కుట్రలతో తమ లక్ష్యాలను సాధించేవారు. కీకటరాజ్యం చిన్నచిన్నగ్రామాలుగా ఉండేది. ఈ కారణంగా కూడా ఆర్యులు మోసపూరితంగా విజయాన్ని పొందగలిగారు."

['ముర్దోంకాటీలా' నవల; పేజీ–314]

మణి బంధుడు గణరాజ్యాన్ని ధ్వంసంచేసి మిశ్రమ పద్ధతిలో

ఏర్పాటు చేసిన రాజ్యాంగతంత్రాన్ని ప్రతిఘటించడం, ద్రావిడ జాతి పక్షపాత బుద్ధి అవుతుందా? ఈ ప్రతిఘటనలో ద్రావిడ తెగలవారేకాక బానిసలుగా ఉండిన మిగతాజాతులవారు, మొహంజదారో నాగరికులు అధికసంఖ్యలో పాల్గొన్నారు. తమ విజయమార్గాలను నెత్తురుతో ముంచెత్తిన పోరాటవీరులు వీరు. విశాలాక్షుని భార్య తన దాసిని చంపినందుకు శత్రు సైనికుని మీదికి బాకు విసిరి ప్రతీకారం తీర్చుకుంటుంది. ఈమె ద్రావిడ స్త్రీ కాదనేది గమనించాలి. ఇలాంటిదే మరోసంఘటన కూడా ఉంది.

మణి బంధుని సైనికులు మహానగరంలో భీభత్సాన్ని సృష్టించారు. తల్లుల ఒడిలోనుండి పిల్లలను లాగిలాగి మంటల్లోకి విసురుతున్న కిరాతక దృశ్యం అది. స్త్రీలపై సాగిన భీభత్సాలకు అవధులు లేవు. క్రిక్కిరిసిన అమానుషదృశ్యాలమధ్య దారి చేసుకుంటూ ముందుకు సాగిపోయిన విల్లిభిత్తూర్, అతనివెనుక అపావ్, హేకా, నీలోఫర్‌లు జనసమ్మర్ధంలో చిక్కిపోయిన సందర్భంలో తన ఒడిలోకి లేవనెత్తిన శిశువు మరణావస్థలో కనిపించినప్పుడు విశ్వజిత్ అన్నమాటలు గమనార్హం.

"ఈ పరిస్థితి ఎందుకు దాపురించింది? అతడు గర్జిస్తూ అన్న మాటలు 'ఈ బాలుడు గణరాజ్యంలో బతకాలని కోరుకున్నాడు. బానిసగా బతుకు సాగించడమే అన్నిటికన్నా ఘోరమైన పాపమని జ్ఞాపకముంచు కోండి. ఆత్మహత్య చేసుకోవడంవల్ల శత్రువుకు నష్టంఏమీ వాటిల్లదు. నేను ఏమీ అనరాదని మీరు కోరుకుంటారేమో!' అతడాబాలుని లేవనెత్తి ఇలా అన్నాడు. రేపు మీ బతుకు కూడా ఇలాగే మారి పోతుంది చూస్తున్నారా! ఈ బాలుని శరీరం సగం కాలిపోయింది. కాని దుర్భర మృత్యుయాతనను అనుభవిస్తూ కూడా బతికివున్నాడు. .. మహాపౌరులారా ఈ బానిసబతుకును జీవితంగా భావించడానికి సిద్ధంగా ఉన్నారా! చెప్పండి!..."

['ముర్దోంకాటీలా'; పేజీ 311]

అసంబద్ధంగా పాత్రలను రూపొందించే ధోరణికి భిన్నంగా రాఘవ తన రచనల్లో పాత్రలను సజీవంగానూ, తర్క బద్ధంగానూ మలిచాడు.

దోపిడీ చేసేవారిని, దోపిడీకి గురయ్యేవారిని, భోగలాలసులైన సామ్రాట్టులనూ, బానిసలుగా ఉన్న శ్రామికులనూ, వర్గపోరాటంలో ఎదురెదురుగా నిలిపి, పీడనకు వ్యతిరేకంగా పీడితులు ప్రతిఘటించినట్లు కథాకథనం సాగించడం మార్క్సిస్టు దృక్పథమేనని గ్రహించితీరాలి. తన అనుభవంనుండి నేర్చుకున్న 'నీలోఫర్' – చరిత్ర, పరస్పరవిరుద్ధశక్తులతో ఏర్పడిందనీ, అందులో తను, తనలాంటి వారి స్థితిగతులు ముడిపడివు న్నాయని తెలుసకుంటుంది. 'హేకా'తో అన్నమాటలు ఇందుకు ఉదాహరణలు.

"ప్రపంచంలో బానిసలమైన మనమంతా ఒకే రకంగా ఉన్నాము. మిశ్ర్ (ఈజిప్టు)లోని ఫరావున్, కీకట అధిపతి, మణిబంధుడు పీడకులు, బర్బరులు అని జ్ఞాపకముంచుకో. చంద్రా, నీలోఫర్‌లు ఎప్పుడూ అలాకారు. ఈ ముగ్గురు బర్బరుల ప్రపంచానికి ఏ ఆధారమూలేదు. ఈ ముగ్గురూ నిస్సహాయులే. మనకు ఎలాంటి స్వార్థమూలేదు. మనము దేనికీ అధికారులం కాము".

వేణీ ఆ తర్వాత నీలోఫర్ ఉన్నచోట ఉండవచ్చు. దీని వల్ల వాస్తవికస్వరూపంలో మౌలికమైన మార్పురాదు. నీలోఫర్ తనప్రాణాలను ఆపదలో వేసి, వెళ్ళి వేణీని రాజ ప్రాసాదంలో కలుస్తుంది. నిజానికి ఆ వేణీ నీలోఫర్‌కు ప్రత్యర్థి. అయినా ఆమె వెళ్ళి కలుస్తుంది. కారణం వేణీకూడా బానిసే కాబట్టి ఆమె తప్పక బానిసలకు మేలుచేసేక్రమంలో తోడ్పడగలదని భావిస్తుంది. ఆ మంచిపనిలో వేణీని తనతో సమానంగా భావిస్తుంది. ఒకప్పుడు మణిబంధుడు కూడా ఆ మహానగరంలో సర్వశ్రేష్టు డైన నాగరికుడు. అయినా అతడికి వ్యతిరేకంగా అందరూ ఎందుకు సంఘటితపడ్డారు? లాసవిలాసాలకు రుచిమరిగి విశృంఖలంగా ప్రవర్తిస్తూ ధనలోభంతో మహావినాశాన్ని ఆహ్వానించేదిశలో అతడు ప్రవర్తిస్తున్నాడు కాబట్టి, అతడు గణతంత్రవ్యవస్థను ఛిన్నాభిన్నం చేస్తున్నాడు కాబట్టి అందరూ అతణ్ణి ప్రతిఘటించడానికి సంఘటితపడ్డారు. మణిబంధుని దుర్భరదోపిడీకి, విశృంఖలజీవితానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడం,

అందుకోసం ప్రాణాలను ధారపోయడం ద్రావిడజాతి దురభిమానమా? కానేకాదు రాఘువ రాసిన 'ముర్దోంకాటీలా' నవలను మొత్తం భారతీయ చారిత్రక పరిణామ క్రమంలో సాంఘిక దశల వికాసంలో చూడక, కేవలం జాతులస్వపరభేదాలతో చూడడం బాధ్యతతో కూడిన హేతుబద్ధ, శాస్త్రీయవిమర్శ కాజాలదు. రామ్‌విలాస్ శర్మ దానిని గుర్తించక పోవడం విచారకరం. రాఘవను ద్రావిడపక్షపాతిగా ముద్రవేయడానికి రామ్‌విలాస్ శర్మ తరచూ ఉదహరించే అతడి కవితను పరిశీలించక తప్పదు.

"ధూళికణమా! హిమాలయంలా మారిపో,
అణచవచ్చిన ఆర్య జాతిని ప్రతిఘటించు!
నేడు నా ధమనుల్లో ద్రావిడతప్తరక్తం మోగుతూంది.
రక్తసిక్తమైన ఆర్యబర్బర వర్ణదంభుల
శ్వేత జాతీవిస్తరణకాంక్షుల తరిమికొట్టు
నీ ఇల్లు వాకిలి దోచివేసే దురాక్రమణదారులు
మోక రిల్లేదాకా సింహగర్జనలతో వెంటాడిపోరాడు!"

తన పునాదుల జ్ఞానం కలిగివుండడం, దానిని సందర్భోచితంగా ప్రస్తావించడమే దోషమైతే ఆ దృష్ట్యా ఒక రాఘువ మాత్రమే దోషిగా ఉండిపోడు. ఎందరో ఆ పరిధిలోకి వచ్చితీరుతారు. మొత్తం చారిత్రక నేపథ్యంతో చూడాల్సిన బాధ్యతను విస్మరించి, మూల భారతీయులైన ద్రావిడుల స్వాతంత్ర్యకాంక్షను, అందుకోసం వారిలో ఆత్మాభిమానంతో ప్రవహించే వేడిరక్తాన్ని తప్పుగా అర్థంచేసుకుంటే – దురాక్రమణదారులు దోపిడీ ఆగడాలు కొనసాగించిన జాతివర్ణదురహంకారులైన అర్యుల గురించి సరైన అవగాహన రావడమే అసాధ్యమవుతుంది. నిజానికి ముందుకువచ్చే అంశం ఆర్యద్రావిడవిభేదం కానేకాదు. అందుకు భిన్నంగా చూపబడిన చారిత్రకసత్యం. దురాక్రమణ చేసినవారు, దురాక్రమణకు బలై సర్వం కోల్పోయినవారు అని గ్రహించాలి. ఒక దేశం స్వాతంత్ర్యకాంక్షకు శత్రువైతే మరోదేశం స్వాతంత్ర్యం కోసం సర్వం ధారపోసిన యథార్థం, అసలు సమస్య వీటిమధ్య ఎన్నిక చేసకోవడమేనని గ్రహించాలి.

ఇటీవల, కన్హైలాల్ ఓఝా రాసిన బృహత్‌నవల 'సంభవామి' వెలువడింది. దాని నేపథ్యం కూడా ఆర్యులదురాక్రమణే. రాఘువ రాసిన 'ముర్దోంకాటీలా' నవల మొహంజోదారో నేపథ్యంలో ఉంటే, 'సంభవామి' హరప్పానాగరికతకు సమకాలీనంగా ఉంది. ఇదే వీటిమధ్య ఉన్న భేదం. 'హారియపియ అనబడే హరప్పాలోని మొదటి నివాసులు ద్రావిడ జాతివారు కారు. అయినా ఆర్యులు అక్కడ దురాక్రమణదారులుగా దౌర్జన్యం చేస్తూ విధ్వంసానికి పూనుకొని క్రూరాలు సాగించారు. చారిత్రక భౌగోళిక పరిస్థితులమూలంగా వారలా దురాక్రమణదారులుగా, యుద్ధ ప్రియులుగా, స్వార్థపరులుగా తయారయ్యారు. కాని హరప్పావాసులైన ప్రజలు మౌలికంగా వాణిజ్యప్రవృత్తి కలవారు. అంగళ్ళను ఆధారం చేసుకుని జీవించేవారు. ముఖ్యంగా 'గణరాజ్యవ్యవస్థను విశ్వసించేవారు. క్రూరులైన బర్బర ఆర్యులను ప్రతిఘటించ జాలక పోయినందువలననే హరప్పానాగరికతకు సంబంధించిన అనార్యజాతులవారు ఓడిపోయారు. రాఘువ, కన్హైయ్యాలాల్ నవలల్లో వాటివాటి నేపథ్యం వేరైనప్పటికీ – ఆర్యుల దౌష్ట్యాన్ని వెల్లడి చేయడంలోనూ, మూలభారతీయుల నాగరికతను బయల్పరచడంలోనూ, ఏమాత్రం భేదంకనిపించదు. ఆ విధంగా వాణిజ్యనాగరికతను సమర్థిస్తూ రాసినందువలన కన్హైయ్యాలాల్ వణిక పక్షపాతబుద్ధితో చరిత్రను దర్శించాడనే ఆరోపణ అతడిమీద రాలేదు. హిందీసాహిత్యంలో ఆకాలపు మార్క్సిస్టువిమర్శకులు అంతర్వైరుధ్యాలను పరిష్కరించుకునే శాస్త్రీయ దృక్పథానికి దూర మయినందువల్లే జాతుల సమస్యను చారిత్రకనేపథ్యం లోంచిగాక, వ్యక్తిగత దురభిమానాల ఆధారంగా ముందుకు తెచ్చి కొందరిమీద ముద్రలు వేశారు. ఆ కారణంగానే వారి సాహిత్యవిమర్శ రాగద్వేషాలకతీతం కాలేకపోయింది.

చరిత్రపట్లగల రాఘువ దృష్టి వస్తుగత పరిశీలనకు సంబంధించినది. అతడెప్పుడూ వాస్తవాలను ఇష్టంవచ్చినట్టు తనకనుకూలంగా మలచుకోవడానికి ప్రయత్నించడు. చారిత్రక నేపథ్యంలో రూపొందే వాస్తవిక కల్పిత పాత్రలద్వారా తన చింతనా ధోరణిని, అభిప్రాయాలను రాహుల్ సాంకృత్యాయన్‌లాగా జొప్పించడానికి రాఘువ ఏమాత్రం ప్రయత్నించడు.

అనేక సందర్భాల్లో రాఘవ తన పాత్రలగురించి చాలాస్పష్టంగా వివరించాడు..

"నా పాత్రలు ఆనాడు చరిత్రలో ఏదశలో ఉన్నాయో, అలాగే ఆలోచిస్తాయి విధులు నిర్వహిస్తాయి."

['మహాయాత్రా' – 1 – పేజీ – 455]

రాఘవ ఎల్లప్పుడూ మానవ వికాసంమీందే తన దృష్టిని కేంద్రీకరించేవాడు. మౌలికంగా దక్షిణ భారతీయుడైనందువల్ల అతడిమీద విమర్శకులు రాఘవ శంకర, రామానుజాచార్యుల మతాల పక్షపాతబుద్ధితో రాశాడనే అపవాదుకూడా తెచ్చారు. రాఘవను అతని సమగ్ర వ్యక్తిత్వంలో చూడక, కేవలం అతని భావాలను, కొన్ని అంశాల్లో, భాగాల్లో చూడడంవలన ఇలాంటి అజ్ఞానపూరిత వ్యాఖ్యలు వెలువడ్డాయి. రాఘవ ఎన్నోసార్లు "చింతనాధారలో కొత్త శిఖరాలను అందుకోవాలి. పరిణామక్రమంలోని ప్రగతిని చూపాలి." [మహాయాత్రా – 1 – పేజీ – 187] అంటూ తన లక్ష్యాన్ని స్పష్టంగానే ప్రకటించాడు. అయినా విమర్శకుల్లో కుశంకలు మిగిలాయంటే, అవి వారు ముందే ఏర్పరచుకున్నద్వేషాలుగా పరిగణించవలసివుంటుంది.

పూర్వీకులపట్ల ఎంతగానో శ్రద్ధాసక్తులు ఉన్నప్పటికీ, చారిత్రక సంఘటనల వికారాల మీద పరదావేసి కప్పివేయాలనే ధోరణికి వ్యతిరేకంగానే రాఘవ ఉండేవాడు.

ఆధునిక ప్రమాణాల ఆధారంగా మనకు ఏమాత్రం మంచిగా కనిపించని విషయాలెన్నో ప్రాచీనసాహిత్యంలో, మారుతూన్న యుగ సందర్భాల్లో బహుళంగానే కనిపిస్తాయి. మన పూర్వీకులపట్ల మనకు ఉండే శ్రద్ధాభక్తులపర్యవసానంగా ఏర్పడిన భ్రమలకారణంగా చరిత్రలో కనిపించే అనూహ్యకురూపాలను అసంభవాలుగా భావిస్తాం. చెడుగా ఉన్నా దానిని చెప్పాల్సిన పని ఏమిటి అని వాదించేవారు కూడా ఉంటారు. భవిష్యత్ మార్గాన్ని ఏర్పరచడానికి, చరిత్రలోని మంచిని మాత్రమే గ్రహించాలని వారు నొక్కివక్కాణిస్తారు కూడా. దీనివలన

చరిత్రలో మానవుడు వికాసమార్గంలో నడిచివచ్చిన వివిధరూపాలను మనం చూపజాలం. మారిన ప్రమాణాలమేరకు మొదటినుంచీ మనలను మనం సుందరరూపాలుగా మలచుకోవడానికి ప్రయత్నించినందువల్ల కూడా చరిత్రలో మానవ వికాసంలో అనివార్యంగా కనిపించే కురూపాలను చూడడానికి మనం ఇష్టపడము. లైంగిక సంబంధాల ఆర్థికకారణాలను కూడా వివేచించే అలవాటు మనకు లేదు. వీటిని దాచడమంటే మానవ వికాసక్రమంమీద ముసుగువేయడమే కాగలదు. పాత మాటల్లోని రూపకాలను వెదకి, చరిత్రకు సంబంధించిన విషయాల్లో భ్రమలమేరకు అర్థాలను తారుమారు చేసే ధోరణి ఒక హీనమైన మనస్తత్వానికి సంబంధించిన భావప్రకటనే కాగలదు. ఇలాంటి తప్పుడుపద్ధతుల్లో పడడం మంచిదికాదు. బలహీనతలు ఎన్ని ఉన్నప్పటికీ, సత్యాన్ని నమ్మి గౌరవించినందువల్లే ఈ దేశంలో శక్తి అనేది మిగిలివుంది. అదే ఈ నాటికీ వికాసమార్గంలో పయనిస్తూవుంది."

"ఏయే సందర్భాల్లోనైతే ఈ దేశం జ్ఞానాన్వేషణకు సంబంధించిన ఉదారబుద్ధిని తిరస్కరించిందో, అప్పుడు దానికి అంధకారపు ఆవరణనే సహించాల్సివచ్చింది. ఆ అజ్ఞానాంధకారమే ఈ దేశాన్ని అనేక సందర్భాల్లో నాశనంచేయాలని చూసింది".

[మహాయాత్రా – 1 – పేజీ – 470]

తర్కబద్ధమైన చారిత్రక దృష్టితోనే వేలాది సంవత్సరాలలో విస్తరించి వున్న దీర్ఘకాలిక భారతీయ సంస్కృతీ సాహిత్యాల వారసత్వాన్ని వివేచించి వ్యాఖ్యానించాడు రాఘవ. ఏకారణంగానైతే రాఘవను ద్రావిడపక్షపాతిగాను, పునరుద్ధరణవాదిగాను ముద్రవేయడం జరిగిందో ఆ విషయాన్నే రాఘవ విపులంగా వివరించాడు:

"చరిత్రలో జాతులకార్యకలాపాలను వివేచించే సందర్భంలో ఎలాంటి పక్షపాతబుద్ధిని, రాగద్వేషాలను ఆశ్రయించరాదు. ఆర్యులు మంచివారా లేక ద్రావిడులు ఉత్తములా అని ఆలోచించడమే అశాస్త్రీయం. నాటి జాతులగురించి ఈ ప్రమాణాలతో చూడరాదు. చరిత్రలో విశేషించి

వారు, వారు ఏర్పరచుకున్న వ్యవస్థలగురించి ప్రత్యేకించి పరిశీలించాలి. అనార్య బానిససమాజంలోని దుస్థితిని, ఆ రాజుల నిరంకుశత్వాన్ని ప్రతిఘటించి, భగ్నం చేయడానికి పోరాడిన ఆర్యవీరులను సైతం అనార్యజాతుల సమాజంలో కూడా పూజనీయులుగా భావించారన్నది మరచిపోరాదు. ఈ కారణంగానే దుష్కృత్యాలకు ప్రతీకలుగా నిలిచిన భూత, పిశాచ, రాక్షస, అసుర, దైత్య, దానవులు మున్నగు వారిని అనార్యజాతులవారు కాలంగడిచాక కూడా ప్రస్తుతించదగినవారుగా భావించలేదు. సతీసహగమనదురాచారాన్ని నిలిపివేయడానికి ప్రయత్నించిన విలియం బెంటింగ్ విదేశీయుడైనప్పటికీ భారతదేశంలో గౌరవింపబడినట్లుగానే, ఆనాడు బానిసవ్యవస్థను వ్యతిరేకించిన ఆర్యవీరులు అనార్యసమాజంలో కూడా పూజనీయులయ్యారు. చరిత్రలో ప్రత్యేకించి ఒక జాతి గెలవడంవల్ల నిజమైన వీరుల సాహసగాథలు మరుగున పడిపోయాయి. అలా మరుగున పడిపోయిన చివరివీరుడు రాణా ప్రతాపుడు. అతడిని ప్రశంసిస్తే మతపక్ష పాతంగా భావించబడుతుంది. కుటిలరాజనీతిజ్ఞుడైన అక్బరులాంటి సామ్రాజ్యవాదిని కొందరు చాలాగొప్పవాడిగా చిత్రిస్తారు. భారతసైన్యాన్ని సంఘటితపరచిన వాజిదలీషాను విదేశీయులు అపఖ్యాతిపాలు చేసినందువల్ల అతడి పేరును ఉచ్చరించడానికే కొందరు సిగ్గుపడతారు. వాజిదలీషా వస్తుతా: మంచివాడే. కాని అతడు శిథిలమైన నవాబులవ్యవస్థలోని వాడు. అయినప్పటికీ ఆ నవాబులవ్యవస్థపట్ల అవధ్‌ప్రజలకు ఎంతో మక్కువ ఉండేది. ఆ కారణంగానే 1857లో నాయకుడు లేకుండానే ఆ ప్రజలు ఇంగ్లీషువారితో ఎదిరించిపోరాడారు కూడా....''

[మహాయాత్రా – 1 – పేజీ – 478]

ఈ విధంగా రాఘవ రాగద్వేషాలకతీతంగా చారిత్రక సంఘటనలమీద, వ్యక్తులపైన శాస్త్రీయంగా వ్యాఖ్యానించాడు. అతడి రచనాఫలకం అతివిస్తృతంగావడంమూలాన, అతడు చేసిన వ్యాఖ్యలనులాగి వివాదాస్పదం చేయడానికి వీలుంది. అతడి వ్యాఖ్యలు వివాదరహితంగానూ,

సర్వజనామోదంగాను ఉంటాయని రాఘువ ఏనాడూ భావించలేదు. అతడు చేస్తున్నపని కేవలం ఒక్కడు చేయాల్సిన పనికాదని రాఘువ అనేకసందర్భాల్లో మరీమరీ చెప్పాడు. ఈ చెప్పడం తోటిరచయితలకు ఒక వినతిగానే ఉండేది. మానవవికాసచరిత్ర భ్రమలకతీతంగా కథాబద్ధం చేయడానికి నాటి విద్వాంసులు, రచయితలు ముందుకువచ్చి అతడి రచనాకృషిలో పాలుపంచుకోవాల్సింది పోయి, అతడి పట్ల విరోధాన్ని పెంచుకున్నారు. ఆ విరోధమే క్రమంగా అతడిపట్ల ఘాతుకమైన అశ్రద్ధగా మారిపోయింది. తత్పర్యవసానంగా రాఘువ వ్యుత్క్రమశీతలసమానమైన ఉపేక్షకు బలిచేయబడ్డాడు.

రాఘువ సంస్కృతీ సంబంధమైన 'అంతర్భుక్తి' సిద్ధాంతానికే ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చి రాశాడు. జాత్యహంకారం, పవిత్రరక్త భావన, తమ జాతి సర్వశ్రేష్ఠమని భావించి ఇతరులను అసహ్యించుకొని, తమనే ఉన్నతంగా ప్రతిష్ఠించుకోవడంలాంటి ఆధిక్యతా భావాన్ని రాఘువ వ్యతిరేకించాడు. పవిత్రరక్తం అని, ఆర్యుల గొప్పతనాన్ని చూపిగర్వించే కన్హైయ్యాలాల్ మున్షీభావాలను, జాత్యహంకారాన్ని వ్యతిరేకిస్తూ విమర్శలు చేశాడు. అతడు మతం, తత్వశాస్త్రం, సంస్కృతి, సాహిత్యం, కళలు మున్నగువాటి వికాసం విషయంలో 'అంతర్భుక్తి సిద్ధాంతం' పట్ల ఎక్కువశ్రద్ధ చూపాడు. జాతుల మధ్య అనివార్యంగా సాగే పరస్పరప్రభావమే 'అంతర్భుక్తి'.

"ఈ దేశంలో ఎవరు ఆర్యులు? ఎవరు అనార్యులు? మనమంతా పరస్పరపూరకాలైన అంతర్భుక్తి పరిణామంలోనివారం. మనం భారతీయులం, ముఖ్యంగా మానవులం, మన దేవతలవికాసం మనకు చూపింది కూడా ఈ విషయమే."
[ధర్మ్ ఔర్ మానవతావాదీ పరంపరా ఔర్ వికాస్ – గ్రంథావళి 10; పేజీ – 114]

వేదాలలోకూడా ఈ 'అంతర్భుక్తి' ఉంది. యక్ష, గంధర్వ, జైన పరంపరలో కూడా ఈ అంశమే ఉంది. పరస్పర ప్రభావాలను కలుగజేసే జాతులసమ్మేళనంలో ఈ అంతర్భుక్తి కీలకంగా పనిచేస్తూ, వికాసమార్గానికి

దోహదం చేసింది.

సంచారజాతులు ఆకలిదప్పుల బాధలవల్ల, శత్రుభయం కారణంగా నిరంతరం స్థానచలనంలో ఉండేవి. అలా ఒక ప్రాంతంనుండి మరోప్రాంతానికి, సామాజిక విషయాల్లో ఆచారవ్యవహారాల్లో ఒక జాతి మరోజాతిని ప్రభావితంచేసేది.

మానవ వికాసానికి సంబంధించిన ఆదిమయుగంలో గణాలను, సమూహాలను గెలుచుకున్నాక, మొదటి క్రూరాలు, కాఠిన్యాలు, వైరాలు కాలక్రమంలో జాతులమధ్య సన్నగిల్లేవి. ఆ క్రమంలోనే గెలిచిన, ఓడిన జాతులమధ్య ఒకరి ప్రభావాలు మరొకరిపై ఉండిపోయేవి. అతిసున్నితంగా సాగిపోయే ఈ రకం పరస్పరప్రభావాలు ఒకరివి మరొకరికి తెలియకుండానే సంక్రమించేవి. ఇలా పరస్పరం జాతులమధ్య అనివార్యంగా సాగిపోయే ప్రభావాలను రాఘవ 'అంతర్భుక్తిసిద్ధాంతం'గా సూత్రీకరించి, "మహాయాత్రా" రచనలోని రెండుసంపుటాల్లోనూ విపులంగా చర్చించి రుజువుచేశాడు.

'మహాయాత్రా' మొదటి భాగంలో ఉరదేశానికి సంబంధించిన గాథలో, వ్యాపారరీత్యా భారతదేశానికి పశ్చిమదేశాలతో ఏర్పడిన సంబంధాలకారణంగా, ఆచారాల్లో, జీవనవిధానంలో, మతవిశ్వాసాల్లో తాత్విక చింతనలో ఏర్పడిన ప్రభావాలవల్ల వచ్చిన మార్పులగురించి రాఘవ విస్తృతంగా చర్చిస్తూ ప్రమాణాలు చూపాడు. మారుతున్న పరిస్థితులమేరకు రూపొందిన పరివర్తితగాథల్లో కూడా రాఘవ ఆయాసంఘటనలమీద, పాత్రలమీద ఈ ఆధారాలతోనే శాస్త్రచర్చ చేశాడు. అతడి దృష్టి ఎల్లప్పుడూ సామాజిక సంఘర్షణపైన, దాని ప్రగతిపైన కేంద్రీకరించివుండేది.

మానవవికాస చరిత్ర పరిణామక్రమంలో రామగాథను వివరిస్తూ, రామసుగ్రీవుల సమ్మేళనాన్ని ఆర్య, అనార్య పరస్పర ఆదానప్రదానంగాను, దానివల్ల రాబోయేపరిణామాలు జాతుల సమ్మేళనం దృష్ట్యా చాలా కీలకమైనవిగాను రాఘవ సూచించాడు. బ్రాహ్మణులకు, క్షత్రియులకు సాగిన పోరాటాల్లో పరశురాముడు ఏకాకి అయిపోయాడు. కారణం మారుతూన్న

సామాజికదశల్లో క్షత్రియులు, బ్రాహ్మణులు పరస్పరం కలహించుకునే బదులు, కలిసి సహకరించుకోవలసిన చారిత్రక అవసరం వచ్చిపడింది. క్షత్రియులను నిశ్శేషంచేస్తూ సంపాదించిన భూమినంతా పరశురాముడు భూదానం చేసినా, ఆ భూమినుండే పరశురాముడు చివరకు వెళ్ళి పోవలసివచ్చింది.

మతపరమైన పౌరాణిక విశ్వాసాలగురించి, జాతులపోరాటం గురించి వ్యాఖ్యానించే సందర్భంలో రాఘవ 'టాటెమ్ ను ఆధారం చేసుకున్నాడు. ఆ కారణంగానే మూఢనమ్మకాలపై అతడు వ్యాఖ్యానించగలిగాడు. మానవ వికాసక్షేత్రంరహాత్రనం పరిశీలించేప్పుడు రాఘవ ప్రజాదృష్టికే ప్రాముఖ్యతనిచ్చాడు. రాజులను వివరించే పట్టికలను అతడు చరిత్రగా ఎన్నడూ అంగీకరించలేదు.

'మహాయాత్రా' రెండవ భాగంలో స్కంధగుప్తునికి సంబంధించిన గాథ ఉంది. మునులంతా ఒకచోట చేరారనే వార్తను మధురలోని కాళిదాస స్కంధగుప్తునికి చేరవేయగానే 'కుభా' నది [వైదికయుగంలో కాబుల్‌నదికి ఉండే పాతపేరు] దాటి మునులు తలపెట్టిన దాడినితిప్పికొట్టమని కోరుతాడు. స్కంధగుప్తుడు తన రాజధానివైపు పోవాల్సింది వాయిదా వేసుకొని, కుభానదివైపు సాగిపోయి ప్రాణార్పణంచేసుకుంటాడు. ఆ సందర్భంలోనే అతడు మధురా భూమికి నమస్కారం చేస్తాడు – కారణం ఇక్కడే అన్యాయం, అత్యాచారం, పీడనకు వ్యతిరేకంగా కృష్ణుడు కంసునిసంహరిస్తాడు. అన్యాయాలకు వ్యతిరేకంగా సాగే ప్రజాపోరాటాలను రాఘవ విస్తృతంగా పేర్కొన్నాడు. రాఘవ రచనాలక్ష్యంకూడా అన్యాయప్రతిఘటనే.

"సామ్రాజ్యాలు పుడతాయి కాని సామ్రాట్టులు ప్రజలను విస్మరించినప్పుడు, వారిలో అసంతృప్తి ప్రబలినప్పుడు తిరుగుబాట్లు జరుగుతాయి. ఫలితంగా సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై ముక్కలుగా మిగిలి

---

*టాటెమ్ = పశు పక్ష్యాదుల్నితమమంశ చిహ్నాలుగా భావించే ఆదిమ జాతుల తెగల విధానం.

పోతాయి. గుప్తరాజుల నీతి ప్రజాకల్యాణానికి అనుకూలంగానే సాగింది".
[మహాయాత్రా 2; పేజీ – 666]

మతం, తత్వశాస్త్రం నిర్వహించేపాత్రను కూడా రాఘవ ప్రజలమీద పడే వాటి ప్రభావాలను ఆధారంచేసుకొనే పరిణామాలను పరిశీలించాడు. అనేక సందర్భాల్లో బౌద్ధమతం నిర్వహించిన దేశ, ప్రజలవ్యతిరేకపాత్రను అతడు ఖండించాడు. రాజ్యాన్ని సంరక్షించాలనే కారణంతో ప్రజలను పీడించే వారిస్వభావం, మతపరమైన నిష్ఫలమూలంగా, కామప్రవృత్తివైపు సాగే వాటి సెక్స్‌మున్నగు అరిష్టాల ఆధారంగా బౌద్ధమతం భ్రష్టుపడింది. దానికన్నా జైనమతం నిర్వహించిన పాత్ర ఎక్కువ అభ్యుదయకరమై నదని, మానవతా పూరితమైనదని రాఘవ అభిప్రాయం. రాఘవ తన చారిత్రక దృష్టికోణాన్ని స్పష్టీకరిస్తూ చెప్పిన విషయాన్ని గీటురాయిగా స్వీకరించాలి.

"హిందూయుగాన్ని లేక ముస్లింయుగాన్ని కొనియాడినందువల్లగాని, లేక ఆ యుగాలలో ప్రజలయథార్థాలను దురభిమానాలవేరకు దాచినందువల్లగాని చరిత్రవాస్తవికత బహిర్గతంకాదు. ప్రజల సుఖదుఃఖాలను ముందు ఉంచుకుని చరిత్రను పరిశీలించాలి. ఈ దృక్పథాన్నే నేను అనుసరించాను".
['మహాయాత్రా' – 2; పేజీ 834]

మధ్యకాలాల ఫ్యూడల్‌రాజుల అభ్యుదయకరమైన పాత్రను, కళాసంస్కృతులపోషణను, ప్రజాసంరక్షణకు సంబంధించిన ఆసక్తిని రాఘవ ఇష్టపూర్వకంగానే తనరచనల్లో ప్రస్తావించాడు. రాజ్యాంగతంత్రాన్ని వ్యతిరేకించిన గణవ్యవస్థను రాఘవ సమర్థించాడు. బానిసల, పీడితుల దుస్థితిపట్ల హార్దికమైన సానుభూతిని ప్రదర్శిస్తూనే వారి చారిత్రక పరిమితులను మాత్రం అతడు విస్మరించలేదు. జాతీయ, అంతర్జాతీయ ద్వంద్వాలు ముందుకు వచ్చినప్పుడు అతడు జాతీయ ప్రయోజనాలకే ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చాడు. అతడు ఒక గాథను వివరిస్తూ ఈ విధంగా రాశాడు.

"నాగసేనుడు – పతంజలి సంఘర్షణల్లో, బౌద్ధ – బ్రాహ్మణ సంఘ సంఘర్షణలు ఉన్నాయి. బ్రాహ్మణులు ఆ సందర్భంలో స్వదేశీ ప్రేమికులుగా నిలిచినందువల్లే గెలిచారు. బౌద్ధులు విదేశీయులతో కూటమిగా ఏర్పడినందువల్ల ఓడిపోయారు."

[మహాయాత్రా – 2; పేజీ – 206]

మొత్తం భారత చరిత్రను సాపేక్షకంగానే చూసినా అతడెక్కడా సంకుచితహిందూతత్వాన్నికానీ, పునరుద్ధరణవాదాన్ని గానీ సమర్థించలేదు. చంద్రగుప్త మౌర్యుడు, పుష్యమిత్రుడు, స్కందగుప్తుడు, హర్షవర్ధనుడు మున్నగు అతిప్రాచీన చారిత్రక పురుషులేగాక, ఇటీవలి రాణాప్రతాపుడు, బహదూర్ షాజఫర్, వాజిదలీషావరకు గల రాజులందరూ విదేశీదురాక్రమణదారులకు వ్యతిరేకంగా సర్వం ధారపోసి స్వాతంత్ర్యాకాంక్షతో దేశాన్ని ప్రజాసంక్షేమంకోసం ఒక గొప్పదేశంగా నిర్మించాలని బలిదానం చేసిన వీరులేనని రాఘవ అభిప్రాయం. ఈ వికాసపరిణామాన్ని అతడెన్నో చారిత్రక సంఘటనల్లో ఉదహరించి ఈ చారిత్రక పురుషుల ప్రయోజకత్వాన్ని రుజువు చేశాడు. ఒక వ్యక్తి ఇష్టాయిష్టాల కనుకూలంగా సాగే నిరంకుశత్వానికి, విస్తరణవాదానికి వ్యతిరేకంగా ఉన్నత సమాజంకోసం సాగిన మహోన్నతపోరాటాల ఉజ్వలమమేకత్వమే రాఘవ చారిత్రక దృష్టిలో ప్రతిబింబించింది.

రాఘవ ఏకోన్ముఖంగా చేపట్టిన ఈ చారిత్రక రచనా వ్యాసంగం ఎంత కష్టతరమైనదో చూడడానికి ఒక్క "మహాయాత్రా" బృహత్‌రచనేగాక మిగతా చారిత్రక సాంస్కృతిక రచనలను కూడా చదవడం అర్థంచేసుకోవడం అనివార్యం. ఇంతగా అతడు రాసినప్పటికీ, భారతీయ చరిత్రసంస్కృతుల విస్తృతిని చూసి, ఇది ఒక్కరితో సాధ్యమయ్యే పనికాదని కూడా రాఘవ చరిత్ర రచన గురించి వినమ్రతతో చెప్పుకున్నాడు.

"ప్రాచీన భారతీయ సాంప్రదాయాన్ని, చరిత్రను వ్యాఖ్యానించే ధోరణిలో బహుశా నాదే ప్రథమ ప్రయత్నం. ఈ ప్రయత్నంలో నేను పొరపాట్లు చేయడం ఆశ్చర్యకరంకాదు. విద్వాంసులైనవారు నాతప్పులను

వెదకిచూపేబదులు, ఈ కొత్తరంగంలో ప్రవేశించిన నాతో సహకరించడం మంచిది. కారణం నేను చరిత్ర రచనలో ఎప్పుడూ మొదటే ఏర్పరచుకున్న ఇష్టాయిష్టాలతో ముందుకు సాగలేదు. మానవుడి మహాయాత్రను దర్శిస్తూ, రాబోయే మానవుడికి తన సాంప్రదాయపరిజ్ఞానం కలిగేట్లు చూడడం, భవిష్యత్తు నిర్మాణంలో అతణ్ణి జాగరూకుణ్ణి చేయడం నా లక్ష్యం...."

[మహాయాత్రా – 1; పేజీ – 695]

తన పనిలో పొరపాట్లు జరిగే అవకాశం ఉందనే సత్యాన్ని అంగీకరిస్తూనే, చారిత్రక దృక్పథంతో ఆలోచించి సత్యాన్వేషణ కొనసాగించే పద్ధతికి ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చాడు రాఘవ.

"జిజ్ఞాసువులైనవారు తప్పక మూలగ్రంథాలను చదవాలి. చారిత్రకదృక్పథంతో ఆలోచించాలి. వాటితో భేదాభిప్రాయం ఉన్నప్పటికీ ఆ మార్గాన్నే స్వీకరించకతప్పదు".

[మహాయాత్రా – 1; పేజీ – 813]

మరొక చోట రాఘవ ఈ సందర్భంగా వివరించిన దాన్ని పరిశీలించాలి.

"భారత చరిత్ర బాహిరరూపాన్నేగాక, దాని ఆంతర్యాన్ని కూడా స్పృశించే ప్రయత్నంచేశాను. భారత చరిత్ర వాస్తవానికి మిక్కిలి దుర్లభమైన విషయం. దానిని పరిశోధించడం కేవలం చరిత్రను వివేచించడం కానేకాదు".

"మానవుడి సమస్తవాంఛలను, కొరతలను, పరిపూర్ణతలను చుట్టివున్న క్రమవికాస అధ్యయనమే చరిత్ర. అది బాహ్యంగా నాగరికతగాను, ఆంతర్యంలో ఆధ్యాత్మిక ఉన్నతిగాను గోచరిస్తుంది."

[మహాయాత్రా – 1; పేజీ – 960]

చివర రాఘవ 'కేనోపనిషత్'లోని మాటలను ఉటంకిస్తూ, తన చారిత్రక దృక్పథాన్ని స్పష్టంచేశాడు. బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన తన

పరిజ్ఞానాన్ని ఉపనిషత్కారుడు చాలా అల్పమైనదిగా భావిస్తాడు. జ్ఞాన అల్పత్వానికి సంబంధించిన ఈ హెచ్చరిక ఉన్నప్పటికీ, ఉపనిషత్కారుడు తెలుసుకున్న సత్యాన్ని తెలుసుకొని మననంచేయడం తప్పనిసరి. ఈ సందర్భంలో రాంగేయరాఘవ చేసిన ప్రతిజ్ఞకూడా అందుకు భిన్నమైనదికాదు.

# 3. రాఘవ కావ్యాలు – మానవ కల్యాణ దృష్టి

ఏ అసాధారణవేగంతో, కల్పనావైశిష్ట్యంతో, రచనా పటిమతో, నిర్విరామకృషితో రాఘవ సాహిత్యక్షేత్రంలో ప్రవేశించి, తన స్థానాన్ని అనతికాలంలోనే సుస్థిరం చేసుకోగలిగాడో, దానిని బట్టి అతడు కవితారంగంలో ఎందుకు పూర్తిగా ప్రవేశించలేదనే విషయం ఆశ్చర్యంగానే తోస్తుంది. యవ్వన ప్రాదుర్భావంతోనే అతడి కవితాప్రపంచం మొగ్గతొడిగింది. కవితాసక్తి జీవిత చరమాంకంలో కూడా అంతే ప్రాధాన్యం వహించి అతడిని ఆవహించింది. కవిత్వంతో ప్రారంభమైన అతడి రచనావ్యాసంగం తిరిగి కవితాభివ్యక్తితోనే నిష్క్రమించింది. అతడి సాహిత్యవ్యాసంగానికి నాందీప్రస్తావన చేసిందీ, చివరకు భారతవాక్యం చెప్పి మంగళాంతంచేసిందీ కవిత్వమే. అతడు సాహిత్యంలో కవిత్వంతో పుట్టి, మధ్యలో వచన రచనా వ్యవసాయం చేబట్టి చివర కవిత్వంతోనే అస్తమించాడనడం యధార్థం.

1937లో రాఘవ పదునాలుగు సంవత్సరాల వయస్సులో కౌమార్యంలో ఉండగా, కలకత్తానుండి వెలువడే 'సాప్తాహిక్ విశ్వామిత్ర' లో అతడి మొదటికవిత అచ్చయింది. అతడి సతీమణి సులోచన అక్షరసాక్ష్యంకనుక, ఆమె చెప్పినదాని ప్రకారం, రాఘవ తన చివరిఘడియల్లో ఆఖరిసారిగా మందగిస్తున్న కంఠంతో చెప్పిన చివరి రచన కూడా కవిత్వమే. దానినే ఆమె జాగ్రత్తపరిచి సాహిత్య జగత్తుకు అందించింది.

'గీతగోవిందం' [జయదేవుడు], 'భామినీవిలాసం' [జగన్నాథ పండితరాయలు] అనువాద రాతప్రతులు లభించకపోయినప్పటికీ, రోజురోజు రోగంముదిరి, ఆరోగ్యం క్షీణిస్తున్నదశలో, ఎక్కువగా శ్రమించి రాయాలనే దశలో రాఘవ సంస్కృతకావ్యాలను అనువదించేవాడు. దానితోపాటు వాటికి తగిన చిత్రాలు కూడా వేయించేవాడు. కవిత్వంపట్ల రాఘవ చాలా ఆకర్షితుడైవుండేవాడు. తనను కవిగా ప్రతిష్ఠించుకోవాలని కూడా రాఘవ ఆకాంక్షించాడు. ఇతర సాహిత్య ప్రక్రియల్లో శక్తిసామర్థ్యాలు

విభజింపబడినప్పటికీ, స్ఫూర్తివంతమైన అతడి రచనాసామర్థ్యం కావ్యరచనలో కూడా ప్రజ్వలించింది. కావ్యరంగంలో అతడు నిష్ఠాగరిష్ఠలతో పనిచేశాడు. అతడి కావ్యనిష్ఠను చూసి డా॥ శివకుమార్ మిశ్ర్ చేసిన వ్యాఖ్య ఉపాదేయం.

"రాఘువ సాధనాసంపత్తిలో ఉజ్వలమైన సాహిత్య సౌందర్యం అతడి కావ్య వైశిష్ట్యం – దీనిని కాదని అభ్యుదయకవిత్వాన్ని సమీక్షిస్తే అది అసంపూర్ణంగానే ఉండిపోగలదు..."

[రాంగేయ రాఘువ్‌కా రచనా సంసార్; పేజీ – 61]

రాఘువ ముద్రిత కావ్యకృతుల పుస్తక క్రమాన్ని బట్టి చూస్తే, 1944లో అచ్చయిన మొదటి కావ్యగ్రంథం 'అజేయ్‌ఖండహర్' – ఈ కావ్య రచనకు ముందు, ఆ తర్వాత రాసిన అతడి కావ్యకృతుల సంకలనం 1946లో వెలువడింది. జయశంకర్‌ప్రసాద్ రాసిన కావ్యం 'కామాయనీకి పోటీగా రాసిన రాఘువ పద్యకావ్యం 'మేధావీ' మానవుడి మౌలిక చింతనావేదనకు సంబంధించిన రచన. అది 1947లో వెలువడగా, అతడి మిగతా కవితల సంకలనం 'రాహ్‌కే దీపక్' 1948లో అచ్చయింది. మహాభారతంలోని ప్రముఖపాత్రలను ఆధునిక సందర్భంలో పరిశీలించాలనే రాఘువ సామాజిక స్పృహమేరకు సమాకాలీన చైతన్యంతో వెలువడిన అతడి ఖండకావ్యం 'పాంచాలి'. అది 1955లో వెలువడింది. 1956లో అతడి మిగతా కావ్యఖండికల సంకలనం 'రూప్ ఛాయా' అచ్చయింది.

ఈ కావ్య రచనల తర్వాత, జీవిత చరమాంకంలోని ఆరు సంవత్సరాలకాలంలో, కావ్యరంగంలో మహత్తరమైన రచనలు చేయాలనే ఆకాంక్ష రాఘువలో ఉండివున్నప్పటికీ, అతడు ఇతర ప్రక్రియల్లో తలమునకలై వున్నందువల్ల, కవితారచన సుదూర నిర్జన క్షేత్రసంగీతంగానే మిగిలిపోయింది.

నాజీలదురాక్రమణను సాహసవంతంగా ప్రతిఘటించిన సోవియట్ ప్రజల వీరోచితపోరాటాల మహాగాథగా రాఘువ 'అజేయ ఖండహర్' కావ్యం రాశాడు. సోవియట్ విప్లవం [1917] తర్వాతే, భారత

జాతీయోద్యమంలో రష్యా తన మహత్తరమైన పాత్రను నిర్వహించింది. సామ్రాజ్యవాదానికి, వలసవాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్న వర్గరహిత, దోపిడీవిముక్త రష్యా సోషలిస్టు సమాజంవైపు భారతరచయితలు ఆసక్తితోను, ఉత్సాహంతోను చూసి రచనలు చేశారు. మహోన్నత మానవసమాజ మైన సామ్యవాదాన్ని రచనలద్వారా దర్శించారు.

1943నాటికే యశపాల్ రాసిన సుప్రసిద్ధనవల "దేశద్రోహి" వెలువడింది. ఈ నవలలోని కథానాయకుడు నాటకీయంగా రష్యావెళ్ళి, అక్కడి సమసమాజాన్ని అధ్యయనం చేసే అవకాశాన్ని సంపాదిస్తాడు. మహోన్నత మానవ సమాజాన్ని సామ్యవాదవ్యవస్థలో దర్శించి ప్రభావితుడై భారతదేశం తిరిగివచ్చి, వామపక్ష ఉద్యమంలో క్రియాశీలంగా పనిచేస్తాడు.

రాఘవ రాసిన 'అజేయ ఖండహర్' కావ్యంలో రష్యాలోని సోషలిస్టు సమాజం, 'మానవవి ముక్తి దీపం'లా వెలుగుతుంది. నాజీలకు వ్యతిరేకంగా సాగిన మహత్తర ప్రజాప్రతిఘటన, పోరాటచైతన్యంతో బాటు, 1918నుండి 1942దాకా సాగిన సోషలిస్టు సమాజనిర్మాణంలో సోవియట్ ప్రజలు సాధించిన విజయాలను రాఘవ తన కావ్యంలో ఎంతో విపులంగా వర్ణించాడు.

"ప్రజాశక్తి అజేయమైనది, చావులేనిది – మహత్తరమైన పోరాటాలు చేసి మానవవిజయాలు సాధించినవారు రష్యాప్రజలు" అయినప్పటికీ, వారు భారతదేశానికి, సమస్తపీడిత మానవాళికి సంబంధించినవారని, రాఘవ కవిత్వంలో అంతర్జాతీయ దృక్పథాన్ని ముందుకు తెచ్చాడు. సమస్తప్రపంచంలో సామ్రాజ్యవాదానికి, వలసవిధానానికి, జాత్యహంకారానికి వ్యతిరేకంగా ప్రతిఘటిస్తూ, రక్తతర్పణంతో విముక్తిపోరాటాలు చేస్తూన్న దేశదేశాల ప్రజల వీరగాథలను రాఘవ తన 'అజేయ ఖండహర్' లో మహత్తరంగా వర్ణించి, ప్రపంచ వ్యాప్తవిప్లవాలతో మమేకంచెంది సంఘీభావం ప్రకటించాడు.

చైనాలో సాగుతూన్న దీర్ఘకాలిక విముక్తి పోరాటం ఆనాటికి ఒక నిర్ణయాత్మకదశకు చేరుకుంది. అలాగే భారత జాతీయోద్యమం చివరిమలుపు

తిరిగింది. సోవియట్ రష్యాలో ప్రజలు నాజీలకు వ్యతిరేకంగా సాగిస్తూన్న ప్రతిఘటనా పోరాటాలు చైనా విప్లవానికి, భారతజాతీయోద్యమానికి ప్రేరణా స్రోతస్వినులుగా నిలిచినట్లు రాఘవ తన కావ్యంలో పేర్కొన్నాడు. స్వాతంత్ర్యోద్యమం, విముక్తియుద్ధం కొనసాగిస్తూన్న స్టాలిన్‌గ్రాడ్, భారతదేశం ఈ సందర్భంలో అభిన్నంగా తోస్తాయి.

"చూడు చూడు!
వాడి తలమీంచి రాలిపడిన కిరీటం!
సింహాసనాలు కదిలిపోతున్నాయి
తరతరాల పాపాలను కడిగివేస్తుంది నీ రక్తం
మేలుకుంది ప్రజాశక్తుల నవ్యభారతం!"

[గ్రంథావళి – 9; పేజీ – 114]

ఈ విధంగా సోవియట్ ప్రజలు సాగించిన ప్రతిఘటనా పోరాటం – భారత స్వాతంత్ర్యోద్యమానికి ప్రేరణగా నిలిచి శతాబ్దాల బానిసవిధానంవల్ల సంక్రమించిన పాపాలను ప్రక్షాళనంచేయడానికి ఆహ్వానంగా మారిపోతుంది.

పరతంత్ర బానిస సమాజం వలసవిధానంవల్ల సంక్రమించిన అజ్ఞానం, మతపరమైన హింసలు, యుద్ధోన్మాదంరాకుండా నిర్మూలించడానికి సర్వరోగనివారిణి అయిన సామ్యవాద సమాజం ప్రత్యామ్నాయమంటూ, అది సాధించిన మహత్తర మానవ విజయాలను పేర్కొంటూ, ఉభయ సమాజాలను సరిపోల్చుతూ, రాఘవ తన కవితాధోరణిని యుక్తియుక్తం చేస్తాడు 'అజేయ్ ఖండహార్' కావ్యంలో. రష్యాలోని సోవియట్ల సంస్కృతీ వికాసం, సహకార వ్యవసాయం, సామ్యవాద వ్యవస్థానిర్మాణ కార్యక్రమం, పరిశ్రమల అభివృద్ధి, వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలోని సమృద్ధి, మున్నగు సామ్యవాద సమాజ విజయాలను రాఘవ తనకావ్యంలో విపులంగా చర్చిస్తాడు. బెర్లిన్‌పతనం, రష్యావిజయాలవల్ల తూర్పుయూరపు దేశాలమీద అనివార్యంగా పడే ప్రభావాలను, వారి పరిణామాలను రాఘవ తన కావ్యంలో భవిష్యవాణిగా విశేషించి చూపాడు. రాజకీయ చర్చలను కావ్యరచనల్లో రక్తికట్టించేట్లు రాయడం రాఘవ సాధించిన సాహిత్యవిజయం.

'అజేయ్ ఖండహార్' కావ్యాన్ని సమీక్షిస్తూ కవి త్రిలోచన్ రాసిన మాటలు రాఘవ నిబద్ధ అక్షరదీక్షకు ప్రమాణాలు.

"మొక్కవోని అద్భుతమైన ధీశక్తి రాఘవ ప్రత్యేకత. అతడు తన భావాల వికాసంకోసం దిశలను, దేశాలను హద్దులుగా భావించలేదు. కావ్యాలను ప్రాణవంతం చేయడానికి ఇక్కడ అక్కడ అనిగాక అంతటా శోధించి, జీవనతత్వాలను ఒక చోటికి తెచ్చి ఆకళించుకున్నాడు. ఆ విధంగానే అతడు ప్రారంభంనుండే మానవుడి జీవనశక్తిని సాక్షాత్కరించు కున్నాడు. ఆ సత్యాన్నే అత్యంతసుందరంగా చెప్పడానికి పరిశ్రమించాడు.."

['హంస్', మే – 1945, పేజీ – 440]

రాఘవ 'అజేయ ఖండహార్' కావ్యాన్ని రాసేనాటికీ, సుప్రసిద్ధ రచయితలైన ఇలియా ఎహ్రన్ బర్గ్, ఫాధయేవ్, అలెక్సీ టాల్‌స్టాయ్, కాంస్తేతిన్ ఫేదిన్ మున్నగువారి నాజీవ్యతిరేక, మహత్తర నవలలు వెలువడలేదన్నది గమనించాలి, కాబట్టి రాఘవ సమాచార సేకరణలో ఎంతగా శ్రమించిందీ ఆలోచించాలి.

ఇదివరకే వివరించినట్లు "మేధావి" కావ్యం 'కామాయనీకి' పోటీగానే రాయబడింది. దాని స్వరూపస్వభావాలను వివరిస్తూ రాఘవ రాసిన ముందుమాట గమనార్హం

"తత్వశాస్త్రం, భూగోళశాస్త్రం, చరిత్ర, రాజకీయప్రపంచం, సాంఘికశాస్త్రాలు మున్నగు విషయాలన్నీ ఈ నా కావ్యంలో కలగలిసిపోయాయి. అందువల్ల దీనికార్యరంగమే చాలావిస్తృతమైనది".
[గ్రంథావళి – 9; పేజీ – 145]

రాఘవ 'మేధావి' కావ్యనాయకుడుగా 'చరిత్ర'ను, కథనాయికగా 'గతి' (చలనం)ని రూపొందించినట్లు వివరించాడు. కావ్యంలో సర్గలు ఉన్నప్పటికీ, అది ఒక ప్రబంధకావ్యంగా రూపొందినప్పటికీ, 'కామాయనీ'లోలాగా ఇందులో ఆఖ్యానాలను సహకారంగా తీసుకోలేదు. సృష్టివికాసాన్ని, పరివర్తనను

తీసుకునే కవి తన చింతనాధోరణినంతా కథానాయకుడైన 'మేధావి' పాత్రద్వారా వెల్లడిచేశాడు. జయశంకర్ ప్రసాద్ 'కామాయనీ'లోని 'మను' పాత్రలాగే 'మేధావి' పాత్రకూడా మానవుడి వినాశనం పట్ల హతాసుడై ఉద్వేగంతో చింతిస్తుంది.

"ఎన్ని కలలు చెదిరిపోయాయి!
ఎన్ని ఆశలు వట్టిపోయాయి!
ఎన్ని సామ్రాజ్యాలు శిథిలాలుగా మిగిలిపోయాయి!
తలచుకుంటే నిట్టూర్పులే రగిలిపోతాయి!"

['మేధావి' – గ్రంథావళి; పేజీ – 146]

'కామాయని'లో కవిచింతనాధారకోసం కథలు ప్రబలమైన ఆధారాలవుతాయి. వీటి ఆధారంగానే భావాలు 'మూర్తిమత్వం' దాలుస్తాయి. ఇందుకు భిన్నంగా 'మేధావి'లోని ఆలోచనాప్రవాహం, చింతనాతీతమై, సహచర భావరాశిగా ముందుకు రావడంమూలాన అమూర్తమై నిరాటంకంగా సాగిపోతుంది. ఈ మనోగతికి మానవీయ ఆధారం లభించడం కూడా బలహీనంగానే ఉంటుంది.

'మేధావి' భూమితో విసిగి, నక్షత్రాలగమనాన్ని చదివి అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఈ సందర్భంలో మేధావి ఆలోచనా పర్యవసానంగా రెండేరెండు విషయాలు శాశ్వతమనే సారాంశం చివర తేలుతుంది. ఒకటి అధికారం అనవరతం ఆడే ఆట. రెండోది మారేక్రమం – వాస్తవానికి సృష్టిగమనంలో మౌలికంగా ఉండేవి ఈ రెండు విషయాలే. ఆ తర్వాత మేధావి విశ్వాంతరాళంలోని మహాశూన్యం మధ్య సౌరకుటుంబనిర్మాణాన్ని ఊహిస్తాడు. రాఘవ మానవవికాసాన్ని శాస్త్రీయ విశ్వాసాల ఆధారంమేరకు చిత్రించడానికి ప్రయత్నిస్తాడు. అతడికీ విషయం చాలా ఇష్టమైనది. అదే అభివృద్ధి చెంది 'మహాయాత్ర'లో విస్తృతంగా చోటు చేసుకుంది. చరిత్రలోని, ముఖ్యఘట్టాలు, ఆయావ్యక్తుల సన్నివేశాలు, ఆర్యుల దురాక్రమణ, పీడన, అత్యాచారాలు, వారిని ప్రతిఘటించే ద్రావిడజాతుల ఆత్మాభిమానం వగైరా యధార్థాలు ఈ

కావ్యంలో దర్శనమిస్తాయి. ఈ ప్రస్తావనవల్లే రాఘవమీద ద్రావిడ పక్షపాతిగా ముద్రపడింది. ప్రస్తావనలు విశ్వాసాలు కాజాలవు.

తన ఆలోచనా ధోరణిలో 'మేధావి' గతాన్ని మాత్రమే దర్శించదు. అతడి చింతనాధారలో ఒకవైపు గతానికి సంబంధించిన మానవుడి వికాసం కేంద్రీకృతమైవుంటే, మరోవైపు అతడి భవిష్యత్తుకు సంబంధించిన తపనకూడా పుంజీభూతమై ఉంటుంది. గతం, వర్తమానం భవిష్యత్తులో సార్థకమై పోతాయి. సంపూర్ణ మానవేతిహాసాలలో మానవుడి విముక్తిపోరాటాలమీదే రాఘవ ఆశావిశ్వాసాలు. మానవుడి విముక్తిపోరాటమే అంతిమంగా యుద్ధోన్మాదంలేని, దోపిడీ సాగని, వర్గరహితసమాజాన్ని రచించే సత్సంకల్పాన్ని అభివ్యక్తం చేస్తుంది. స్వేచ్ఛాపూరితంగా, నిరంకుశంగా సాగిన ఆలోచనాధోరణిలో, మేధావిలో ఆదిమానవుడినుండి సామ్యవాదమానవు డిదాకా వికాసయాత్రను ప్రతిబింబించడంలో రాఘవ సఫలీకృతుడే అయ్యాడు.

వర్తమాన ప్రేరణల కోసం, పౌరాణిక విషయాలను ఉటంకించడం రాఘవకు శుష్కప్రయాసగా అనిపించలేదు. కొందరు విమర్శకులు మరో రచయితను సమీక్షించే సందర్భంలో ఈ ప్రశ్నను లేవదీశారు కూడా.

'పాంచలి'లో రాఘవ స్త్రీ ఆత్మాభిమానాన్ని ఒక కొత్తకోణం ద్వారా చూస్తూనే, మరోవైపు సమాజం, వర్ణవ్యవస్థ, రాజ్యం, అహింస, సంపద మున్నగు విషయాలమీద కూడా చర్చించి, పాంచాలిపాత్రను ఆధునిక సందర్భంలో మేళవించడానికి ప్రయత్నిస్తాడు. ఆ విధంగా పౌరాణిక పాత్రలద్వారా ఆధునిక యుగావసరాలను ముందుకు తెస్తాడు తర్కబద్ధంగా. ఆధునికంగా చర్చనీయాంశాలైనప్పటికీ, చారిత్రక పరిణామంలో ఇతివృత్తం తన పరిధిని, ద్వాపరయుగాన్ని దాటి పోదు. ఈ సందర్భంలోనే యుధిష్ఠిరుని పాత్రకు ఒక కొత్త అర్థం వచ్చేట్లు రాఘవ ప్రయత్నించి నవ్యతను ప్రాసంగికం చేశాడు.

"అతడు బానిసవిధానంలోని పరాధీనతను ఆమోదిస్తూనే, అందులో

కొనసాగే అమానుష అత్యాచారాల బండారాన్ని బయటపెట్టాడు. తద్వారా పై వర్గాలలో నిరంకుశ శాసన పద్ధతిని సమూలంగా కదిలించివేశాడు. అతడు సమాజమర్యాదలను నమ్మి ఆచరించేవాడు. అందువల్ల అతడు బానిసవిధానాన్ని స్వీకరించినట్లు కనిపిస్తాడు. కాని వాస్తవ పరిస్థితి అది కాదు. ఎవ్వరూ ఆనాటిదాకా ఆవ్యవస్థను కనీసం సందేహించనైనా లేదు. దేన్నైతే నీవు సమాజనియమంగా ధర్మంగా ప్రవచిస్తావో, దానినే ఒకసారినీపై అమలుచేసుకొని చూడు. అప్పుడు దానివల్ల జీవితం ఎలా ఉంటుందో తెలుస్తుంది" అని ధర్మరాజు అంటాడు. ఈ సందేహ కారణమే బానిసవిధానం ఆ తర్వాత భారతంలో వినాశానికి కారణమైంది."

['పాంచాలి' : పేజీ–5]

తన కాలపు నియమనిబంధనల మేరకు యుధిష్ఠిరుడు ఒక కొత్తమార్గాన్ని చేపట్టివుండక పోవచ్చు. కాని అతడు నిరంకుశాధికారాన్ని మాత్రం నెమ్మదిగా వ్యతిరేకించాడు.

"ధర్మరాజు మానవతాదార్శనికుడు. సంపదకు సంబంధించిన నియమాలే సమస్తమర్యాదాలను నిర్ణయిస్తాయనీ, అవే అన్నివిలువలకన్నా చాలాఉన్నతంగా ఉంటాయనీ, ఆ కారణంగానే ఇంటి ఆడపడుచును ఆ ఇంటిసోదరుడు బిత్తల చేశాడనీ, వ్యక్తిగత, కౌటుంబిక సంబంధాలను నిర్ణయించే పై వ్యవస్థగా ఆర్థికవ్యవస్థ, దాని స్వార్థం పనిచేస్తాయనీ, ఆర్థికవ్యవస్థే 'మతంముడి'గా ఉంటుందనీ ధర్మరాజు రాజనీతిని వివరిస్తాడు".

['పాంచాలి']

కౌటుంబిక మర్యాదల మేరకు యుధిష్ఠిరుడు కౌరవులపట్ల చూపిన ఔదార్యానికి ద్రౌపది మిక్కిలి అసంతోషంగానే ఉంటుంది. వేటకోసం పాండవులంతా ఆశ్రమం వీడి బయటికి పోయినప్పుడు, వనంలో ఒంటరిగా కూర్చొని గతంలోని అనేక విషయాలను నెమరు వేసుకుంటుంది. యుధిష్ఠిరునిపట్ల తీవ్రమైన అసంతృప్తి ఉన్నప్పటికీ, వాల్హీకంనుండి కామరూపందాకా అందరూ అతడిపట్ల నతమస్తకులై గౌరవమర్యాదలు చేయడంచేత, అతడి సన్మానం చూసి ద్రౌపది కూడా సంతోషిస్తుంది.

యుధిష్ఠిరుని ఔదార్యాన్ని చూసి, అప్పుడుప్పుడూ 'అతడు మానవుడా పాషాణమా'! అని ద్రౌపది ఆలోచిస్తుంది. దేనికీ చలించని ధోరణిని చూసి అతడు "కాష్ఠం పేర్చేవాడ"ని నిందిస్తుంది. ఒంటరిగా యుధిష్ఠిరుని సామర్థ్యమేమిటి? మిగతా నలుగురుసోదరులే లేకపోతే అతడి గతి ఏమయ్యేదని, వారివల్లే అతడి గౌరవం, ధర్మం దెబ్బతినకుండా ఉండగలిగాయని ద్రౌపది మండిపడుతూ ధర్మరాజును విమర్శిసుంది. ద్రౌపది కోపతాపాలను చూస్తూ యుధిష్ఠిరుడన్న మాటలు అతడి నిగ్రహచింతనకు, ఉన్నత వ్యక్తిత్వానికి, బాధ్యతాయుతమైన ధర్మావలంబనకు, యుగకర్తవ్యానికి మచ్చుతునకలు :

"నాకు దుఃఖం కలగదంటావా పాంచాలీ!
నా తమ్ములు వీరశూరులని నాకు తెలియదా!
వారే లేకుంటే నేను బతికివుండేవాడినా?
నాధర్మాన్ని ప్రశ్నిస్తున్నావు కదూ! అయితే విను,
ఈ సందడిలో నేను చనిపోయేవాణ్ణి
కానీ నా ధర్మానికి మాత్రంక్షతి ఏర్పడేది కాదు"!

['పాంచాలి' : పేజీ - 37]

ఆశ్రమంలో ఒంటరిగా ద్రౌపది చిక్కినప్పుడు, జయద్రథుడు మోహావేశపరుడై పాండవులను హీనంగా నిందిస్తూ అన్నమాటలకు క్రోధావేశంలో స్త్రీమర్యాదను అర్థంచేసుకోమని వాడిని హెచ్చరిస్తుంది.

"నేను కురుభూమిలో విజయపతాకను
నేను చక్రవర్తి మహిమావైభవాన్ని....
ఓరి సేవకుడా! నీవు నన్ను భరించగలవురా
ఓరి ఉన్మాదీ! నీవు మాతృహీనుడవా పాపీ!
స్త్రీ గౌరవం నీకు తెలియదటరా మూర్ఖుడా!
నేను పవిత్రతను, కులస్త్రీని, మాతృమూర్తిని
ఓరి హతభాగ్యుడా! నీవా నాకు ఆశలు చూపేది"?

ఈ జీవితమే రణరంగం నాకిందులో భయంలేదు
నేను చేతులు మారే వస్తువుననీ భావించావా?
['పాంచాలి' ; పేజీ – 64–65]

తన అంతరంగంలో కోపం, ప్రతీకారం, ప్రతిహింస చెలరేగినప్పటికీ, యుధిష్ఠిరుని పట్ల తీవ్రమైన అసంతృప్తి రాజుకొనివున్నప్పటికీ, అతడి మర్యాదకు భంగంవాటిల్లకుండా బాధ్యతతోనే ద్రౌపది ప్రవర్తిస్తుంది. ధర్మరాజు సోదరులందరూ క్రోధావేశులై జయద్రథుని దుష్టత్వానికి తగిన గుణపాఠం చెప్పాలని కార్యతత్పరులై ఉన్న ఉద్రిక్తసమయాల్లో ద్రౌపది సంయమనంతో చేసిన ప్రకటన ఆమె సహజ ఉద్రిక్తస్వభావానికి భిన్నమైనది. యుధిష్ఠిరుడు ఆవహించినట్లు దొర్లి వచ్చినది.

"ఏది చేస్తే ధర్మం గెలుస్తుందో అదే చేస్తాను
అపరాధిని వదిలి క్షమాగుణం ప్రదర్శిస్తాను".
['పాంచాలి'; పేజీ – 84]

సామ్రాజ్యవాదుల యుద్ధోన్మాదం, దోపిడీ, వర్గవిభేదాలు మున్నగు వాటికి వ్యతిరేకంగా మేల్కొంటున్న ప్రజాచైతన్యంగురించి, తమహక్కుల కోసం పోరాడుతూన్న ప్రజలగురించి రాఘవ మిగతాకావ్యఖండికల్లో ఎక్కువగా రాశాడు. ఆ రచనలే 'పిఘల్తే పత్థర్', 'రాహ్‌కీ దీపక్', 'రూప్ ఛాయా' కవితాసంకలనాలుగా వెలువడ్డాయి. చైతన్యం పొందుతూన్న మానవుడి ఆకాంక్షలకు అద్దంపట్టిన అతడి కవితా రచనలను చూసి విమర్శకులు అతడిది. 'ప్రచారసాహిత్య'మని ముద్రవేశారు కూడా. నిజానికాకవితల్లో భ్రష్టుపట్టిన సమాజంపట్ల కవి నిరసన. నూతన లక్ష్యాలమేరకు రాబోయే ఉన్నత సమాజం ఆకాంక్షలను రాఘవ ప్రదర్శిస్తాడు. అలా చేయడమే ప్రచారమైతే దానిని అతడు స్వీకరిస్తాడు కూడా.

"ఇది ముదిగి కుళ్ళిన భ్రష్ట సమాజం
కవి ఆదర్శమే ప్రచారమైతే,
అదే నిత్యము ప్రచారమే సత్యము

జీవన సమరమే నినాదమై పలుకుతుంది
దాని అవసరమే రోజూ పెరుగుతుంది".

['గ్రంథావళి' – 9; పేజీ – 17]

ఈ క్రమంలోనే రాఘవ తన కవితాకళ నిర్వహించే పాత్ర గురించి మరింత స్పష్టం చేశాడు :

"ప్రీతి ప్రశంసల భిక్షువులం కాము
కాము ఎవరికీ దీనబానిసలం
భూస్వామ్యవిధానాన్ని కాలదంతాం
నిరంకుశంగా ముక్తిగీతం ఆలపిస్తాం
నెత్తురు త్రాగే క్షుద్రపీడకులకు
అమానుషాల నీచదోపిడీకి
కావ్య కళాజ్యోతులను సమర్పించం
దోపిడీనిర్మూలనలో కళాకాంతులు వెలిగిస్తాం"!

['గ్రంథావళి' – 9; పేజీ – 18]

'ఎవైక్యుఈ', 'ఆతతాయి' శీర్షికలతో వెలువడిన కవితల్లో రాఘవ సామ్రాజ్యవాద, భూస్వామ్యవిధానాల వర్గస్వభావాలను వివరిస్తూ, వాటి మానవ వ్యతిరేకతత్వాన్ని బహిర్గతం చేశాడు. కవి వర్గసమాజంలో ప్రతి పక్షంలాంటివాడని 'సూర్యోదయ్', 'ప్రతిశోధ్', 'ఔర్‌లోహా', 'మజ్దూర్' మున్నగు కవితల్లో విపులీకరించాడు. ప్రజల వీరోచిత వర్గపోరాటాలను వాటికి సంబంధించిన మహత్తరత్యాగాలను 'సూర్యోదయ్' కవితలో వివరిస్తాడు. భారతప్రజలు 'జలియన్ వాలాబాగ్', 'బలియా' లాంటి బ్రిటిష సామ్రాజ్యవాదుల దౌష్ట్యాలకు ప్రతీకారం తీర్చుకుని, తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకున్నారు. బ్రిటిషసామ్రాజ్యవాదులు అమానుషమైన క్రూరాలను ప్రదర్శించికూడా –

"భారత ప్రజల దేశాభిమానం కొంచెంకూడా అంతం చేయలేక పోయారు".

['గ్రంథావళి' – 9; పేజీ – 35]

'ఔర్‌లోహా' అనే కవితలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సాగిన సంఘటితప్రజల జైత్రయాత్రను వర్ణించాడు రాఘువ. భూస్వామ్య శక్తుల పెట్టుబడిదారీతత్వాల స్వార్థస్వభావాల దొంగాటల నిష్ఠుర రూపమే యుద్ధమని రాఘువ సూత్రీకరించాడు. ఈ కవితలో విలువల కోసం పోరాడే ప్రపంచప్రజల సంఘీభావం. విశ్వసంస్కృతిలో రోజూ పెరుగుతూనే ఉంది. సోవియట్ రష్యాలో కిర్గిజ్, ఉజ్బెక్‌మున్నగు అనేక ప్రాంతాల్లో సాగిన నవజాగృతిలోను, నవనిర్మాణంలోను అంతర్జాతీయ శ్రామికవర్గఐక్యతా భావం విశ్వమానవ సంస్కృతిగా సమధికోత్సాహంతో అభివృద్ధిచెందింది.

ఈ కవితలో పీడితులను, కార్మిక వర్గాన్ని ప్రతిబింబిస్తూ రాఘువ రచనలు చేశాడు. అతడి 'మజ్దూర్' కవితలో ఒక పసిబాలుడు పలుగుపార పట్టుకొని, వచ్చీపోయే హతాసువులైన కార్మికలగురించి తనతల్లితో అడుగుతాడు. ప్రశ్నలడిగే బాలుడే స్వయంగా సమాధానాలు చెబుతాడు కూడా. తల్లి చెప్పే సమాధానాలకు తృప్తిపడక ఆవేశంతో చివర, తాను పెరిగి పెద్దవాడయ్యాక మొత్తం చీకటంతా తొలగిపోతుందని ప్రకటిస్తాడు.

'హరిజన్' కవితలో శంకరా, వాడి చెల్లెలు సర్భతియా మనుషుల్లాగాక, ఇంట్లో పెంచబడిన పశువులవలె ఉండడాన్ని ప్రశ్నిస్తూ మహాత్మాగాంధీ పేర్కొన్న హరిజనోద్ధరణ ఏ విధంగా విఫలమైందీ వివరిస్తాడు రాఘువ.

"ఆత్మాభిమానం అంతటా మృగ్యం
ప్రాణరాహిత్యంలో ఎలా సాధ్యం చైతన్యవికాసం?
అందులోనే పుట్టి పెరిగే ఆత్మన్యూనతా భావం,
పోషిస్తున్న నవీన హీన జీవన విషాదం"!

అదే విధంగా 'శపథ్' కవితలో మానవ కల్యాణంలోసం గాంధీ చేబట్టిన ఉపవాసదీక్షలవ్యర్థత్వాన్ని చర్చిస్తాడు.

తన తల్లిమరణాన్ని పురస్కరించుకొని 'మాతృదాహ్' కవిత రాయబడినప్పటికీ, ఆదిశంకరాచార్యను కేంద్రబిందువుగా చేసుకొని కొనసాగుతుంది. సాంఘికదృఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా సత్యోన్ముఖంగా

సాగిన అతడి ఆమరణయాత్ర ఎంతో తేజోమయంగా ఈ కవితలో రేఖాంకితం చేయబడింది.

సుప్రసిద్ధ హిందీకవి నిరాలా రాసిన 'రాంకీ శక్తిపూజ' ప్రేరణతో రాఘవ రాసిన 'రాంకా సముద్ర శాసన్' కవితలో మానవుడి ఆత్మాభిమానాన్ని, స్త్రీగౌరవాన్ని కాపాడడంకోసం తప్పక చేయాల్సిన పోరాటం గురించి నొక్కిచెబుతాడు.

అభ్యుదయకవుల్లో నాగార్జున్, కేదార్‌నాథ్ అగర్వాల్ మాదిరి, భార్యనుద్దేశించిన ప్రేమకవితలను రాఘవకూడా రాశాడు. 'పరిచయ్' శీర్షికతో ఎన్నో భాగాలుగా రాయబడిన ఈ సుదీర్ఘ కవిత అతడి 'గ్రంథావళి' లో చేరింది. ఇది ప్రాముఖ్యంగల చెప్పుకోదగిన కవిత. రాఘవ వివాహం చాలా ఆలస్యంగా అతని 33వ ఏట జరిగింది. వివాహం అయిన వెంటనే సతీమణి సులోచన వైర్ నివాసానికి వచ్చిన సందర్భంలో రాఘవ రాసి ప్రేమకానుకగా సమర్పించుకున్నదీ కవితాపరంపరే. ప్రియురాలు రాకతో భూమ్యాకాశాలేగాక సమస్త సృష్టిసైతం మారిపోయినట్లుగా అతడికి తోచింది. ఆ విషయాన్నే అతడు రసమయం చేస్తూ కవితావిష్కారం చేశాడు, ఆవహించిన ప్రణయతన్మయతలో

"మళ్ళీ నీతో పరిచయం
ఊహాల రెక్కల మీద సురధనుస్సుల కరిగేవేళ
చెవులనిండా కలరవాల మోహారింపు
సీతాకోక చిలుకలమీద కొత్తశోభలు
మాధవీలతల తన్మయనాట్యాలు
జడలో ఒదిగిన తారకల మల్లెపందిరి
ఇప్పుడు రాత్రే ఒక నవోఢ
ప్రియా! నా మాట వినూ"!

['గ్రంథావళి' – 9; పేజీ – 85]

ప్రథమ పరిచయాల ఈ మధురక్షణాలలో కూడా రాఘవ ప్రేమసందర్శనం చేస్తూ చేయిస్తూ కూడా, తన మౌలిక విశ్వాసాలను, జీవనశైలిని ఆమెకు చూపకుండా ఉంచలేదు. అతడి తన్మయభావనలో అప్పుడు భూమ్యాకాశాలే ప్రేమమందిరాలయ్యాయి.

'అహం' చేసే వ్యాకులవేట,వెతల అమ్ముల పొదిలో వాంఛల బాణాలు నిండివున్నాయి. భావవిపినంలో మంటల ధనుస్సుమీద తృష్ణల అల్లెతాడు కట్టి తిరుగుతున్నాడు. 'అహం' వేటగాడు. వాడు మృగయావినోది. ప్రేమివిలువలు తెలియనివాడు. సృష్టిమాధుర్యాన్ని స్వాధీనం చేసుకోవాడానికి 'అహం ఈ వేటను ఛేదించాడు. అమరత్వకోరిక వ్యర్థమైనది. మృత్యువు తప్పనిసరిగా వచ్చేది. అందువల్ల జీవించివున్నంతవరకు సంతోషంగానే జీవించాలి. కీర్తి. ధనం తృప్తి చెందాలనే వాంఛలనుండి విముక్తి చెంది ఆనందంగా బతకాలి. ఇలా ప్రణయసన్నివేశంలో కూడా జీవితలక్ష్యాలను కవితామయంగా వ్యాఖ్యానిస్తాడు రాఘవ తన కవితలో. ఈ సన్నివేశంలో ప్రేయసి నిరాశతో కనిపించడంవల్ల కవి ఆమెకు ఊరట కలిగిస్తూ చెప్పిన పంక్తులు ఆర్ద్రంగా ఉన్నాయి.

"ప్రియా! తెలుసుకో!
జీవితం ఆవలితీరం చేరే ఈదులాట
కాలిపోవడం ఊరట
యాతన పడడం నిజం
ప్రియా ప్రియుల సంగమం కూడా ఇక్కడే
ప్రియా! దుఃఖమే జగతిలో అంతరించదు"

['గ్రంథావళి' 9; పేజీ 91]

బౌద్ధదర్శనం ఈ కవితలో ప్రతిధ్వనిస్తుంది. ఈ కవిత శాశ్వతసత్యాన్ని చెబుతూనే విశిష్టజీవనశైలిని కూడా ప్రతిపాదిస్తుంది. తెలియని దుఃఖానుభవాన్ని ప్రేమించే బలహీనతకు భిన్నమైనదీ భావన. దుఃఖనుభవంలోనే దుఃఖసార్థక్యాన్ని చూసే దృష్టికి భిన్నమైనది అతడి నిర్వేదదృష్టి. అన్ని దుఃఖాలమధ్య ఉంటూనే ఉల్లాసంగా దాని నిర్మూలనకు

పడే ఉన్నతమానవ సంస్కార సంతోషం అది. ఆ తన్మయభావంలోని దుఃఖం సాంఘికసత్యమై సార్థకత సాధిస్తుంది.

దుఃఖ సార్థక్య భావంలో, స్త్రీపురుషుల్లో ఎవరినీ మాధ్యమంగా స్వీకరించక, ఉభయులూ సర్వస్వతంత్రంగా ఉంటూ, ఒకరి గౌరవ మర్యాదలకు మరొకరు పాటుపడే సంస్కారదృష్టిని ప్రదర్శిస్తారు.

వాస్తవిక ప్రపంచంలోనేగాక, సామాజిక సంస్కార ఔన్నత్య విస్తృతిలోనే స్త్రీపురుషుల ప్రేమతత్వం పూర్ణత్వసిద్ధిని పొందుతుంది. ఆకలిదప్పులతో ఆధైర్యపడిన కార్మికవర్గం [ప్రొలిటేరియట్] జాగృతికోసం సమర్పించుకోవడంలోనే స్త్రీ పురుషుల ప్రేమతత్వం అర్థవంతంకాగలదు. [బహుశా ఇది నేటి ఫెమినిస్టులకు కనువిప్పుకాగల ఏకైక ఆదర్శం]

"మేము ఆకాశంకిందే ఉండిపోతాం
ప్రపంచంలో పూలు పెంచడానికి
భూమినంతా మా నెత్తురుతో తడపడానికే
జీవితమంతా పోరాడుతాం
ప్రంపచం కోసం కన్నీరు వదిలే
నీ ప్రేమ అంతా నాకుకావాలి."

['గ్రంథావళి' 9; పేజీ – 94]

రాఘవ తన కవితలో కేవలం ఆదర్శాలను వర్ణించలేదు. అలా ఆ మహాశయుడు అక్షరాలా అన్ని ఇబ్బందులపాలవుతూ ప్రాణాంతకవ్యాధితో పోరాడుతూ రాజీలేని బతుకు బతికాడు. మాటకీ, ఆచరణకూ ఉండే ఈ సమన్వయంవల్లే రాఘవ కావ్యకృతులకు సంవేదనాశీలమైన ఆధారక్షేత్రం లభించింది. దాని మీద ఉజ్వలంగా వెలిగే రాఘవను గుర్తించడం కూడా అందరికీ సాధ్యపడింది. రాజకీయాల ఉట్టి గొప్పలకాలంలో ఇలా క్రియాశీలంగా ఆదర్శవంతంగా లబ్ధి పొందడం మామూలు విషయంకాదు అనితర సాధ్యంకూడా.

# 4. నవలలు – నవచైతన్యం

రాఘవ విద్యార్థిదశలోనే 'ఘరౌందా' [గుజ్జనగూడు] రచనతో నవలాకారుడుగా పరిచయమయ్యాడు. మొదటి నవలే అయినప్పటికీ ముందుముందు గొప్పనవలాకారుడు కాగలిగే అద్భుతమైన శక్తిసామర్థ్యాలు ఆ నవలలో రూపొందాయి. ప్రొఫెసర్ ప్రకాశ్ చంద్రగుప్త్ ఆ నవలను సమీక్షిస్తూ తేల్చిన విశేషాలు గమనార్హం :

"రాఘవ హిందీసాహిత్యంలో తోకచుక్కవేగంతో పుట్టుకొచ్చాడు. ఇతడి రచనలో శక్తి, వేగం, సామాజిక చైతన్యం, అశాంతి ఉన్నాయి. తుఫానుగాలిరువ్వడి, వర్షాకాల నదీవేగం కలిసి విజృంభించినట్లు ఉన్నాయి. తీరాలను చెరిపి వనభూమిలో విస్తరించే స్వచ్ఛంద ప్రవాహం ఇతడి ప్రత్యేకత."

["ఆధునిక్ హిందీ సాహిత్య్" – ఏక్ దృష్టి – పేజీ –180]

ఒక కొత్త రచయిత మొదటి రచనకుండే అపరిణత ఆలోచనాధోరణి, శిల్పలోపాలు వగైరా ఆ రచనలో అవశ్యంగానే ఉన్నాయి. అయినా ఆ రచన ఒక సంపూర్ణభవిష్యత్తుకు సంకేతంలా కనబడి, రచయిత ఆత్మవిశ్వాసాన్ని తెలియజేస్తుంది. పుస్తక సమీక్షాంతంలో ప్రకాశ్చంద్ర పై మాటలు గమనించాలి

"రచయిత ఇప్పుడు గుజ్జనగూళ్ళు కట్టాడు. ముందు ముందు అతడు ఇళ్ళు కూడా కడతాడు. మొదటి రచనలోనే రాఘవ ప్రదర్శించిన శక్తి సామర్థ్యాలు సాహిత్యంలో సాధారణ సంఘటనలు కావు. హిందీలో నవీనసృజనాశక్తి పుట్టుకు రావడానికి అది సూచన"

['పై పుస్తకం'; పేజీ – 183]

'ఘరౌందా నుండి' 'ఆఖరీ ఆవాజ్' దాకా నవలా రచనలో రాఘవ ఒక సుదీర్ఘ ప్రయాణమార్గాన్ని ఎన్నుకున్నాడు. అన్నీ కలిపి అతడు సుమారు 38 నవలలదాకా రాశాడు. విమర్శకులు చాలామట్టుకు తమ

సిద్ధాంతాలచాటున రాఘవ నవలలను ఉపేక్షకు గురిచేశారు. మరణం తర్వాత అతడిపట్ల చూపబడిన అశ్రద్ధగురించి అందరూ గంభీరంగా ఆలోచించిన దశలో ఈ సమీక్షకులే నిర్లక్ష్యం చేయదగిన అతడి పొరపాట్లను అనేకసార్లు గోరంతలు కొండంతలు చేయడానికే ప్రయత్నించారు. సామాన్య రచనలను తీసుకొని అతడి సంపూర్ణ సాహిత్యాన్ని, వ్యక్తిత్వాన్ని తమ ఇష్టానుసారం తీర్పునిచ్చి వెలగట్టే సాహసానికి పూనుకున్నారు. ఒక విమర్శకుడు చెప్పినదాన్ని ఈ సందర్భంలో పరిశీలించడం తప్పనిసరి.

''రాఘవ రచనలన్నింటిలోనూ సంయమనం, సమన్వయం లోపించడంవల్ల ఒక స్రష్టకుండాల్సిన కళాప్రమాణాలు, స్థిర సంవేదనలు ఎక్కువగానే కొరవడ్డాయి... గుండెను పిండే తీవ్రానుభూతులవేగం అతడిలో చాలాతక్కువగాను, బౌద్ధిక వికాసం ఎక్కువగాను, మానసిక సంక్షోభం మామూలుగాను కనిపిస్తాయి. ఈ కారణంగానే, లెక్కకు మిక్కిలి రచనలు చేసినప్పటికీ, [ఏ కారణంవల్లనైనా కానీయండి!] రాఘవ హిందీ కావ్యప్రపంచలోనేమీ, నవలారంగంలోనేమీ తగినస్థానాన్ని సంపాదించుకోలేకపోయాడు. అదే అతడి సమకాలీన రచయితలు ఒకటి రెండు రచనలు చేసి మంచిస్థానాన్నే పొందగలిగారు''.

['నేమీచంద్ర జైన్' – ధర్మ్‌యుగ్: 15–9–63]

రాఘవ పాండిత్యం అతడి సృజనాత్మక శక్తిని అడ్డుకుంటుందని, తెలిసీతెలియని జ్ఞానప్రదర్శనే కళాప్రమాణాలకు సరిపోతాయని విమర్శకుల అభిప్రాయం కాబోలు? అది భ్రమ తప్పవేరుకాదు. ఈ విమర్శకులు తమ తప్పుడువాదాల సమర్థన కోసం, పెద్ద పెద్ద మాటలను, బరువైన సాక్ష్యాన్ని పేరుస్తారు. కాని వారు తమ అభ్యంతరాలస్పష్టీకరణను, విశ్లేషణను వివరించాల్సిన అవసరం ఉందని గమనించరు. వారు పడికట్టుపదాలుగా వాడిన పెద్దమాటలు : 'సంయమనం సమన్వయం', సమకాలిక కళాదృష్టి, 'స్థిరసంవేదన' – ఈ పెద్దమాటలకర్థం ఏమిటో వారు వివరించరు. 'పత్‌ఝర్' [ఆకురాలుకాలం], 'ఆఖరి ఆవాజ్' [చివరికేక] అనే ఈ రెండునవలలగురించి మాత్రమే ఉటంకించిన ఈ పెద్దమాటలను

మొత్తం అతడి సాహిత్యానికి ఆపాదించడం ఏమేరకు సబుబు? ఈ అర్థంలేని పెద్దమాటలు వారివద్ద ఎదుటివారిమీద ఆరోపించడానికి సిద్ధంగా ఉంటాయి. వారావిధంగానే యశ్‌పాల్, రాఘవ, అమృత్ రాయ్‌లపైన ముద్రలు వేశారు. 'లహర్'లో రాసిన వ్యాసంలో రాఘవ నవలలగురించి, వాటిలోని పొరపాట్ల కారణాలగురించి విపులంగానే చర్చించాను. ఆ విషయాలన్నింటినీ తిరిగి ప్రస్తావించే బదులు, రాఘవ రచనలెక్కువగా తన పట్టుదల, ప్రచురణకర్తల అభ్యర్థనలమేరకు వెలువడ్డాయని చెప్పడం భావ్యం – మిత్రులు, ప్రచురణ కర్తలు కోరినప్రకారం రచనలు చేసినవారు బహుశా రాఘవకన్నా తక్కువేనని చెప్పక తప్పదు. ఆ పట్టుదల, అభ్యర్థనల రూపాలు కూడా విభిన్నంగా ఉన్నాయి. రాఘవ తన పట్టుదలపర్యవసానంగా పోటీగా రాసిన నవలలు:

"విషాద్‌మఠ్", "సీదాసాదా రాస్తా" [చక్కని మామూలు మార్గం] – ప్రచురణకర్తల అభ్యర్థనలమేరకు అతడు మూడు రోజుల్లో "రాయి ఔర్ పర్వత్" [రాగులగింజనుండి పర్వతం – హిందీ నానుడి 'గోరంతలు కొండంతలు' చేయడంలాంటిది] నవలను రాసి ఇచ్చాడు. అలాగే ఒక నెలరోజుల్లో "కబ్‌తక్‌పుకారూ" (ఎప్పటిదాక పిలవాలి) నవల రాసి ఇచ్చాడు. రాఘవ జీవితమంతా స్వతంత్ర రచనావృత్తిలో ఉండాలనే పట్టుదలతో ఉన్నాడు. రాఘవ నవలలు అసమంజసంగా ఉన్నాయనేది నిర్వివాదమే కావచ్చు. ఒకేచోట రెండువైపులా మంచీ–చెడూ పెనవేసుకొనివుండవచ్చు. ఈ విషయం దురదృష్టకరమే కావచ్చు. కాని దాని లోతుల్లోకి వెళ్ళకుండా, అతడి రచనల్లో లోపంతోపాటు మంచినికూడా చూడక పోవడం – బహుశా ఈ నిర్లక్ష్యానికి మూలకారణం. విమర్శకు ముందే ఏర్పరచుకున్న దురభిప్రాయం కాబోలు!

రాఘవ సమస్త నవలా సాహిత్యాన్ని అధ్యయన సౌలభ్యంకోసం ఈ విధంగా విభజన చేయవచ్చు :

1. సాంఘిక నవలలు

అ. నగరజీవితానికి సంబంధించిన నవలలు
ఆ. గ్రామీణ జీవితానికి సంబంధించిన నవలలు

2. చారిత్రక నవలలు
3. జీవిత చరిత్రాత్మక నవలలు
4. నిర్దుష్టవాతావరణానికి, సన్నివేశానికి, ప్రాంతానికి సంబంధించిన 'ఆంచలిక్' నవలలు

నగర జీవితానికి సంబంధించిన నవలల్లో రాఘవ అనేక సమస్యలను తీసుకొని రాశాడు. 'ఛోటీసీబాత్' [చిన్న మాట లేక స్వల్ప విషయం], 'విషాద్‌మఠ్', 'రాయిఔర్ పర్వత్', 'సీదాసాదారాస్తా', 'హుజూర్'.

[యజమానిని అతిగౌరవంగా సంబోధించే సేవకుని పిలుపు – ఇదివరకు రాజులను సేవకులు అలా సంబోధించేవారు నతమస్తకులై. అదేమాట ఆధునికంగా పైవారికి కిందివారికి మధ్య అంతరాన్ని తెలిపే సంబోధనగా నిలిచిపోయింది ఫ్యూడల్‌సంస్కృతిలో భాగంగా తెలుగులో దొరగారు, అయ్యవారు, ప్రభువులాంటి మాటలు 'హుజూర్' మాటకు సమానార్థకాలు]

'ప్రొఫెసర్', 'కల్పనా', 'ఉబాల్' [ఉద్రకడం – ఉద్వేగం], పత్‌ఝర్ [ఆకురాలు కాలం] మున్నగునవన్నీ పట్టణ జీవిత చిత్రణలే.

'ఛోటీసీ బాత్' అనే నవల లేఖలరూపంలో రాయబడింది. ఇందులో స్త్రీపురుష సంబంధాలు, స్త్రీ సామాజిక స్థితిగతులగురించిన విశ్లేషణలు ఉన్నాయి.

'విషాద్‌మఠ్' అనే నవల బెంగాల్ కరవునాధారం చేసుకొని భయభీతావహం చెందిన మానవత్వంగురించి కరుణ రసప్రధానంగా రాయబడిన నవల. రచయిత పరిపూర్ణ మానవత్వదృక్పథాన్ని ఎత్తిచూపడానికి రూపొందించిన రచన ఇది. ఈ నవల రాయడానికి ముందు స్వయానా రచయిత కరువుప్రాంతాలను సందర్శించివచ్చాడు. ఇందులో స్త్రీ

బలాత్కారాలప్రసక్తి కూడా ఉంది. ఈ బలాత్కార దృశ్యాల వివరణలో రచయిత ఒకటి రెండు మాటలద్వారా ఆ భావాన్ని తెచ్చి ముందుకు సాగిపోయాడు. ఈ సందర్భంలో ఎక్కడా రచయిత కుసంస్కారాన్ని చెబుతూ లీనమై బలత్కారవర్ణనలో రుచులు పెంచుకోడు. మానవుడి పతనాన్ని, స్త్రీ పరాధీనతను చెంప ఛెళ్ళుమనేట్లుగా చెప్పి, మొత్తం నాగరికతాసంస్కృతుల ఎదుట ఒక ప్రశ్నగుర్తు పెడతాడు.

మార్క్సిస్టు జీవన దృక్పథాన్ని విభిన్న పద్ధతుల్లో ఆచరణలో పెట్టే రచయితల విశ్వాసంగురించి 'సీదాసాదా రాస్తా', 'హుజూర్' నవలల్లో రాఘవ వివరిస్తాడు. భగవతీ చరణ్‌వర్మ 'టేఢే మేఢే రాస్తే' నవలరాశాడు. ఈ రెండు నవలలగురించి విమర్శకుల్లో చాలా భేదాభిప్రాయం ఉంది. అందరూ అంగీకరించినట్లుగానే భగవతీ చరణ్‌వర్మ శాస్త్రీయ సోషలిజాన్ని వెన్నుపోటు పొడిచాడు. తనవాదాన్ని బలపరచుకోవడానికి, సామ్యవాదపాత్రలను అతడు ఇష్టంవచ్చినట్లు వికారంగా మలిచాడు. రాఘవ దీనికి జవాబుగా తన నవలను సామ్యవాద దృష్టితో రాశాడు. డా॥ గణేశన్ ఈ విషయాన్నే అంగీకరించాడు.

"టేడే – మేఢే" రాస్తే నవలలో రచయిత [భగవతీ చరణ్ వర్మ] తన భావాలనుండి పాత్రలను దూరంగానే ఉంచాడు. వాటిపై నూతన అభిప్రాయాలను ఎక్కడా రుద్దలేదు. దీనికి భిన్నంగా రాఘవ తన నవల [సీదా సాదారాస్తా] ద్వారా చూపిన చక్కని మామూలుతోవ; రచయిత [రాఘవ] భావాలకు దూరంగా లేదు. ఏదో ఒక మార్గాన్ని సమర్థించడానికి రచయిత రాజకీయ ఆలోచనావిధానాన్ని స్వీకరించాల్సివస్తుంది. దాని పరిణామంగా అతడు రచనా సందర్భంలో నిరపేక్షగా ఉండలేడు. రాఘవ జాతి గతం అయిన ఆదర్శాలను [ద్రావిడభావాలు] ముందుకు తేగలిగాడు. కళాప్రమాణాలతో చూస్తే అతడి రచనాసంవిధాన దృశ్యాలు యథార్థంగానే ఉన్నాయి. కాని ఆ దృక్పథాల్లో అతడి వ్యక్తిగత భావాల ప్రభావం తప్పకుండా కనిపిస్తుంది."

['హిందీ ఉపన్యాస్ సాహిత్యకా అధ్యయన్'; పేజీ – 342]

రచయిత దృక్పథంలో వ్యక్తిగత ఆలోచనల ఆరోపణకు ప్రత్యేకించి కారణమంటూ ఏదీలేదు. ప్రతీరచయితా రచనల్లో తప్పనిసరిగా తన [రాజకీయ] ఆలోచనలను ప్రకటిస్తాడు. అతడు ఏ నిష్పత్తిలోనైతే తన భావాలను ఆవిధంగా రచనలో వ్యక్తం చేయగలుగుతాడో ఆ మేరకే అతడి రచన శక్తివంతంగా ఉంటుంది. ప్రత్యర్థి ఆలోచనాధోరణికి భిన్నంగా రాఘవ ఏనాడూ మూర్ఖంగా, ద్వేషంతో రచనలు చేయలేదు. తన వాదాన్ని సరిగా చూపడానికి రాఘవ ఎప్పుడూ ప్రత్యర్థుల రచనలను తప్పుగా ఉటంకించలేదు.

'హుజూర్'లో రచయిత తన రచనాశిల్పానికి వస్తువును కట్టివేయడం చేత పరిమితులు ఏర్పడి, అది బలహీనమైన రచనగా రూపొందింది. శిల్పప్రయోజనం ఆ నవలకు ఆత్మగా మారిపోయింది. నవల చివరిభాగం చేరూతూ చేరుతూ 'విదేశీకుక్క', కథనంతా చెప్పి ఆలోచనలో పడిపోతాడు.

"మానవుడు డబ్బుకోసం పిచ్చివాడయ్యాడు అతడి వ్యవస్థ మురికితో నిండిపోయింది. వాడి ధనశక్తిని బట్టే జాతుల వృద్ధి, క్షయాలు జరుగుతున్నాయి. కష్టపడి పనిచేసే శ్రామికునికి ఉత్పత్తి సాధనాలమీద పూర్తి అధికారం లభించనంతవరకు, వాడి ప్రపంచం ఇలాగే దిక్కూమొక్కూ కానక గమ్యంలేక తిరుగుతూనే ఉండగలదు".

[హుజూర్; పేజీ – 110]

ఈ ఆలోచనా విధానం మొత్తం నవలలో ఎక్కడా నిర్వహించినట్లు కనిపించదు. కాని నవలాంతంలో పై భావం అతికించినట్లు మాత్రం కనబడుతుంది. 'కల్పన', 'ప్రొఫెసర్' నవలల్లో కూడా రాఘవ ఒక రాజకీయ దృక్పథాన్ని బలపరుస్తూ ఏమాత్రం చెప్పలేదు. 'ప్రొఫెసర్', భిక్షుకవృత్తిలోనివారి సమస్యలకు సంబంధించిన నవల. ఈ నవలలో భిక్షుకునిసమస్యను లేవనెత్తాల్సినంత తీవ్రంగా లేవనెత్తలేదు. ఈ సమస్య ఎందుకు ఉత్పన్నమైనదీ వివరించలేదు. ఈ నవలను చూస్తే, ఒక సాధారణ కథను లాగి నవలగా మార్చినట్లు అనిపిస్తుంది.

ఈ విధంగా రాఘవ తన నవలల్లో అనేక సాంఘిక సమస్యలను ప్రస్తావించాడు. రాశిరీత్యా అతడు చాలా ఎక్కువగానే రాశాడు. ఏదో ఒక సమస్యను చూసి, కథను అల్లి, తదనుగుణంగా పాత్రలను సృష్టించి, నవలను హుటాహుటిన పూర్తి చేశాడు. లెక్కలేనన్ని పరిమితులు, తొందరపాట్లు కనిపించినప్పటికీ అతడు తన సాంఘికనవలల్లో మానవతాదృక్పథం, మార్క్సిస్టు జీవన దర్శనం ప్రదర్శించాడు. స్వతంత్ర భారత అరాజక పరిస్థితిని వ్యంగ్యంగా ఆక్రోశంతో రాస్తూ, అర్థంలేని ఛాందసాన్ని పూర్వపక్షం చేశాడు కూడా.

గ్రామీణ జీవితాన్ని చిత్రించిన 'పథ్ కాపాప్' [దారిలో పాపం], 'ఆఖిరి ఆవాజ్' [చివరి కేక] నవలలు చాలా ప్రసిద్ధాలు. స్వాతంత్ర్యం తర్వాత వేగంగా మారుతూన్న గ్రామీణ పరిస్థితులను రాఘవ ఇందులో చిత్రించాడు. స్వాతంత్ర్యం తర్వాత సమస్యల స్వరూపస్వభావాలు మారాయి. 'పథ్‌కాపాప్' నవలలో ఒకడు అన్నిరకాల పాపాలు, సాంఘిక నేరాలు చేస్తూ కూడా సఫలీకృతుడై, అందరికన్నా ఎక్కువ సుఖమయ జీవితాన్ని సంపాదించగలుగుతాడు. ఈ నవలలోని రైతు ఏమీ తెలియని అమాయకుడుకాదు. మోసంచేయడంలో ఆరితేరిన దిట్ట. వాడు చివరిదాకా తన నిజస్వరూపాన్ని బయటపడకుండా దాచివుంచగలగడం విశేషం.

"ఆఖిరీ ఆవాజ్" నవలలో గ్రామీణ జీవితంలో కనిపించే నైతిక పతనాన్ని, పంచాయతీవ్యవస్థ నిష్ప్రయోజకత్వాన్ని రాఘవ చివరలో చర్చించాడు. ఈ నవలలో రచయిత అంతఃకరణ విజయాన్ని చూపిస్తాడు. అన్నిరకాల తప్పిదాలున్నప్పటికీ, వీటిమధ్య ఏదో ఒకటి మహత్తరంగా ఉందని, అదే మనిషిని చీకట్లోంచి వెలుగువైపు తీసుకెళ్తుందని రాఘవ ఈ నవలలో తెలియజేశాడు.

గ్రామీణ జీవితాలను చిత్రించే నవలలో రాఘవ ఎక్కువగా నైతిక పతనాన్ని, దుర్బలమైన అమానవీయపరిస్థితులను ముందుకు తెస్తూ చర్చించడంవల్ల అవి అతడి రచనలోని బలహీనతలుగా నిలిచిపోయాయి. దీని ఫలితంగానే రచయిత గ్రామీణ జీవితంలోని ఒకే వైపును, అపరిపూర్ణ

జీవితాన్ని మాత్రమే చిత్రించాడు. జీవితంలోని అవాసక్తవిషయాన్ని చిత్రించాక గ్రామాల్లో అనేకరకాలుగా విస్తరించివున్న పతితసమాజాన్నే అతడు విపులంగా చర్చించాడు. జమీందారీ విధానం రద్దయింది. రైతులపైన సాగుతూన్న శ్రమదోపిడీ తనరూపం మార్చుకుంది కాని అది అంతంకాలేదు. స్వాతంత్ర్యం తర్వాత, నాయకులవర్గం ఒకటి బయలుదేరి, అది సాలెగూడులా గ్రామాలదాకా అల్లుకుంటూపోయింది. 'ఆఖరీ ఆవాజ్' నవలలో రాఘువ ఈ కొత్త నాయకుల [దళారీ] వర్గస్వరూపస్వభావాలను బాగా చిత్రించాడు. ఈ నవల అభివృద్ధి నిరోధకశక్తులను బహిర్గతంచేసే పనిలోనే తలమునకలైంది. ఈ అభివృద్ధి నిరోధక శక్తులను ఎదుర్కోవలసిన అభ్యుదయశక్తుల ఆవిర్భావ ప్రస్తావనే ఈ నవలలో కనిపించదు. సామ్యవాద ఆకాంక్షను, సామాజిక వికృతరూపాలను రచయిత ఎక్కువగా వివరించాడు.

"పథ్ కా పాప్" లోని శైలి, కథాకథనం వ్యంగ్యంగా ఉన్నాయి. అన్ని రకాలుగా నైతికపతనం పొందినావాడు, వ్యభిచారస్వభావం కలవాడు, విలువలను పాటించనివాడు జీవితంలోను, సమాజంలోను సఫలీకృతుడవుతాడు. అలా కావడమే గొప్పతనంగా భావించబడుతుంది. సమాజంలో భ్రష్టమానవుడు ఆదర్శజీవిగా గుర్తింపుపొందుతాడు. ఇలా వ్యంగ్యాన్ని ఉన్నతస్థాయిదాకా తీసుకెళ్ళాడు రాఘువ. అయినా కళాప్రమాణాల మేరకు ఆ నవల అంతగా విజయవంతమైన నవలకాదు. అసహజమైన సన్నివేశాలు ఈ నవలలో బాగానే చోటుచేసుకున్నాయి. తత్ఫలితంగా ఈ నవలలో ప్రయోజనాత్మకమైన జీవనదృక్పథం మృగ్యమయింది.

రాఘువ సృజనాత్మక శక్తి చారిత్రక నవలల్లో సర్వశ్రేష్ఠంగా కనబడుతుంది. అతడు చింతనాశీలుడైన రచయిత. భారత చరిత్ర సంస్కృతుల్లో తన అభ్యుదయ విశ్వాసాల ప్రమాణాలను, జీవన తాత్వికవికాసాన్ని చూపి, పరీక్షించ ప్రయత్నించాడు. ప్రాచీన భారతీయ 'సంత్ పరంపర' కనబరచిన మానవతాదృష్టి అతడిని ఆధ్యాత్మికంగా ఎక్కువగా ప్రభావితంచేసింది. శాంతిని, లోకకల్యాణాన్ని ఆకాంక్షించే మహోన్నతాదర్శాల ప్రతీకగా బౌద్ధమతం, అతడికి మిగతామతాలకన్నా ఉత్కృష్టంగా కనిపించింది.

ఈ కారణంగానే అతడి చింతనాధార స్పష్టంగా చారిత్రక నేపథ్యంలో ఎంతగానో వికసించింది. భారత చరిత్రలోనే ఎన్నో ముఖ్యమైన ఆదర్శాలను అతడు గాథల్లోను, నవలల్లోను చక్కగా చిత్రించాడు. చారిత్రక నవలలను అనివార్యంగా రాయాల్సివచ్చిన విషయాన్ని, రాఘవ చెప్పిన మాటలు ఇక్కడ పరిశీలించక తప్పదు.

"–ఘరౌందా" నవలారచన తర్వాత నా ముందుకు రెండు విషయాలు వచ్చాయి. ఒకవైపు సమకాలీన జీవన సత్యాలునన్ను వర్తమానంలోకి వచ్చేట్లు ఆకర్షిస్తే, మరోవైపు భారతీయ ఆత్మ అయిన భాషా సంస్కృతుల గమనం నన్ను ఆకట్టుకుంది. గతంలో విభిన్నయుగాలలో పోరాడిన మానవుడిని గుర్తించడానికి ప్రయత్నించాను."

['సాహిత్య సందేశ్, ఆధునిక్ ఉపన్యాస్ అంక్, ఉపన్యాస్ కైసే లిఖేగయే; పేజీ 87]

భగవతీ చరణ్ వర్మ ఉపాధ్యాయ్‌రాసిన 'గర్జన్', 'సవేర', 'సంఘర్ష్', రాహుల్‌జీ సాంకృత్యాయన్ రాసిన 'ఓల్గాసేగంగా'లాంటి చారిత్రిక నేపథ్య నవలారచనలలాగా, రాఘవ 'మహాయాత్రా' రచనకు పూనుకున్నాడు. ఇందుకు కారణం అతడికి చరిత్ర పరిశీలనపట్ల ఉండే ఆసక్తి, మానవ వికాసపోరాటంలో మానవుడు సాధించిన మహత్తరవిజయాల పట్ల అతడికి కలిగిన విశ్వాసం, తనకన్నా ముందటి రచయితలు నియమించుకున్న ప్రకృతి పరిమితులనుండి తప్పుకుంటూ, వివిధ చారిత్రక సామాజిక దశల్లోని మానవుడి వికాసాన్ని గాథల రూపంలో వెలువరించాలని, నాలుగు భాగాల్లో ఆ గ్రంథాన్ని తేవాలని అనుకున్నాడు. ఈ బృహత్ రచనా ప్రస్థానంలో అతడు రెండు భాగాలు మాత్రమే రచించి, జీవనమహాయాత్రను చాలించాడు. 'మహాయాత్ర' రెండుభాగాల్లో ప్రాగైతిహాసికకాలంనుండి, పృథ్వీరాజ్ చౌహాన్ దాకా మానవ వికాసాన్ని క్రమబద్ధంగా గాథలరూపంలో మహోత్కృష్టంగా రచించాడు.

'మహాయాత్ర'గాక ముర్దోంకాటీలా, చీవర్, పక్షి ఔర్ ఆకాశ్, రావ్‌నరుకీ, అంధేరేకే జుగ్నూలాంటి చారిత్రక నవలలను కూడా రాఘవ

రాశాడు. ఈ చారిత్రక నవలా రచనల ద్వారా రాఘవ తన సృజనాత్మక మైన కల్పనాశక్తిని ప్రదర్శిస్తూ, గతంలోని సుదూర మానవుని, ఆకర్షణీయ మైన విభిన్నరూపాల్లో నమ్మకంగా చిత్రించాడు. ఈ చారిత్రిక నవలల్లో మానవుని వివిధ చారిత్రక, సామాజిక దశల్లోని సార్వకాలిక సత్యాలను, సమస్యలను రాఘవ చిత్రించాడు.

'మొహంజోదారో' లోని మహోన్నత నాగరికతా పతనాన్ని, సంస్కృతీవినాశాన్ని 'ముర్దోంకాటీలా' [శవాలగడ్డ] నవలలో రాఘవ మహత్తరగాథగా చిత్రించాడు. ద్రావిడనాగరికతాగాథను అతడు నిర్వికారంగానే స్వపరభేదాలకతీతంగా రాశాడు. బానిసవిధానాన్ని, గణతంత్రవ్యవస్థను, దాని సమస్యలను సందర్భాను సారంగా చిత్రించాడు. ఈ నవల పీఠికలో అతడు చరిత్రకు సంబంధించిన 'శాస్త్రీయదృక్పథం', 'తటస్థవిధానం'', 'నిష్పక్షపాత' దృష్టిగురించి వివరించాడు.

''కాలనియమానుసారం అన్నింటిని వర్ణించాలనే దృక్పథానికి నేను ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చాను. ఇక్కడ బానిస బానిసలాగే మాట్లాడినట్లు కనబడతాడు [అనగా తిరుగుబాటు కనిపించదు]. బానిసపరిస్థితి ప్రకటింపబడింది. ఆ కాలపు తాత్వికుల్లాగా, విద్యావంతునిగా ఆ బానిస చర్చించజాలడు. వాడికి శాస్త్రీయ భౌతికవాదంగాని, గతితార్కిక చారిత్రక భౌతికవాదంకాని ఏమాత్రం తెలియవు. చరిత్రను చరిత్రగానే చిత్రించి, దాని సఫలీకృత విశేషాంశాలను రేఖామాత్రంగా చూపడం మంచిది. అందుకు భిన్నంగా తనని పాత్రగా ప్రదర్శించి, చారిత్రక క్రమాన్ని తప్పుగా చిత్రించడం రచయితకు భావ్యంకాదు....''

['ముర్దోంకాటీలా', 'భూమిక', పేజీ 5]

రాఘవ వెలిబుచ్చిన ఈ చారిత్రకదృక్పథాన్ని పురస్కరించుకొని జగదీశ్ గుప్త చేసిన వ్యాఖ్య గమనార్హం

''రాఘవ కనబరచిన చారిత్రక దృక్పథం ఎంతో సంయమనంతో కూడుకొనివుంది. మొహంజోదారో నాగరికతపట్ల తటస్థంగా ఉండాలనే

అతడి సంకల్పం మిక్కిలి ప్రశంసనీయం. ఈ సంస్కృతిలోని బానిస బానిసగానే మాట్లాడుతాడు. ఈ సంస్కృతికి సంబంధించిన తుదినిర్ణయం చేయడానికి ఎవరివద్దా తగిన సాధనాలు సాక్ష్యాలు లేవు. ఆ నాటి 'లిపి'ని చదవడం నేడుకూడా సాధ్యపడలేదు. ఆధునిక జీవనతత్వం, తర్కం, శైలి, ఆలోచన విధానం మున్నగువాటిని రుద్దకుండానే నాటి జీవిత చిత్రణ చేయడం ఎంతో ప్రశంసనీయం. ఆదిమసమాజంలోని సంస్కారం అందులో లక్ష్యంగా ఉంది. ఆధునిక జీవిత సమస్యలను రచయిత ఎక్కడా ఇందులో మిళితం చేయడానికి తన కళానైపుణ్యాన్ని ప్రదర్శించలేదు".

['ఇతిహాస్ ఔర్ ఐతిహాసిక్ ఉపన్యాస్‌కార్' : ఆలోచనా; 13, పేజీ 182]

ఆధునిక జీవన సమస్యలు రాఘవ చారిత్రక నవలల్లో గోచరించనిమాట నిజమే. కాని కన్హైయ్యాలాల్, మాణిక్‌లాల్ మున్షీ, ఇంకా ఇతర పురావైభవ ప్రాభవాలను ప్రేమించే తిరోగమన రచయితలలాగా గతాన్ని చాలాగొప్పగా చిత్రించడం కూడా అతనికి ఇష్టంకాదు. చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో చూసే ఇతర రచయితలలాగా, అతడూ గతాన్ని విశ్లేషణతో చూసాకే, విశ్వాసాలను రూపొందిస్తాడు. శుష్కమైన చారిత్రక సంఘటనలను ప్రోదిచేయడం కూడా అతడి నవలల్లో కనిపించదు. రాఘవ భావాలు, దృక్పథం, చింతనాధోరణి, అతడు సృష్టించిన పాత్రల్లో వ్యక్తమయ్యాయి, అవాలికూడా–అయినా ఆపాత్రలు తమ యుగంలో పరిమితమై, చెరగని క్రమశిక్షణతో వాటి హద్దుల్లోనే ప్రవర్తిస్తాయి. వ్యక్తుల మీదకన్నా అధికంగా అతడి దృష్టి ఆ యుగంమీద ఉంటుంది. అందులోంచే వ్యక్తి పుట్టుకొస్తాడు!

"బహూశా నేనుగా చారిత్రకరచనల్లో 'యుగాన్నే'చూశాను. 'యుగం ద్వారా' మాత్రమే 'వ్యక్తి'ని చూసే ప్రయత్నం చేశాను. ఆ వ్యక్తి నిరంతరం సత్యాన్వేషణలోనే మునిగివున్నాడని నేను చెప్పగలను".

[రావ్‌నరుకీ –పీఠిక – పేజీ 4]

స్త్రీల సామాజిక పరిస్థితి, దానిమారుతూన్న రూపం, వ్యక్తికీ సమాజానికీ ఉండే పరస్పర సంబంధం, 'యుద్ధము – శాంతికి' సంబంధించిన సమస్యలు, చిరంతన శాశ్వత ప్రశ్నలమీదే రాఘవ చారిత్రకదృక్పథం కేంద్రీకరింపబడివుండేది. గతకాలపు వ్యాప్తసంఘటనలమీదే ఈ అంశాలను పరీక్షచేసేవాడు. 'మానవజాతి కల్యాణం' కేంద్రంగా అతడు దానిచుట్టూ తిరుగుతూవుండేవాడు.

'దివ్యా' నవలలో యశపాల్ రాసినట్లుగా నికృష్ట బౌద్ధమత రూపాన్ని రాఘవ తన 'చీవర్' [చింపులు] నవలలో చిత్రించలేదు. మానవజాతి కల్యాణ ప్రతీకగానే అతడు బౌద్ధమతాన్ని స్వీకరించాడు. దాని వికృత రూపాన్ని బౌద్ధంగా భావించలేదు. ఈ కారణంగానే తపోనిష్ఠ, సంయమనాల ఔన్నత్యం, గృహస్థ సాంసారిక జీవన సామంజస్యం, అతడికి ఆభరణాలుగా ఉండేవి. 'రాజశ్రీ' పాత్రద్వారా రాఘవ ఈ ఆదర్శాలనే ప్రతిబింబించాడు. 'చీవర్' నవల 1958లో వెలువడింది. మూడవ ప్రపంచయుద్ధభయం ఆవహించివున్న రోజులవి. కొంచెంముందుగా యశపాల్ రాసిన 'అమితా', ధర్మవీర్ భారతీ రాసిన 'అంధాయుగ్' [పద్యనాటకం] వెలువడ్డాయి. వీటి అభివ్యక్తిలో భేదం ఉన్నప్పటికీ, గతాన్ని ఆధారం చేసుకొని ఈ రచనలు [అంధాయుగ్, చీవర్] యుద్ధనిషేధాన్ని కోరుతాయి. 'చీవర్' నవలలో రాజశ్రీ మాటలు.

"హర్షవర్ధనుడు, పులకేశుల యుద్ధమయితే, వీరు పరస్పరం ద్వంద్వయుద్ధం ఎందుకు చేసుకోరు? అనవసరంగా అసంఖ్యాక పౌరుల వినాశనాన్ని వీరెందుకు కోరుతున్నారు"?

దీనికి జవాబుగా సేనాపతి స్కంధగుప్తుడంటాడు.

"దేవీ! ఇది రాజనీతి, బలాబలాలకు సంబంధించిన విషయం, సామ్రాజ్యాలగౌరవాలకు సంబంధించిన ప్రశ్న! పుష్యభూతి వంశగౌరవానికి సంబంధించిన సమస్య!"

రాజశ్రీ నవ్వి అంటూంది ? "కాదు సేనాపతీ! ఇదంతా అలా కాదు.

ఇది ఒక భ్రాంతి. పురుముని దౌష్ట్యం! దోపిడి! ఉత్పాతం!"

['చీవర్'; పేజీ 249]

జైన, బౌద్ధాల పలాయన వాదరూపాలు రాఘవకు గ్రాహ్యావిషయాలు కావు. కారణం అవి అనారోగ్యకరమైనవి, అసాంఘికమైనవి. ప్రజా సంక్షేమం, ఆరోగ్యకరమైన సామాజిక దృష్టికోణాల సామంజస్యం మాత్రమే రాఘవకు అభీష్టం. అతడి అన్ని నవలల మూలాధారంకూడా ఈ సత్యంలోనే ఇమిడివుంది.

– దధివాహనుడన్న మాటలు

"లోకంలో 'సంయమ'నమనే పదానికి 'పలాయన' మనే అర్థం సన్యాసులవల్ల దాపురించింది. 'పారిపోండి – అన్నీ విడిచి పారిపోండి' అని తాపసులు తేల్చారు. నేను పరుగెత్తను. లోలోన దహించుకుపోవడం, మురిగిపోవడం అని కాదు సంయమనమంటే ఆరోగ్యప్రవాహం అది. తన స్వార్థం గురించి ఆలోచించడంపశుత్వావారసత్వం. అందులోంచి బంరుటపడాల్సిన అవసరాన్ని గుర్తించి కూడా మనవ్యుడు లేవలేకపోతున్నాడు".

['రాహన రుకీ' – పేజీ – 140]

ఈ ఆరోగ్యప్రదమైన శుభదృష్టి రాఘవ చారిత్రక నవలా రచనకు ఆధారభూతమై, మౌలికతను, ప్రత్యేకతను అతడికి సంతరించి పెట్టింది. ఈ కారణంగానే అతడు విల్లిభిత్మూర్, హర్ష్, రాజశ్రీలాంటి ఉదాత్తపాత్రలను సృష్టించగలిగాడు. చారిత్రక వాతావరణ సన్నివేశంనుండి అతడి దృష్టి మళ్ళదు. అనవసరంగా జొప్పింపబడే నేటి విషయాలు, వాటి సాఫల్యాన్నే సందిగ్ధంలో పడవేస్తాయి.

రాఘవ చారిత్రక నవలలకు కాస్త భిన్నమైన రూపమే అతడి జీవితచరిత్రలకు సంబంధించిన నవలల్లో కనిపిస్తుంది. చారిత్రక నవలల్లో పాత్రలు, సంఘటనలు చరిత్రమీద ఒత్తిడి తెస్తాయి. ఆయా యుగాల మహాపురుషుడు, లోకనాయకుడు, కవి – ఈ జీవిత చరిత్రలనవలల్లో

ప్రధానంగా తీసుకోబడ్డారు. ఆయా విశిష్టవ్యక్తులద్వారా ఆయుగస్వరూప స్వభావాలను స్పష్టం చేయడానికి రాఘవ ప్రయత్నించాడు.

"దేవకీ కా బేటా" [దేవకీ కుమారుడు] నుండి "భారతీ కా సుపుత్ర్" [భారతీ సుపుత్రుడు] దాకా రాఘవ తొమ్మిది జీవిత చరిత్రాత్మక మైన నవలలను రాశాడు.

విస్తృత విషయాలు, సాంప్రదాయం, వదంతులు మున్నగు మేఘావృత పరిస్థితుల్లో తప్పిపోవడం సాహితీవేత్తల దురదృష్టం. ఈ నవలలద్వారా ఆ యుగపురుషుల సాధారణ జీవన రేఖలను మాత్రమే రాఘవ చిత్రించలేదు. నాటి చారిత్రక సందర్భాలను పేర్కొని, వారు ఆ యుగంలో ఎలా ఎదిగిరాగలిగిందీ వివరించాడు. ఆ యుగాల పరిమితులను తెలియజేస్తూ, వాటిమధ్య ఆయా మహనీయులు సల్పిన పోరాటాలను, మానవతా వికాసక్రమంలో సాహిత్యం, సంస్కృతి ప్రసాదించిన ఉన్నత ప్రమాణాలను రాఘవ ప్రతిబింబించాడు.

"దేవకీ కా బేటా"లో కృష్ణుని మొదటి పదహారు సంవత్సరాలగాథ కంసవధతో పరిసమాప్తమవుతుంది. కృష్ణుని సాధారణ మానవుడిగా గుర్తించడంలో అడ్డువచ్చే అద్భుత అవతార మహత్యాలను రాఘవ ఇందులో వివరించాడు.

"ధూనీ ఔర్ ధువా", [సాంబ్రాణీపొగ] నవలలో కథానాయకుడు గోరఖ్‌నాథ్. అతడి సహజ యుగావధుల మేరకు రాఘవ అద్భుతాలనుండి పూర్తిగా బయటపడలేక పోయాడు, నిజానికి అతడు ఆ విధంగా బయటపడివుంటే బహుశా గోరఖ్‌నాథ్ యుగాన్ని అపహాస్యం చేసివు ండేవాడు. "దేవకీ కా బేటా", "యశోధరా జీత్‌గయీ" [యశోధర గెలిచింది] లాంటి నవలల్లో నాటి అద్భుతాలను, మూఢనమ్మకాలను రాఘవ తన తర్కబుద్ధితోనే వివేచించి రాశాడు.

"కృష్ణ చరిత్రను అద్భుతాలకు దూరంగా ఉంచి చూశాను. మతమౌఢ్యం కలవారు దీనిని బహుశా సహించలేరేమో! వారిని

క్షమించవమని కోరుతాను. మానవరూపంలో ప్రకటింపబడే కృష్ణుని మహాత్మ్యాలు చరిత్రలో ఎక్కడా కనిపించవు. అద్భుతాలమధ్య సత్యం మునిగిపోతుంది".

['దేవకీ కా బేటా భూమిక'; పేజీ 6]

'లోయాకాతానా' [భార్య ఎత్తిపోడుపు], 'రత్నాకీ బాత్' [రత్నామాట], 'లఖ్మాకీ ఆంఖే' [లఖ్మా కళ్ళు] – ఈ మూడు నవలలు వరసగా కబీర్, తులసీదాస్, విద్యాపతి జీవిత చరిత్రలు. "మేరీ భవబాధా హరో" [నాభవభాధలు తొలగించు] అనే రచన బిహారీ కవి సమగ్రయుగాన్ని ప్రతిబింబిస్తుంది. ఈ నవలలన్నింటిలోనూ కథానాయకుడి వ్యక్తిత్వం ప్రముఖంగా కనిపిస్తుంది. రచయిత రచనాకౌశలంవల్ల నాటి యుగసంపూర్ణతలో దానికి సమాంతరంగా వ్యక్తిత్వవికాసం కనిపిస్తుంది.

కబీర్ తన యుగంలోని ప్రజలసత్యాన్ని గ్రహించాడు. తులసీదాసు తన సర్వశక్తిసామర్థ్యాలతో ఆ సత్యాన్ని వ్యతిరేకించాడు.

కృష్ణుడు అన్యాయాలను, అత్యాచారాలను నిర్మూలించే క్రమంలో ఉదయిస్తున్న సూర్యుడిలా గాఢాంధకారాన్ని జయిస్తూ ముందుకు సాగిపోతాడు. అన్యాయాలను, అక్రమాలను వ్యతిరేకించడం తమ ధర్మంగా భావించే కొత్తతరంప్రతినిధిగా కృష్ణుడు కనిపిస్తాడు. కంసునితో అతనికి ఉన్నవైరం వ్యక్తిగతంకాదు.

రచయిత సత్యాన్ని పూర్తిగా బయటికి తెచ్చే ప్రయత్నం చేశాడు. పోరాటాల సాంఘిక సైద్ధాంతిక అంశాలమీదే ఎక్కువ బలం చూపాడు. కంసుడు ఒక నిరంకుశరాచరికానికి, రాజ్యాధికారానికి ప్రతీకగా ఉంటాడు. కృష్ణుడు ఉనికిలోకి వస్తున్న జనశక్తిప్రతినిధిగా నిలుస్తాడు. లక్ష్యరహితమైన గతం, సింహావలోకనమే కృష్ణచరిత్రకాదు. భవిష్యత్ వర్తమానాలకోసం కూడా అందులో పోరాటసందేశం నిహితమై ఉంది.

"యశోధర" తన పరిమితుల్లో బంధింపబడివున్నప్పటికీ, ఆధునిక స్త్రీకి కావలసిన స్వాభిమానం, హక్కుల వాణిని అందిస్తుంది.

"అతడు భర్త, అతడి దయను కానునేను. సరిసమానమైన హక్కులు నాకు కావాలి."

['యశోధరా జీతగయీ'; పేజీ 105]

పలాయనం ఆమె దృష్టిలో అధర్మం. ఆరోగ్య ప్రదమైన కౌటుంబిక సంసార జీవితాన్ని ఆమెకూడా లక్ష్యంగా ప్రకటిస్తుంది. పురుషుడి అహంభావంమీద వ్యంగ్యాన్ని బిగించి యశోధర అంటుంది.

"పరుషుడు స్త్రీని అనుభవించి, తనను తాను భోక్తగా భావించుకుంటాడు. వాడు మూర్ఖుడు! స్త్రీకూడా సంభోగంలో సమానభోక్త. వారు ఒకరికొకరు పూరించుకునేవారు. జన్మదుఃఖం కారణం తెలుసుకోలేకపోయినంత మాత్రాన, రాజ్యాధికారాన్ని 'దుఃఖం' అని అన్నంతమాత్రాన అది దర్శన [తత్వం] మై పోతుందా?"

['యశోధరా జీత్‌గయీ', పేజీ 123]

అన్ని నవలల్లో కూడా రాఘవ మూలస్వరం లోకకల్యాణాన్ని కోరడం ప్రధానంగా ఉంటుంది. కృష్ణుడనేమాట దృష్టినాకర్షిస్తుంది.

"నాకు కులంకన్నా, వంశంకన్నా జనంగొప్ప, అన్యాయాలు, అత్యాచారాలు విధ్వంసమై ప్రపంచంలో సుఖశాంతులు ప్రవేశించడానికే నేను జీవించివుండాలనుకుంటాను".

['దేవకీ కా బేటా"; పేజీ 138]

తాను రాస్తున్న జీవిత చరిత్రాత్మక నవలల్లో వ్యక్తిమీద మాత్రమే దృష్టి కేంద్రీకరింపబడివున్నప్పటికీ, రాఘవ ఆ కాలపు మత, సాంఘిక, చారిత్రక, రాజకీయ పరిస్థితులమీదే ఆలోచనలను ప్రవహింపజేస్తాడు. రాఘవ ఈ రచనాక్రమంలో అద్భుతాల మహాత్యాల మాయాజాలంనుండి తనను తాను కాపాడుకొన్నప్పటికీ, 'యోగశక్తి' పట్ల అతడికి ప్రగాఢమైన విశ్వాసం ఉన్నట్లు కనిపిస్తుంది. తన సామ్యవాదదృక్పథం చూపే ఆధునిక రూపాన్ని అతడీ విధంగా స్పష్టంచేశాడు!

"ప్రపంచానికి వెలుగుచూపే ఉజ్వలజ్యోతి తప్పకుండా భవిష్యత్తులో భారతదేశంలో పుట్టుకొస్తుంది. రష్యా, చైనా అనుభవాలను మించిన, భారతసాంప్రదాయంలోని మానవతను అది గ్రహించగలదు. అంతేగాక యోగవిద్యలో నిహితమైన మానవజాతి అపారశక్తిని, నూతనసమాజాన్ని, సరిక్రొత్తప్రపంచాన్ని, నవీన మానవుణ్ణి, సామాజిక వికాసంతోబాటు భారతదేశం, లోకానికి ఈయగలదు. సామాజిక వికాసంతోబాటు వ్యక్తి అంతరించిపోడు. దానికి భిన్నంగా అతడు వికసిస్తాడు."

['ధునీ ఔర్ ధువా' భూమిక; పేజీ 5]

రాఘవ తాను అనుకున్నట్లుగా కథానాయకులను రూపొందించే సందర్భంలో ఇతరుల అభిప్రాయాలను కూడా అతడు వ్యతిరేకించక తప్పలేదు. అతడు తన విశ్వాసంతో పాటు మౌలికమైన తన అభిమతాన్ని ముందుకుతెచ్చాడు. కబీరుకు సంబంధించిన అతడి ప్రమాణాలను ఈ సందర్భంగా పేర్కొనవచ్చు. అద్భుతాలు అవతారమహాత్యాలనుండి ప్రజాశక్తుల ఆవాహనదాకా కబీరువికాసం వ్యక్తంఅయింది. కబీరుపట్ల సాహిత్య చరిత్ర రచయితలు న్యాయంచేయలేక పోయారు. ఈ విషయాన్నే ఇతరులతో విభేదిస్తూ రాఘవ కబీరుపట్ల తనకు గలభావాలను స్పష్టం చేశాడు.

"కబీరును అందరూతప్పుగా అర్ధం చేసుకొన్నారు. కబీరు భావజాలంగా వెలువడిన అంశాలు సూఫీమతం, వేదాంతం, మార్మికవాదం, స్త్రీనింద, ప్రపంచాన్ని సారరహితంగా భావించడం, మాయవాదం మున్నగు విశేషాలు. నిజానికి కబీరు వికాసం చెందుతూపోయిన వివిధదశల గమ్యాలు మాత్రమే అవి – అతడు మెల్లమెల్లగా వీటన్నింటినీ దాటి మరీముందుకు వెళ్ళిపోయాడు. ఆచార్య రామచంద్ర శుక్ల బ్రాహ్మణవాద విమర్శకుడు. అందువల్ల అతడు కబీరును నిర్గుణ మార్గీయునిగా ముద్రవేశాడు. కబీరు ఏ మార్గం కూడా చూపలేకపోయాడనే అతడు ఆరోపించాడు. కబీరు జ్ఞాన రహస్యంలో మునిగిపోయేవాడు. మామూలు ప్రజానీకం కబీరును అర్థంచేసుకోలేక పోయింది. ఇదంతా బ్రాహ్మణవాద దృష్టి కోణం అందువల్ల ఈ దృక్పథం అశాస్త్రీయమూ త్యాజ్యమూ కూడా".

['లోయూకా తానా' భూమిక – 5; పేజీ 5]

ఈ దృష్టితో చూస్తే రాఘవ రాసిన 'జీవిత చరిత్రాత్మక' నవలల్లో ప్రాముఖ్యత చాలా పెరిగిపోతుంది. అతడు సృష్టించిన సమస్య యుగ పురుషుల చిత్రణద్వారా భారతీయ మునిపుంగవుల [సంత్‌లు] మానవతావాదస్వరూపం వెలుగులోకి వస్తుంది. ఆయా 'లోకనాయకుల' చిత్రణలో ఆ యుగాల చారిత్రక, మత, సాంఘిక, రాజకీయ పరిస్థితులు, గతంలో బతికిన ప్రమాదంనుండి రచయితను తప్పించడానికి ఈ వాస్తవ చిత్రణ దోహదపడింది. దీనివల్ల ముఖ్యంగా శుష్కమైన సంఘటనలతోను, పనికిరాని లెక్కలతోను నిండిపోయే ధోరణినుండి కూడా రాఘవ రచనాసంవిధానం బయటపడి, సాహిత్య శిల్పానికి మౌలికమైన అందాన్ని సింగారించిపెట్టింది.

ఫణీశ్వర్‌నాథ్ రేణు ప్రవేశపెట్టిన ఒక నిర్దుష్ట వాతావరణానికి సంబంధించిన 'ఆంచలిక్ నవలాధోరణి', 'మైలా ఆంచల్' లాంటి మిగతా నవలలపట్ల ఆసక్తి పెరిగింది. ఈ విధమైన నవలలవల్ల రచయితల పేరుప్రఖ్యాతులు త్వరగానే వ్యాపించడంవల్ల రచయితలందరూ భిన్న మైన భావాలు కలిగివున్నప్పటికీ ఇలాంటిరచనలవైపే ఆకర్షితులయ్యారు. రాఘవ రాసిన 'కబ్ తక్ పుకారూ' అనే రచనను 'ఆంచలిక్' నవలగా జమకట్టారు, విమర్శకులు. పరిశీలించి చూస్తే ఫణీశ్వర్‌నాథ్ ప్రదర్శించింది. రాఘవరచనలో ఒక నిర్దుష్టప్రాంతానికి సంబంధించిన ప్రత్యేకవాతావరణం లోని విశిష్ట విశేషాలుకాని, బహువిధమైన జీవనవ్యాసంగంకాని, తద్వారా మొ..్తం దేశానికి ఒక్కసారిగా ప్రాతినిధ్యం వహించే ప్రయత్నంగానీ ఏమాత్రం కనిపించవు. 'మైలా ఆంచల్' [చెడిన పైట], 'పరితి పరికథా' [కథలు–కథ] నవలల్లో ఉన్నట్లుగా ఒక ప్రత్యేక ప్రాంతనివాసులైన ప్రజల మాండలికభాషను ఆచారవ్యవహారాలను ప్రత్యేకించి చిత్రించే ధోరణి రాఘవ రచనలో కనిపించదు.

రాఘవ రచనావిశేషమైన 'కబ్‌తక్ పుకారూ' నవలలో రాజస్థానంలోని దొమ్మరివాండ్ల సర్కసుఫీట్లు చేసే సంచారజాతి జీవితానికి సంబంధించిన

చరిత్ర చిత్రణఉంది. అక్కడి స్త్రీ–పురుష సబంధాలగురించి. వాటి ఆచార వ్యవహారాలగురించి, లైంగిక నీతి గురించి ఈ నవలలో ఎక్కువగా చర్చించబడింది. అతడు వివరించిన ప్రజలస్థితిని మామూలు జీవనపద్ధతులు పడికట్లు మున్నగునవి ఆంచలిక్ [ప్రాంతీయ విశేషాల] రచనా పద్ధతికి అనుకూలంగా ఉన్నట్లు కనిపిస్తాయి. కథాక్షేత్రం రాజస్థానంలో ఉంది కాబట్టి ఆ పరిధిలోని భాష, మాండలికం, జీవనవిశేషాలు ఈ నవలలో ఉన్నాయి. [ఇది టీవీలో సిరియల్‌గా వచ్చింది. 1990లో].

అదే విధంగా 'ధర్తీ మేరా ఘర్' [భూమే నా ఇల్లు] అనే నవలకూడా రాజస్థాన్ జీవిత విశేషంగా "లోహ పీటుల" సామాజిక స్థితి వారి దైన్యం వగైరా జీవనవిషాదాలకు అద్దంపట్టింది. "లోహపీటులు" కమ్మరిపని చేస్తూ ఊళ్ళు తిరిగేవారు. సంచారజీవులు. ఈ సందర్భంలో రచయిత పరిశీలనా దృష్టి పారదర్శకంగా పనిచేసింది. కేవలం నలుగురి దృష్టినాకర్షించడానికి ఈ నిర్లక్ష్యం చేయబడిన వృత్తికారులను తన రచనావస్తువుగా రాఘవ ఎన్నుకోలేదు. ఈ ప్రజల మూఢనమ్మకాలను, సామాన్య జీవన విధానాన్ని రచయిత చాలాదగ్గరగా చూసి రాశాడు. సమాజంలో ఈ ప్రజలు అనుభవించేదుస్థితిని నిర్లక్ష్యాన్ని చూసి రచయితకు తీవ్రమైన క్షోభకలిగింది. దాని ఫలితంగా అతడిలో కోపం సంస్కారచిహ్నంగా రూపొందింది. రాఘవ తరచూ తన రచనల్లో ప్రతిబింబించినట్లుగా ఈ ప్రజల దుస్థితికి అద్దంపట్టే 'ఆంచలిక్' రచనలో అన్ని కష్టనష్టాలు అనుభవిస్తూ కూడా వారు తమ జీవనఔన్నత్యాన్ని ప్రదర్శించుకోకుండానే దాచివుంచుతారు. సంస్కార విశేషంగా ఈ ప్రాంతీయ శిల్పవిశేషంగా ఉండే రాఘవ ఆంచలిక్ నవలల్లోని పాత్రలు మిక్కిలి ఆకర్షణీయంగా, ప్రభావశీలంగా ఉన్నాయి. గ్రామీణ, పట్టణ పాత్రలలాగా, ఈ ప్రాంతీయ రచనలోని పాత్రలు కృత్రిమనీతి సూత్రాలకు, తెచ్చిపెట్టుకున్న ప్రమాణాలకు కట్టుబడివుండవు. జీవితపు సంపూర్ణతలో జీవించడమే ఈ పాత్రల ప్రగాఢవాంఛగా ఉంటుంది. రచయిత మిగతాసాంఘిక నవలల్లాగా, ఈ నవలల్లో ఎలాంటి, సిద్ధాంతాలు, మతవాదాలు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని కనిపించవు వారి జీవితాన్ని వారి దృష్టితోనే చూడడం, అలాగే చిత్రించడం రాఘవ తలపెట్టిన రచనా

విశేషం. రచయిత వారి దైన్యాన్ని చూసీ చూడకుండా ఉండలేదు వారి దుస్థితిపట్ల హీనంగా ఉండే సమాజంపట్ల తన బాధను వ్యక్తం చేయకుండా కూడా రచయిత ఉండలేదు.

"ధర్తీ మేరా ఘర్" నవలలో కిషన్, అతని డైరీ, చివర అతడిచ్చిన కవితలు రచయిత దృష్టికోణాన్ని చూపెడుతుంది.

"ఇక నేను లోహపీటుని కొడుకును కాను – కమ్మరిని కాను
లేదా ఏ జమీందారు సంతానాన్ని కూడాకాను
ఇప్పుడు నేను మానవుణ్ణి....
వచ్చినప్పుడు నాకే కులంలేదు
పోయేప్పుడు కూడా కులం ఉండదు
ఆకాశాన్ని ఇలాగే విశాలంగానే ఉండనీయండి
భూమిని కూడా బంధించకండి
దీనిపై మధ్య లేపిన గోడలు – వాటిని కూలగొట్టండి
వాటిని కట్టింది మీరే –
నేడు నేను నిర్మలంగా స్వతంత్రంగా ఉన్నాను."
['ధర్తీ మేరా ఘర్' – పేజీ 170, 172]

రాఘవ నవలాసాహిత్య కృషి ఎంతో బహుముఖంగాను. విస్తృతంగాను ఉంది. రాఘవ రచనావ్యాసంగం కొనసాగిన కాలం రెండుదశాబ్దాలకు మించిలేదు. అవాంఛనీయంగా అతడి పట్లకొనసాగిన 'నిర్లక్ష్యకాలం'లోనే అతడి రచనావ్యాసంగం అవిచ్ఛిన్నంగా సాగిపోయింది. అతడిగురించి ఇష్టంలేనివారు, ఇష్టంవచ్చినట్లు వ్యాఖ్యానించినా అతడు మాత్రం తన రచనా వ్యాసంగానికి ఆటంకం రానీయలేదు.

చాలాముందుగానే రాఘవ గురించి శివదాన్ సింహ్ చౌహాన్ అన్న మాటలు గమనార్హం

"ఇప్పుడు రాఘవ వేగంగా, నిరాటంకంగా రాస్తున్నాడు. అతడి

వ్యాసంగంలో అతివ్యాప్త రచనా బాహుళ్యదోషమూ ఉంది. ప్రతిభాపాటవ స్ఫురణ కూడా ఉంది."

['హిందీ సాహిత్య' – అస్నేవర్జ్; పేజీ 192]

నిజానికి పరిశీలించి చూస్తే రాఘవలో దోషాలు అనేకంగానే ఉన్నాయి. మహదాకాంక్షతో కూడుకొనివున్న అతడి రచనా విస్తృతిని పరిశీలిస్తే, లోపాలనిష్పత్తి ఎక్కువగానే ఉండివుండాల్సింది. రచనా పరిణామాన్ని బట్టి చూస్తే అతడి రచనలు ఎక్కువగానే ఉన్నప్పటికీ, గ్రంథాలస్థాయి ఔన్నత్యాలు కూడా వాటిలో అపరిమితంగాను, మహత్తరంగాను కనిపిస్తాయి. కాని సమీక్షకులు వాటిని ఉపేక్షించారు. అతడి రచనావిస్తృతి పట్లే వారి అభ్యంతరం ఘనీభవించివుండడంవల్ల, వారు దోషాలను వెదకేందుకే దృష్టిని సారించారు. శక్తిసామర్థ్యాలను ప్రదర్శించారు. కాని అతడి బహుముఖ ప్రజ్ఞాపాటవాలు వారు చూడకుండానే ఉండిపోయారు. ఇది సాహిత్యానికి పట్టిన దుర్గతిగా భావించాలి.

నిజంగానే రాఘవ రచనాలోకంలో కనిపించేదోషాలు, వాటి పరిమితులు ఎక్కువగా రాయడంవల్ల వచ్చిన తప్పనిసరి పరిణామాలు. ఎక్కువగా అతడి సాంఘిక నవలల్లో ఈ లోపం కనిపిస్తుంది. వాటిలో రాఘవ జీవనదర్శనాన్ని, ఆలోచనావిధానాన్ని ప్రవేశపెట్టడంవల్ల అందులోంచి అతడు బయటపడకుండా ఉండిపోతాడు. 'హుజూర్' నవలలో మానవుడు దిశాహీనంగా తిరుగాడే ప్రపంచాన్ని 'విదేశీకుక్క' ద్వార ప్రవేశపెట్టిన ఆవేదన ఆ రచన అనివార్య అంశం కాలేకపోయింది. 'బౌనే ఔర్ ఘాయల్ – ఫూల్" [పొట్టివారు – గాయపడిన పూలు] అనే రచనలో సుమారు ఇలాగే జరిగింది. చివర అతడు కబీరు స్వప్నంగా చెప్పిన అంశం ఆ రచనలో అతికినట్లుగా ఉండలేకపోయింది. 'ప్రొఫెసర్'లో అతడు లేవనెత్తిన సమస్య ఎంతగంభీరంగా కనిపించిందో, అంతే అనుపాతంలో దాని నిర్వహణ కొనసాగలేదు. దానికి భిన్నంగా వూవమూలువేగ ధోరణిలో అది కొనసాగడంవల్ల మొత్తం నవల పూర్తిగా తేలికగా మారి, ప్రభావ రహితంగా

మిగిలిపోయింది.

ప్రచురణ కర్తల కోరిక మేరకు రాఘవ మామూలు కథను తీసుకొని, లాగిలాగి నవలగా మార్చే ప్రయత్నం కూడా చేశాడు. కవుల జీవిత చరిత్రలకు సంబంధించిన నవలల్లో వారి కృతులను, జీవనదర్శనాలను ప్రతిబింబించే సందర్భాల్లో అతడు మోతాదుకు మించిన సాక్ష్యప్రమాణాలతో నింపివేశాడు. వీటివల్ల కథాకథనంలో సమతూకం చెడి, రచనా సంవిధానం దెబ్బతిని నీరసం చోటు చేసుకుంటుంది. అసహజత్వం దట్టమవుతుంది.

రాజేంద్రయాదవ్ ఒకచోట అభ్యంతరం చెబుతూ రాఘవలో కథపట్ల వ్యామోహం ఎక్కువగానే ఉందని ఆరోపణ చేశాడు. కథ చెప్పే క్రమంలో లీనం కాగానే, పాత్రలవికాసాన్ని, దానితో ముడిపడివున్న కథాకథన సమతూకాన్ని అతడు పట్టించుకోడు. కథను రక్తి కట్టించే క్రమంలో అతడు అవసరానికి మించే నాటకీయతను ప్రదర్శిస్తాడు. జనరంజకత్వాన్ని కథకు ప్రాథమిక అనివార్యగుణంగా అతడు భావించివుంటాడు. అతడి మహోత్కృష్ట రచనలు కూడా ఈ దోషానికతీతంగా ఉండలేకపోయాయి.

'కబ్ తక్ పుకారూ' నవలలో కథను మనోరంజకం చేయడానికి అతడు ఎక్కువ సంఘటనలను సృష్టించాడు. దీని మూలంగా ఒక మహోత్కృష్ట రచనను చదువుతున్నామనే ఆసక్తి పోయి. కేవలం మనోరంజక కృతిలో లీనమైనట్లు భావిస్తాము. ఇది రచయిత రచనాపటిమకు భంగపాటు.

రాఘవ ఎక్కువగా రాయడంవల్ల కలిగిన దుష్పరిణామం అతడి భాషాశైలిశిల్పాలమీద పడింది. హిందీయేతర [తమిళ] భాషీయుడైనప్పటికీ, రాఘవకు హిందీ భాషమీద ఉన్న అధికారం, పట్టు హిందీ భాషీయులకేం తీసిపోదు. అంతకన్నా మిక్కుటంగా కనిపిస్తుంది. అతడి నవలల్లో భాష రెండురకాలుగా కనబడుతుంది. మౌలికంగా ఈ రెండు రూపాలు మిక్కిలి అసమంగాను, పరస్పరవిరోధంగాను ఉన్నట్లు చాలాసులభంగానే కనిపిస్తాయి.

ముర్దోంకాటీలా, విషాద్‌మఠ్, సీదాసాదారాస్తా నవలల్లో రాఘవ

రాసిన భాష ఆధికారికంగాను, ఎంతో గతిశీలంగాను, ఆకట్టునేట్లుగాను ఉంటుంది. రెండోవైపు జీవిత చరిత్రలకు సంబంధించిన 'బౌన్ ఔర్ ఘాయల్ ఫూల్' మున్నగు నవలల్లోని భాష చిన్నచిన్నవాక్యాలతో నిండివుంటుంది. అవి ఆవేశాన్ని, తొందరపాటును తెలియజేస్తాయి. ఒకవేళ ఈ రచనల్లో పెద్దపెద్దవాక్యాలు దొర్లినా, అవి వాక్యవిన్యాసందృష్ట్యా కూడా దోషపూరితంగా కనిపిస్తాయి. ఇందుకు కారణం అతడనుసరించిన వేగపద్ధతి. బహుశా ప్రచురణ కర్తల తొందరఫలితం గావచ్చు.

రాశిదృష్ట్యా రాఘవ లెక్కకు ఎక్కువగానే నవలలు రాసినప్పటికీ, శిల్పంపట్ల అతడికి వ్యామోహం ఎక్కువగానే కనిపిస్తుంది. అతడి రచనలు శిల్పదోషాలతో నిండివున్నాయి. ఇందుకు కారణం బహుశా అతడు తాను చేసిన రచనలను తిరిగి చూసుకునే వ్యవధి ప్రచురణ కర్తల తొందరవల్ల ఉండేది కాదేమో.

"ఛోటీసీ బాత్" నవలలో రచనాశిల్పంగా తెచ్చిన లేఖావళి సుదీర్ఘంగా అతిశయాలతోనిండి, అసహజంగా కనిపిస్తుంది. అయితే ఇవి ఒక ప్రయోజనంకోసం రాయబడినవే అయినా, పాఠకుని ఓపికను పరీక్షించే రీతిలో ఉంటాయి.

'హుజూర్' నవలలో కుక్కద్వారా కథ చెప్పబడింది. తగిన జాగ్రత్త వహించకపోవడంవల్ల కుక్క ఎదుటలేకుండానే కుక్కకు సంబంధించిన సంఘటనలు పేర్చబడ్డాయి.

'బౌనే ఔర్ ఘాయల్‌ఫూల్'లోని శిల్పం, దాని శీర్షిక, కృత్రిమత, నీరస సంవిధానంవల్ల మొత్తం రచనే అసబంధ్ధంగాతోస్తుంది.

అలాగే శిల్పసంబంధమైన అజాగ్రతాదోషానికి మరో ఉదాహరణ 'కబ్‌తక్ పుకారూ'. ఇందులో ముందు రచయిత కథానాయకుడైన సుఖ్‌రాం ద్వారా కథ చెప్పిస్తాడు. ప్రతిపేరాకు ముందు "సుఖ్‌రాం అన్నాడు" అని రాస్తాడు రచయిత. దీనివల్ల ఒక శిల్పసబంధమైన ఆకర్షణ ఆ రచనలో కనిపిస్తుంది. కథలో ఇంకా ముందుకు సాగి, రాస్తున్న పద్ధతిని పూర్తిగా

విస్మరించి, మొత్తం కథను 'తృతీయపురుష'లో చెప్పడం ప్రారంభిస్తాడు.

ఇలాంటి సందర్భదోషాలు, శిల్పానికి సంబంధించిన పొరపాట్లు రాఘవలో తొందరపాటువల్ల ఎక్కువగానే కనిపిస్తాయి. అతడి గుణాలను పూర్తిగా చూడకుండా వదిలేసి, దోషాలను మాత్రమే మాటలు మార్చిమార్చి పునరుక్తిచేయడం అర్థవిహీనమేగాక ఉత్తమవిమర్శకూడా కాదు.

ఒక్క క్షణం, రాఘవ ఎక్కువగా రాశాడనే లోపాన్ని పక్కకు పెట్టి ఆలోచించగలిగితే, – గుణాత్మక దోషాలను కూడా, అతడు అతితక్కువ సమయంలో హిందీసాహిత్యానికి ఇచ్చింది సమకాలీనులతో, ఆ తర్వాతివారితో సరిపోల్చి చూస్తే అద్వితీయంగానే కనిపిస్తుంది. అన్ని ఇబ్బందులు, అన్ని కష్టాలు ఇంటా బయటా ఎదుర్కొంటూ, చివరకు రోగబాధను కూడా తట్టుకుంటూ, ఎందరు వారించినా మొండిగా రచనావ్యాసంగాన్నే వృత్తిగా స్వీకరిస్తూ, అభ్యుదయభావాలతో రచనలు చేస్తూ రాఘవ అందించిన సాహిత్యం రాశిలోనేగాక వాసిలో కూడా అనితరసాధ్యం. అతడికన్నీ అసౌకర్యాలేనన్నది మరచిపోరాదు.

రాఘవ పేరు అభ్యుదయ సాహిత్యోద్యమంతోను, అభ్యుదయ సాహిత్యంతోను పెనవేసుకొనివుంది. అతడి సాహిత్యంలో కూడా రాహుల్‌జీ సాంకృత్యాయన్, యశ్‌పాల్ మాదిరి, రాజకీయాలు మిక్కుటంగానే ఎర్రబడ్డాయి. ఈ కారణంగానే అతడిమీద విమర్శకులు 'ప్రచారసాహిత్యం' అని ముద్రలు వేశారుకూడా. అభ్యుదయ సాహిత్యోద్యమ సమిష్టి దృక్పథం, ప్రజాపరమైన సిద్ధాంతాలను శాస్త్రీయ ఆలోచనావిధానాన్ని తీసుకొని ముందుకు సాగింది. క్రమంగా అవగాహనాలోపంవల్లనేమి, మధ్య తరగతి [పెటీబూర్జువా] మనస్తత్వం వల్లనేమి, వ్యక్తిగత రాగద్వేషాలు పెరిగి, రాజకీయమంకుపట్టు ప్రధానమై, సంకుచిత పరిధిలో తిరిగి అది ప్రజలకు, ఉద్యమాలకు దూరమై పోయింది.

వికాసానికి సంబంధించిన సుదీర్ఘప్రయాణాన్ని రాఘవ నిశ్చయించు కున్నాడు. అతడు మహోపాధ్యాయుడైన మార్క్సునుండి చాలా

గ్రహించాడు. రష్యా, చైనా విప్లవాలపైన, సామ్యవాద సమాజాల సమృద్ధి పైన అతడికి అపారమైన విశ్వాసం ఉండేది. ఆ ప్రేరణతోనే మానవు డివికాసంలో మహోన్నత సమాజాన్ని,సంస్కారాన్ని సామ్యవాదాన్ని దర్శించాడు.

పేదరికం, అసంతృప్తి, నైతికపతనం, అన్నిరకాల వ్యభిచారం మున్నగు రుగ్మతల కారణంగా మనిషి ఏమేరకు అల్పిష్టిగా మారిందీ రాఘవ తన నవలల్లో తర్క బద్ధంగా చిత్రించాడు. అవరోధాలను అధిగమిస్తూ, మాన వుడు వర్గపోరాటాలద్వారా ఎలా మహోన్నత సమాజాన్ని చేరుకుంటున్నదీ ప్రస్తావించాడు.

స్వతంత్ర భారతనిర్మాతలుగా పేర్కొనబడేవారిలో, మహాత్మాగాంధీ గురించి రాసేప్పుడు రాఘవ అతడి త్యాగం, నిష్ఠ, సేవాభావం గురించి గొప్పగా రాశాడు. సుగుణరాశీమూర్తిగా కూడా గాంధీని ఆమోదించాడు. రాజకీయమైన మూర్ఖత్వం రాఘవలో మచ్చుకైనా కనిపించదు.

ఒక సిద్ధాంతానికి సంబంధించిన అంశంమీద కన్నా ఎక్కువగా వ్యక్తిగత, సమిష్టిగత సత్యాలమీదే రాఘవ దృష్టి ఉండేది. మధ్యకాలాల భారతీయ 'సంత్ పరంపర' పట్ల రాఘవ ఉదారంగా, ఉదాత్తంగా ఆలోచించి వారి చింతనాధోరణిని, మానవ వికాస సంస్కృతిలో మైలురాళ్ళుగా చూపాడు. వారిని సంకుచితత్వాలనుండి పైకి లేపి చూశాడు. బహుశా ఈ పద్ధతిలో ప్రాచీన మునిపుంగవులగురించి మానవ సాంస్కృతిక వికాస పరిధిలో అభ్యుదయపరంపరగా ఎవరూ చూసివుండరు. ఇది రాఘవ సాహిత్యానికి, సంస్కృతికి ఇచ్చిన గొప్పకానుక.

రాఘవ గోర్కీ గురించి రాస్తూ "అతడు కూడా స్వతంత్రంగా చిరంతనమైన శాశ్వత సత్యాన్ని పట్టుకున్నాడు. దానితోపాటు అతడు అనంతనిర్విఘ్న వికాసశీలురైన శక్తుల స్థైర్యాల విజయఘోషణ కూడా చేస్తాడు." అని వివరించాడు.

అభ్యుదయవాదాన్ని తన విశాలదేశ చారిత్రక సాంస్కృతిక

సాంప్రదాయంలో ఖిళితం చేసి చూడడం, ఆ ఆధారంగానే పరిణామాలను పరీక్షించి వెలగట్టడం రాఘవ చింతనాధారలో మౌలికతగా భావించాల్సి వుంటుంది. బహుశా ఇది అభ్యుదయావేశాపరులకు అంగీకారయోగ్యం కాకపోవచ్చు. ఆయాదేశాల నిర్దిష్ట పరిస్థితుల సామాజిక గతి సూత్రాలను అన్వయించి చూడడమే మార్క్సిజంగా విజ్ఞులు భావిస్తారు. రాఘవ సాహితీవేత్తల్లో విజ్ఞుడు. విజ్ఞుల్లో అభ్యుదయవాది. అభ్యుదయవాదుల్లో చింతనాశీలి. చింతనాశీలుల్లో కార్యవాది. కార్యవాదుల్లో మానవతా ప్రేమికుడు. మానవతా ప్రేమికుల్లో సామ్యవాది. సామ్యవాదుల్లో స్వాతంత్ర్యగామి.

రాఘవ నవలల్లోని నవచైతన్యం, సమరశీలి అయిన మానవుడి సంస్కారంగా అభివృద్ధి చెందుతూ, మహత్తరమైన మార్పుకోసం పాటుపడే ఇంగితంగా కనిపిస్తుంది. విశ్వాసం దాని లక్ష్యం. వివేకం దాని లక్షణం.

# 5. కథలు – నిబద్ధత

సమకాలీన సాంఘిక, రాజకీయ, సమరశీల ఉద్యమాల ఆందోళనే రాఘవ కథాప్రపంచం. అతడి రచనావ్యాసంగం ఐదవ దశకంనుండి ప్రారంభం అయింది. రెండవ ప్రపంచ యుద్ధం, 1942 క్విటిండియా ఉద్యమం, బెంగాల్ కరువు, దేశవ్యాప్తంగా కార్మికుల సమ్మెలు, వాటిపై సాగిన పోలీసుకాల్పులు, మతకల్లోలాలు, దేశవిభజన మున్నగు సంఘటనలన్నీ ఈ కాలంలోనే యధార్థదృశ్యాలుగా ముందుకు వచ్చాయి.

రాఘవ తనకథల్లో చాలామట్టుకు జాతీయపెట్టుబడిదారులు విదేశీ పెట్టుబడిదారులతో ఎలా మిలాఖత్ అయి, ప్రజలను పీడించిందీ వివరిస్తూ ఆక్రోశాన్ని కనబరచాడు. జాతీయపెట్టుబడిదారులు, భూస్వాములు ఎలా ఇంగ్లీషువారితో కమ్మక్కయినదీ, వారిని నడిపే మూలశక్తిగా బ్రిటిషు సామ్రాజ్యవాదం ఎలా కీలకంగా పనిచేసిందీ రాఘవ వివరించాడు. భూస్వామ్య, పెట్టు బడిదారీ శక్తులు కాంగ్రెసు పార్టీలో చేరిపోవడంవల్ల తమకు అన్నివిధాలా రక్షణ ఉండగలదని భావించాయి. కాంగ్రెసు పార్టీకూడా ఈ దోపిడీకూటమికి కావలసినంత ఆశ్రయమిచ్చి, వారి భయసందేహాలను తొలగించి, శాశ్వతరక్షణకు తగిన ఏర్పాట్లు చేసింది. దోపిడీ శక్తులు కాంగ్రెసుగొడుగు కిందికి చేరుతూపోయి, మొత్తందేశాన్ని క్రమంగా తమ చేతుల్లోకి తీసుకోగలిగాయి. రాఘవ ఈ పరిణామాలన్నిటినీ సరిగ్గా గ్రహించి, పూసగుచ్చినట్లు తన కథల్లో తెలివిగా తేటతెల్లం చేశాడు.

రాఘవ కథల్లో ఒకవైపు దేశవ్యాప్తంగా కొనసాగుతూన్న జాతీయోద్యమ ప్రతిధ్వని, మరోవైపు చర్మకారులు, కార్మికులు మున్నగు శ్రవజీవుల ఇళ్ళల్లో భూస్వాముల అకృత్యాలు, దహనకాండ, అత్యాచారాలు కొనసాగడం, వారి జీవితం దుర్భరమైపోవడం వగైరా ప్రజ్వరిల్లాయి.

రాఘవ కథలు భూస్వామ్య పెట్టుబడిదారీ సమాజాల దుర్మార్గ దృశ్యాలను, సమస్యలను మాత్రమే చిత్రించలేదు. వాటి మూలకారణాలను పరిశోధించి, వాటికి తగిన పరిష్కారాన్ని కూడా చూపడానికి నిజాయితీతో

ప్రయత్నించాయి. దేశప్రజలు భూస్వామ్యసంస్కృతిలో బందీలైపోయారు. నాయకులు, పోలీసులు, మిగతా యంత్రాంగం భ్రష్టు పట్టిపోయింది. వ్యాపారవర్గం స్వార్థంతోనిండి, మోసపూరితంగా మారిపోయింది. ఈ యధార్థాలతోపాటు రాఘవ కథల్లో మానవాంతఃకరణ, జాతీయోద్యమం, సామాజిక వికాస చింతన, వేదన బహుళంగా కనిపిస్తాయి. సామాన్య మానవుడు కలలుగనే సమసమాజం రావాలనే కమిట్‌మెంటు అతడికథల్లో బహుళంగా కనిపిస్తుంది.

స్వాతంత్రోద్యమంలో తెగించి పాల్గొన్న జాతీయాభిమానులు సాటిలేని త్యాగాలు చేశారు. "ఈమాన్‌కీ ఫసల్" [నిజాయితీ పంట] అనే కథలో రాంనారాయణ్ అలాంటి త్యాగశీలుడే. అతడి పంటను కోయడానికి వచ్చిన లాలా శ్యామ్‌ప్రసాద్‌లాంటివారు. ఒక వర్గంగా తయారై, ఆనాటి సాంఘిక, రాజకీయ వికృతాలకు మూలకారణంగా నిలుస్తారు. గాంధిపేరులోని తెల్లదనం' [ఖద్దరు – కాంగ్రెసుపార్టీ] ఈ దుర్మార్గుల దుష్కృత్యాలను కప్పివేయడానికి అవసరానికి దొరికిన 'ఆచ్ఛాదన'లా ఉపయోగపడుతుంది.

"లోని నలుపును, అకృత్యాలను దాచడానికి పైన తెలుపు కావాలికదా! వీరంతా తెల్లని [ఖద్దరు] టోపీ ధరిస్తారు."

['ఇన్సాన్ పైదా హువా', పేజీ 85]

'బాప్ కా దోస్త్' [తండ్రి స్నేహితుడు] అనే కథలో కూడా గాంధేయవాదాన్ని, రాజకీయదుర్మార్గాన్ని, అన్నీ కలిపి మొత్తంగా మారిన అవకాశవాదాన్ని తీసుకొని తీవ్రంగా విమర్శిస్తూ రాఘవ నాటి పరిస్థితికి అద్దంపట్టాడు. 'ధూల్ కీ ఆంధీ' [ధూళిదుమారం], 'ఉపచేతనాకా తాండవ్' [అంతరాత్మ తాండవం], 'యహ్ గ్వాలియర్ హై' [ఇది గ్వాలియర్], 'చంగేజ్‌కీ తల్వార్' [చంగేజ్ కత్తి]లాంటి కథలు కూడా అలాంటివే వీటి ఆధారంగా నాటి పరిస్థితిని ఒక చిత్రంగా ఊహించవచ్చు.

నాటి పరిస్థితులకు స్పష్టాతి స్పష్టంగా అద్దంపట్టిన రాఘవ కథ రచనాకాలం నవనవోన్మేషమైనది. సరిగ్గా ఆ సమయంలోనే హిందీ

సాహిత్యంలో అభ్యుదయ సాహిత్యాధ్యయనపు వేడిమి విస్తరిస్తున్నది. అభ్యుదయ సాహిత్యాధ్యయన ప్రారంభకాలం అది. ఆవహించిన ఆశావాదం దానిని ముందుకు నడిపిస్తూన్న దశ. ఎర్రసైన్యం, ఎర్రనక్షత్రం, మాస్కో క్రెమ్లిన్, సుత్తీకొడవలి, కొత్త ఉదయం మున్నగు విషయాలు ఆనాడు అభ్యుదయ సాహిత్యోద్యమంలో ఎక్కువగానే చర్చకు వచ్చాయి. అభ్యుదయ సాహిత్యోద్యమావశ్యకత అందరికీ సుబోధకం కాకపోవడంవల్ల, రాఘవ కథల్లో ఒకేసారి అన్నీ అభ్యుదయసాహిత్య సంకేతాలు చోటు చేసుకోవడంవల్ల, అవన్నీ రచయిత బలహీనతలుగానే ఎదురయ్యాయి.

'ధూల్ కీ ఆంధీ' కథల్లో హోటల్లో పనిచేసే కుర్రవాళ్ళు అంతర్జాతీయరాజకీయ పరిస్థితులను గురించి, ఎర్రసైన్యం పాత్ర గురించి చర్చిస్తారు. వీరు సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తూ, రైతుల, కార్మికుల పక్షం వహిస్తారు. [కాలప్రభావంవల్ల, పార్టీనిర్మాణంవల్ల పిల్లల్లో కూడా అలాంటి చైతన్యం రావడం విడ్డూరం కాదు]. 'చంగేజ్ కీ తల్వార్' కథలో సామ్రాజ్యవాదాన్ని కోపంతో 'వేశ్య' అని కూడా అనడం జరిగింది. దోపిడీ, దుర్మార్గం, బర్బరవిధానం, అత్యాచారం, అణచివేత ఎంత జరిగినప్పటికీ, సంఘంలో పోరాడుతూన్న ప్రజానీకం ఎన్నటికీ తలవంచదని, ఆ రోజులు అతిత్వరగానే రాబోతున్నవని, ఆనాడు ఈ దుష్ట సామ్రాజ్యవాదం అంతమై తీరుతుందని ఈ కథలో పవిత్ర ఆశావాద సంకేతం వ్యక్తంచేయబడింది – 'భోర్ పాస్ ఆగయీథీ' [వేకువ సమీపించింది].

['అదే కథ' – పేజీ 172]

'యహ్ గ్వాలియర్ హై' కథల్లో గాంధీకాళ్ళమీద పెట్టుబడిదారీ విధానం పాములా కూర్చొనివుందని సంకేతం చేయబడింది. కార్మికుల మీద నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరిగినప్పుడు వారి పేదరికం గురించి రాస్తూ రాఘవ అంటాడు.

"నిజమే కార్మికుని దగ్గర మురికిపట్టిన చింపులవస్త్రం ఉన్నంతవరకూ అందులో పేను పాకుతూనేవుంటుంది. కాని ఆ కార్మికునికే వేళ్ళు ఉన్నాయని

మరచిపోరాదు. అవి ఎలాంటి పేనునైనా నలిపివేయగలవు."

['యహా గ్వాలియర్ హై'; పేజీ – 133]

ఈ కథల్లో రాఘవ అనుకున్న చిత్రం స్పష్టంగా బయటపడలేదు. కారణం అతడి అభ్యుదయవిశ్వాసాలు రచనల్లో ప్రతిఫలించడంలో విఫలమయ్యాయి. ఈ కారణంగానే అతడిపై రాజకీయాలు జీర్ణంకాని రచయితగా అందరూ ఆరోపణ చేశారు. ఏ రైతాంగ, కార్మికవర్గ పక్షపాతంతో ఈ కథలు రాయబడ్డాయో, ఆ వర్గాల రాజకీయపు మెలకువలు పూర్తిగా వ్యర్థ్యమైపోయాయి. పీడితులు వర్గపోరాటారాలు ఈ కథల్లో స్పష్టంగా కనిపించవు. ఈ కథల్లోని పీడితులు పోరాడేవీరులు కారు. వారి భావాల్లో మిలిటెంటు ఆవేశాలు ఉండవు.

ఈ కథల్లో రచయితే సైన్యంగాను, సేనాధిపతిగాను కనిపిస్తాడు. ఈ బలీహీనతవల్లే రాఘవ కథలు పట్టుదప్పిపోతాయి. వీటిలో సువ్యవస్థితమైన కథావస్తువు కూడా ఉండదు. ఎక్కడో ఏదో ఒక విషయం మొదలై, పెరిగిపెరిగి, చివరకు ముగింపుకు వచ్చే తీరు రచయితకు సహజసౌకర్యంగా లభించింది. కథ మధ్యలో ఉపన్యాసధోరణి మొదలై పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం ఖండింపబడతాయి. దౌర్జన్యవాద రాజకీయాలు, అవకాశవాదం, నిర్బంధకాండ, అణచివేత మున్నగు అరాచకాలను రచయిత నిందించి, చివర పరిష్కారంగా కార్మిక కర్షకహితవులను జోడించి, ఉపన్యాస ధోరణిలో కథ కంచికి చేరేట్లు చేశాడు.

రాఘవ కథలను మగ్గంమీద నేతగా పేర్కొన్నారు విమర్శకులు. పొడుగైన మగ్గంమీద దారపుపోగులు మధ్యలో తెగిపోతే, వాటిని ముడివేసి తిరిగి నేసినట్లుగానే, ఎక్కడో అమాంతంగా బంధం తెగిపోతే తిరిగి మరోఅంశంతో ముడివేసి, కథను వీలైనంత పొడవు కొనసాగించినట్లు కనబడుతుంది. ఆ రోజుల్లో ఇలాంటి సుదీర్ఘకథలవల్ల అమృత్‌రాయ్, కిషన్‌చందర్‌లాంటి కథకులు అప్రతిష్టపాలయ్యారు కూడా.

ఎనభైశాతం ఆవేశం, ఇరవైశాతం ఆలోచన ఉంటేనే దానిని

"ప్రొలిటేరియట్ సాహిత్యంగా భావించాలని, కళాప్రమాణాలు, రచనానైపుణ్యం ఉండాల్సిన పనిలేదని ఆరోజుల్లో అభ్యుదయ సాహిత్యోద్యమకారులు ఒక దామాషాపద్ధతిని నిర్ణయించి పెట్టారు."

రాఘవ కమిట్‌మెంటు [నిబద్ధత – ఒక ఆశయానికి ముఖ్యంగా కార్మికవర్గ కల్యాణానికి కట్టుబడివుండడం] ఉన్న రచయిత కాబట్టి తన కథల్లో సంఘంలో నిర్లక్ష్యానికి, నిరాదరణకు గురయ్యే పాత్రలనే ఎక్కువగా సృష్టించాడు. 'ఆవారా' లాంటి [దేశదిమ్మరి] పాత్రలు అతడి రచనావిశేషాలు. వర్గ చైతన్యం ఎంతగా ఆవహించివున్నప్పటికీ, సంఘంలో విస్మృతపాత్రలుగా కనపడే పీడిత బతుకులను దగ్గరగా చూసి, అంతఃకరణతో ఆత్మీయంగా రాసిన బహుకొద్దిమంది రచయితల్లో రాఘవ శ్రేష్ఠంగా కనిపిస్తాడు. అలా ఆ పాత్రలను దగ్గరగా తరచిచూశాననే మైకంకూడా అతడిలో జాస్తిగానే ఉండేది. బెంగాల్ కరువు భీభత్సాలను చూసి. [ప్రత్యక్ష వ్యాఖ్యానంలా] అతడు పత్రికలకు వరుసగా రిపోర్టులు రాసి సమస్య తీవ్రతవైపు ప్రజలను కదిలించాడు. 'విషాద్‌మఠ్' లాంటి నవలనూ రూపొందించాడు. గగుర్పాటు కలిగించే అతడి ఈ రచలన్నీ పాత్రలను సన్నిహితంగా చూసినందువల్ల వచ్చిన పరిణామాలే.

చూసి రాసిన బతుకుల కథలు 'అభియాన్' [ఉద్యమం], 'ఆవారా' [దేశద్రిమ్మరి] విశేషంగా దృష్టినాకర్షిస్తాయి. బిచ్చగాళ్ళ మనస్తత్వాలు, ఆకాంక్షలు చాలాఆత్మీయంగా చిత్రింపబడిన కథ 'అభియాన్', కథాప్రారంభంలోనే రాఘవ బిచ్చగాళ్ళవాతావరణాన్ని చాలాసహజంగా చిత్రించాడు.

"...అక్కడే కొంతదూరం నడిచాక, స్టేషన్‌వైపు ముఖంఉన్న చిన్నసమాధి ఎదుట ఒక మురికివాడ ఉంది. చిన్నచిన్న గుడిసెలు. రోడ్డుకభిముఖంగా వాటి తలుపులు లోనఅంధకారం, చెల్లా చెదరైన వారి ప్రపంచం నిరాశతోఉంది. మనిషి అందులోకి నిటారుగా నిలబడి ప్రవేశించలేడు. ఆ ఇళ్ళన్నీ గడ్డిపరకతో కప్పబడి, శరీరంమీద లేచిన లెక్కలేనన్ని పుళ్ళలా ఉన్నాయి..."

['ఏక్ ఛోడ్ ఏక్' – పేజీ – 11]

ఈ బిచ్చగాళ్ళలోకూడా స్థాయీభేదాలున్నాయి. దాని ప్రకారమే వారి ఆశలు, ఆశయాలు, దినచర్యలు ఉంటాయి. వీరి మధ్యనుండే వచ్చిన ఆనంది, రఘు, మిల్లులో పనిచేయప్రారంభిస్తారు. కరువులో మిల్లునుండి తీసివేశాక కూడా ఆనంది మళ్ళీ బిచ్చమెత్తే దుస్థితి రాకూడదని కోరుకుంటుంది. కరువు భాధితులసహాయార్థం వచ్చిన విద్యార్థులకు రెండణాల విరాళం ఇచ్చి తృప్తిని పొందుతుంది ఆనంది. వాడలోని వారంతా ఆనంది చేసినపనిని నిందించి, హేళన చేసి, 'దురహంకారి' అని విమర్శించినా, తాను చేసిన పని మంచిదని సంతోషంలో మునిగిపోతుంది. తనగర్భంలో పెరుగుతున్నవాడు ఎట్టిపరిస్థితుల్లోనూ బిచ్చగాడు కాకూడదని, కార్మికుడు కావాలని కోరుకుంటుంది. ఈ కథలను ఇలా ఆదర్శవంతం చేసిన రాఘవ చివర తన మేలుకొలుపుమాటలతో భరతవాక్యం పలుకుతాడు.

"రాత్రి, అలసి నీరసమై శిథిలమై యోగముద్రలోకి వెళ్ళిపోయింది. సన్నగా తెలుపుదనం ఆకాశంలో ఒక తీగలా వణుకుతూంది. ఆకాశం నిర్మలంగా ఉంది. గాలి తడిసిపోయింది. అప్పుడు దూరంగా నిశ్శబ్దంలో వ్యాపిస్తూన్న కోడికూతను విన్నాడు రఘు ఇప్పుడు నిద్రించే సమయంకాదని ఆ కూత ధ్వనించింది."

['ఏక్ ఛోడ్ ఏక్'; పేజీ – 4]

'ఆవారా'లోని పాత్రలు రాజకీయ భావాలకు దూరంగా ఉండినట్లు కనిపించినా, గోర్కీ 'ఆవారా' పాత్రల తీరుతెన్నుల ముద్రలు ఈ కథలో అక్కడక్కడా కనిపించి తీరుతాయి. అయితే ఏ ఉత్సాహ ఉల్లాసాలు కథలో అంతగా ఉండవు. 'కార్మికులసంతోష' దినంగా పేర్కొనబడిన మేడే సందర్భంలో రాఘవ ఈ కథలో ఈతలు, మల్లయుద్ధాలు వగైరా పోటీలు వర్ణించి, కథను అనవసరంగా పెంచాడు. దుర్భరమైన అంటువ్యాధి మూలకంగా చనిపోయిన స్త్రీ, మిగతావారందరూ ఏదోసందర్భంలో దోపిడీపిడితులు. అసలు దోషి ఈ వ్యవస్థ. అది ఒక వైపు మనుషులను

పరాధీనులు, దుర్బలులు, పీడితులుగా దిగజార్చి వారు దేశదిమ్మరులయ్యేట్లు చూస్తూంది. మరోవైపు వారిని దేశదిమ్మరు [ఆవారా]లైనందుకు నేరస్తులుగా శిక్షిస్తూంది. అందుకు భిన్నంగా ఈ [దోపిడీ] సమాజమే 'ఆవారా' అని రాఘవ తేలుస్తాడు. ఇది అతని కమిట్‌మెంటు [నిబద్ధత]కు ప్రబలఉదాహరణ.

మానవసహజమైన సమస్తబలహీనతల్లో బందీలై సర్వంలకోల్పోయి, సమాజం ఎదుట 'ఆవారా' [దిమ్మరు]లుగా, దిశాహీనంగా ఉన్నా వీరు నిజానికి చెడ్డవారు కానేకాదు. వీరిలా తయారు కావడానికి బాధ్యత వహించాల్సింది పెట్టుబడిదారీ సమాజం అని రాఘవ వాదిస్తాడు.

ఎప్పుడు తన మాటను స్పష్టంగా చెప్పాలో అప్పుడు స్పష్టంగా చెప్పనందువల్ల, చివరకు తన అభిప్రాయాన్ని అసందర్భంగా రచనలో జొప్పించడంవల్ల మొత్తంరచనే భారమై, చదివించే గుణాన్ని కోల్పోయి కుంటిదైపోయింది. కథ చివర రాఘవ చేసిన వ్యాఖ్య ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు.

"ఈ సమయంలో కూడా. పెట్టుబడిదారీ విధానం దేవుని అన్వేషణలో లీనమైవుంది. ఇది దాని నాగరికతానీడకాక మరోటి కాదు.."
['ఏక్ ఛోడ్ ఏక్'; పేజీ – 119]

మార్క్సిస్టు భావాలు రాఘవను ఆవహించివున్నప్పటికీ, అతడు తన సాహిత్యం తత్కాలీన విషయాలకు మాత్రమే కట్టుబడిపోవాలని ఏనాడూ కోరుకోలేదు. సాహిత్యం తప్పనిసరిగా యుగస్వభావాన్ని స్వీకరించి యుగవాణిని ప్రతిధ్వనింపజేసినా, అది వాటిని అధిగమించగలిగినప్పుడే సార్వకాలీనతను, శాశ్వతత్వాన్ని పొందగలిగిందని రాఘవ దృఢవిశ్వాసం.

ఈ శాశ్వతత్వ సత్యాన్ని అతడు 'యుగయుగాల సత్యం'గా అంగీకరించాడు. ఈ శాశ్వతశబ్దాన్ని కూడా రాఘవ సాపేక్షంగా స్వీకరించాడు. శాశ్వతత్వభావన చైతన్యరహితమైన 'జడ'మని అతని అభిప్రాయంకాదు. వేగగతిని నిర్వహించిన రాఘవ, చైతన్య వికాససాక్షాత్కారంగా శాశ్వతత్వాన్ని

సాహిత్యంలో ప్రతిపాదించాడు. 'కుత్తేకి దుం ఔర్ శైతాన్' [కుక్క తోక – దయ్యము] అనే కథను వివరిస్తూ రాఘవ వెలిబుచ్చిన అభిప్రాయం గమనార్హం.

"..... ఇది మానవుడి బాహ్యా విషయాలవరకు మాత్రమే వెళ్ళి పరిమితమైపోదు. లోని నికృష్టత్వాన్ని వెలికి ఈడ్చుకొని తేగలిగేదే "యుగయుగాల సత్యం". యుగయుగాల సత్యంతో తాదాత్మ్యం కాగలిగినప్పుడే కళ జన్మిస్తుంది. అదే 'శాశ్వత మనిపించుకుంటుంది. అనగా అది తన కాలావధిని అధిగమించి యుగయుగాలవరకు నిలుస్తుంది. ఇలా ఎక్కువకాలం ఉండగలిగే సత్యం పదిపదిహేనుసంవత్సరాలనిగాక నాలుగైదు వేల సంవత్సరాలదాకా ఉండగలుగుతుంది. కాలప్రవాహంలో ఈ సమయం విలువ ఎంతని?"

['మేరీ ప్రియకహానియా'; పేజీ – 14; (నాకిష్టమైన కథలు)]

రాఘవ తన సాహిత్యంలో శాశ్వతత్వ భావనను తేవడానికి గలమూలకారణం – ప్రాగైతిహాసాలనుండి నేటిదాకా సాగిన మానవవికాసాల విభిన్నలక్ష్యాలపట్ల అతడికి గాఢమైన ఆసక్తి ఉండడమే. ఎన్ని పరిమితులు ఉన్నా అసంపూర్ణంగానే మిగిలిపోయినా అతడి 'మహాయాత్ర' రచన ఈ అభిప్రాయాన్నే స్పష్టం చేస్తుంది. ఒక యుగంలోని వాస్తవాన్ని తీసుకొని, యుగయుగాల సత్యంగా మలచాలనే మహదాకాంక్షగల మహారచయిత రాఘవ. తన కాలంలోని రాజకీయ, సాంఘిక విషయాలను తీసుకొని, ఎందుకు కొన్ని అప్రధానమైన కథలను రాశాడనేది అతడి అంతర్ వైరుధ్యంగా తోస్తుంది. బహూశా ఇదివరకే వివరించినట్లు రచనా వేగం, విస్తృతి అతనిని వివశుణ్ణి చేసివుంటాయి.

మొదట వివరించిన కథలు, అలాంటివి మరికొన్ని కథలు సామయికపరిధిలోనే బందీయై ఉండిపోతాయి. ఒక సమయంలోని పరిమితాశయ రచనకు ఉదాహరణలుగా అవి నిలిచిపోతాయి. అలాగే నేడవి కేవలం గతకాలపు ప్రస్తావనగానే చారిత్రక క్రమంలోముందుకు వస్తాయి.

రాఘవ కథల్లో మంచివి, సార్థకమైనవి చాలాతక్కువ. యుగస్వభావాన్ని జయప్రదంగా సంతరించుకొని, 'యుగయుగాల సత్యం'గా శాశ్వతత్వ ఉత్కంఠతో నిలిచిన కథలేమనకు మంచికథలుగా కనిపిస్తాయి. ఇలాంటి కథలు తనుకాలావధుల పరిమితుల్లో కొట్టుమిట్టాడినప్పటికీ, అవి శాశ్వతసత్యాలను వెదకడానికి విశ్వప్రయత్నం చేస్తాయి. 'తబేలేకా ధుంధలకా' [అశ్వశాలలో లేచిన ధూళివల్ల ఏమీ కనిపించక పోవడం – పరస్పరం పోట్లాడుకోవడం], 'భయ్' [భయం], 'పంచ్ పరమేశ్వర్', గదల్ [ఉపద్రవం – తిరుగుబాటు] మున్నగు కథలన్నీ శాశ్వతసత్యాన్వేషణ కోసం సామయిక సంఘటనలను ఆశ్రయిస్తాయి. శాశ్వతసత్యాన్వేషణా ప్రయత్నంలో ఇవి సైద్ధాంతిక ఆలోచనా ధోరణికి దూరం కాలేదనేది కూడా సత్యమే. సైద్ధాంతిక ఆలోచనాధోరణిపైన సాగిన రచనాప్రయోజకత్వానికి ఈ కథలు విజయవంతమైన విషయాలుగా, స్థైర్యం గల ఉదాహరణలుగా నిలుస్తాయి.

"తబేలేకా ధుంధలకా" – దేశవిభజనను ఆధారం చేసుకొని రాయబడిన కథ ఇది. రచయిత ఈ కథాసంవిధానంలో ఎక్కడా దేశవిభజనకు సంబంధించిన రాజకీయ వివాదాల్లోకి ఏమాత్రం పోడు. దేశవిభజనవల్ల సంక్రమించిన మానవవిషాద దృశ్యాలు ఒకవైపు, ఎదుటివారి పరాధీనతను ఆధారంచేసుకొని సర్వం దోచుకోవాలనే స్వార్థం మరోవైపు. ఈ రెండింటిని చిత్రించడంలో ఈ కథ మిగతావారు దేశవిభజనమీద రాసిన రచనలకన్నా ఉత్కృష్టంగా కనిపిస్తుంది. ఇతర పరిస్థితుల్లో యవ్వనంలోని తోబుట్టువు ను బేరంపెట్టే సందర్భాన్ని ఏ రూపంగానైనా చిత్రించవచ్చు కాని ఇక్కడ పరాధీనతలో అది సహజ ఆమోదిత పరిణామంగా ముందుకువస్తుంది.

భార్య చెప్పిన అన్ని మాటలు విని, బేరంచేసే సేటు వచ్చాక అతనిలో ఎలాంటి ప్రతిస్పందన కలుగుతుంది?...

"...నాకు తెలిసింది – నేను తిరిగివచ్చానా లేక జారిపోయినా? నాభార్య అంటున్నది.. 'నీవు దీనిని సహించలేవు కాని ...అది నాకిష్టమే – అయినా చేయలేను."

['ఇన్సాన్ పైదాహువా'; పేజీ – 227]

సోదరి మానం పోవడంవల్ల అంధాకారం ఒక్క తన గుండెంలోనేకాదు, మొత్తం దేశంలోనే విస్తరించింది. దేశమంతా మానవ విలువలపతనం ద్వారానే నడుస్తుంది. దుమ్ము చెలరేగి చీకటికమ్మిన అశ్వశాలకు భిన్నంగా దేశంలేదు. సోదరి బేరంకన్నా ముందు – దేశపరిస్థితులు దిగజారడం, తద్వారా దేశదుస్థితి స్పష్టంకావడం ఈ కథావిశేషాలుగా కనిపిస్తాయి. సింధీశరణార్థి కావడంవల్ల ఆ అమ్మాయి ధరించిన దుస్తులను బట్టి ముస్లిం స్త్రీఅనుకొని హిందువులు ఆమెను ఎత్తుకొని పోవడానికి సిద్ధపడతారు. శరణార్థుల సంరక్షణకోసం కాపలాకాస్తున్న పోలీసులు ఏవిధంగానైనా శరణార్థులనుండి డబ్బురాబట్టడానికి పొంచివుంటారు. డబ్బు దస్కం లేకుంటా ఇళ్ళనుండి వట్టి చేతులతో శరణార్థులు వచ్చారనే విషయాన్ని నమ్మడానికి పోలీసులు ఏమాత్రం సిద్ధంగా ఉండరు. తన గుడారంలో చోటు ఇచ్చి దయచూపిన సేటు బలవంతంగానైనా ప్రతిఫలం పొందడానికి ప్రయత్నిస్తాడు. ఈ గొప్ప దేశనాయకుడు... కాంగ్రెసునాయకునితో కలిసిపోయాడు. వారంతా పెద్ద పెద్ద ప్రశ్నల్లో ఇరుక్కుపోయారు. కాశ్మీరులో యుద్ధం సాగుతూంది. అప్పుడు. నేనడిగాను.

"ఇక్కడి అధికధరలు చంపేస్తున్నాయి బాబుగారు!
అతడి సమాధానం... "మళ్ళీరండి"

['అదే పుస్తకం'; పేజీ – 225]

'భయ్' [భయం], 'పంచ్‌పరమేశ్వర్' అనే కథలు వ్యవస్థలోని మిగతారుగ్మతలను వెలుగులోకి తెచ్చినా ముఖ్యంగా పంచాయతీవ్యవస్థను కేంద్రంగా చేసుకొని రాయబడినవి. ప్రజలు అనూచానంగా నమ్ముతూవచ్చిన 'పంచాయత్'లో పరమేశ్వరుడుంటాడనే విశ్వాసాన్ని ఈ కథలు బహిర్గతం చేస్తాయి. 'భయ్' కథ గ్రామీణవాతావరణానికి సంబంధించినది. 'పంచ్‌పరమేశ్వర్' కథ నగరజీవితానికి సంబంధించినదని రచయిత స్పష్టంగా ముందే చెప్పాడు. కారణం ఇందులో కుమ్మరి వాడలవర్ణన ఉండడంవల్ల ఇది గ్రామీణజీవితానికి సంబంధించిన దేమోననే భ్రమకలుగుతుంది.

'భయ్' కథలో చుట్టపుమామ, అత్తసోదరుడు కుందన్ 'రత్నీ'ని బలాత్కరిస్తాడు. రత్ని భర్త రమల్, అసలుమామ తులసీ పరుగులు తీసి, పోలీసులుకు, డాక్టరుకు ప్రత్యక్షసాక్ష్యం ఇచ్చి కుందన్‌కు వ్యతిరేకంగా చర్యతీసుకోవాలని కోరుతారు. కుందన్ ఈలోగా ఒకసారి క్రిమినల్‌కేసులో శిక్షపడి వస్తాడుకూడా. అయినా పంచాయతీ పెద్దమనుషులు అన్యాయం చేసినవారిని, అన్యాయానికి బలైనవారిని ఒకే త్రాసులో తూచే ప్రయత్నం చేస్తారు. తమ తర్కాన్ని చెప్పి, వేరువేరు కారణాలు వివరించి, ముగ్గురి పైనా జుర్మానా విధించి, పంచాయతీపెద్దలు చేతులుదులుపుకుంటారు. ఈ విషయంలో అన్ని అవమానాలు, బాధలు అనుభవించిన రత్ని నోరుతెరచి ఏమీ చెప్పలేని స్థితికివస్తుంది. రత్నీ అత్త 'ధుపో' ఇచ్చిన సాక్ష్యం అంతా తలకిందులు చేస్తుంది. దోషి అయిన తన తమ్ముడు కుందన్ నిరపరాధి అనీ, దోషమంతా రత్నీదేననీ వివరించి మొత్తంచక్రం తిప్పేస్తుంది.

'పంచ్–పరమేశ్వర్', 'భయ్' కథకన్నా ఎక్కువ కళాప్రమాణాలు గల ఉత్తమకథ. కథతోబాటు రాఘవ ఇచ్చిన వివరణలో ఈ కథకు సంబంధించిన సమస్య ఏవిధంగానూ పరిష్కరింపబడదని, పంచాయత్ స్వరూపస్వభావాలే సాపేక్షమనీ, యధార్థదృశ్యాలను చిత్రించడమే తన కర్తవ్యమనీ రాఘవ స్పష్టంచేశాడు. ఈ కథద్వారా రాఘవ ప్రేంచంద్ దృష్టికోణానికి బిన్నంగా పంచాయతీని బొమ్మకట్టించే ప్రయత్నంచేశాడు. ఆదర్శం ఎలాంటిదైనా వ్యక్తి మంచి – చెడులను సహజంగా ఇందులో చిత్రించడానికి ప్రయత్నం చేశాడు. నిజాయితీ బాధ్యతల దగ్గర – వ్యక్తి స్వయంగా కూర్చొని బాధ్యతను గుర్తించి ప్రవర్తిస్తాడనే అంశాన్ని రాఘవ ఏమాత్రం నమ్మడు. పెరుగుతున్న పెట్టుబడిదారీ విధానం, ఒత్తిడివల్ల మానవుడి సత్ప్రవర్తనలుకూడా భ్రష్టుపట్టి పోంయాయని రాఘవ నిశ్చితాభిప్రాయం. మానవుడి మంచి గుణాలు క్రమంగా అంతరించి పోవడానికిగల కారణం పెట్టుబడిదారీ విధానం తెచ్చిన సంక్షోభ మేనని అతడి విశ్వాసం. అన్ని ప్రలోభాలకు తట్టుకొని నిలువగలిగేవారు చాలా అరుదు. వారే ఆదర్శజీవులు. రాఘవ ఆదర్శజీవి.

ప్రేంచంద్ పంచాయతీ పద్ధతిని చిత్రిస్తూ రాసిన కథ 'పంచ్‌పరమేశ్వర్'లో జుమ్మన్‌షేక్ తన స్నేహాన్ని కూడా ఖాతరు చేయకుండా, నిష్పాక్షికంగా మిత్రుడైన అల్గూచౌధరికి వ్యతిరేకంగానే తీర్పుచెబుతాడు.

రాఘవ రాసిన 'పంచ్–పరమేశ్వర్' కథలో 'కన్హాయి తన సవతితల్లి కుమారుడు, తన తమ్ముడు అయిన చందాభార్యను తన దగ్గరే ఉంచుకుంటాడు. సర్పంచ్ చౌధరీని పిలిచి నాటుసారా [ఠర్రా]తో స్వాగతం చెబుతాడు. ఇదంతా చందా పంచాయితీని పిలవడానికన్నా ముందే జరిగిన లోపాయకారీ వ్యవహారం.

"రాత్రి చీకటిలో నాటుసారా [ఠర్రా] తన ప్రభావాన్ని చూపుతుంది. . ఆ తర్వాత బయట ప్రకృతిలో ఏకాగ్ర చిత్తంవల్ల వణుకుతూ ఉన్న గాఢాంధకారం క్రమంగా చెతన్యంమీద ఆవహించి విస్తరించింది."
['మేరీ ప్రియ్ కహానియా' – 56]

ఆ సంఘటన తర్వాత జరగాల్సింది చాలాతక్కువగానే ఉంటుంది. పంచాయతీ సమావేశమై, దాని పెద్ద పంచపరమేశ్వర్ ఇదివరకే నిర్ణయమై వున్న తీర్పును కూడా ప్రకటిస్తాడు.

"స్త్రీ, పురుషునికి చెందుతుంది. మగడే లేనప్పుడు ఆ స్త్రీ వాడికెందుకు చెందుతుంది? అనగా ఫూలో పెళ్ళి చేసుకున్న చందాకు చెందిన స్త్రీ 'కన్హాయి'కి దక్కిన స్త్రీగా ఉంటుంది. కారణం వాడు మగవాడు కాబట్టి.. పెట్టుబడిదారీ సమాజంలో కలిగిన వాడే మగవాడు. వాడేం చేసినా చెల్లుతుంది. అదే న్యాయం!"

"పంచాయతీ సమావేశం ముగిసింది. చందాకు పాతిక రూపాయల జుర్మానాపడింది. దానిని రోషంతో అక్కడే విసిరికొట్టి ఓడిపోయి చందా తిరిగివచ్చాడు. పాపం వాడికి ఈ కారణాన ఎక్కడా ముఖం కూడా చూపించే స్థలం దొరకలేదు. మళ్ళీ అతడికి పెళ్ళికావడం కూడా దుర్లభం నిండివున్న పంచాయతీలో ఫూలో తన గౌరవ కారణమైన తలటోపీని ఎగరేసి కాళ్ళకింద నలిపేసింది. ఫూలో మాటమీదే అంతిమనిర్ణయం జరిగే

సమస్య ఇది".

['మేరీ ప్రియ్ కహానియా'; పేజీ - 59]

కన్హాంయా పథకంప్రకారం బమ్మిని తిమ్మిచేసి విజయాన్ని సంపాందించినా, అతడు లోలోన భయపడక తప్పలేదు. పంచాయితీలో వాస్తవమేమిటో అతడివయందు స్పష్టమయింది. కాని ఘూలో ఇంకా యవ్వనంలో ఉంది. అందువల్ల వాడు ఇంకా నష్టంలోనే ఉన్నట్లు బాధపడిపోయాడు. కొని పట్టుకొచ్చిన న్యాయం నిలుస్తుందా అనేది వాడి మనోవ్యాధి.

'మృగతృష' [ఎండమావి] సంకేతాత్మకమైన [సింబాలిక్] కథ. తన సాంఘిక నిబద్ధత మేరకు రాఘువ, వారసత్వానికి సంబంధించిన ప్రశ్నను చాలాకళాత్మకంగా ప్రతిపాదించాడు. తన వాంఛలమేరకు 'మృగీ' [మృగం] త్యాగశీలతను, పోరాడే చైతన్యాన్ని మూర్ఖత్వంగా భావిస్తుంది. కాని 'వ్యవస్థ అనే 'వ్యాఘ్రం' వేటగానిలా కుక్కరూపంలో తన మెలకువలతో మృగీని నోటకరచుకొని పోతుంది. మృత్యువు ఆసన్నమైనప్పుడు మృగీలో పశ్చాత్తాపం కలుగుతుంది. అప్పుడనిపిస్తుంది.

స్వార్థం ప్రతిభలోకి మళ్ళి పేరాశలకు పోయి, నేల విడిచి ఆకాశంలో తేలిన ప్రతిప్రాణి పర్యవసానం తన మృత్యువులాగే ఉంటుందని 'మృగీ' భావిస్తుంది. మరణవేదనలో మృగీకి తన వనం గుర్తుకొస్తుంది. భర్త, సంతానం జ్ఞాపకంవస్తారు. తన స్వార్థంకోసం వారిని కూడా మృత్యుముఖంలోకి పంపినందుకు వాపోతుంది. మృగం కూడా మరణిస్తుంది. చివరకు దాని చావు ఆత్మరక్షణపోరాటంలో వచ్చే వీరమరణం. అది మరణిస్తూ కూడా తన పసికూనను కాపాడడానికి పోరాడుతుంది. ఆ కూనే పోరాటాన్ని కొనసాగిస్తుంది. ఆత్మరక్షణ పోరాటంలో కన్నుమూస్తూ తన కూనతో మృగం మృగీ క్షేమసమాచారం అడుగుతుంది. తెలుసుకున్న విషాదాన్ని భరిస్తూ చివరిఘడియల్లో మృగం అనుకుంటుంది. "తనవారే తన మాటను అర్థం చేసుకోలేకపోయారనే యాతనను భరించలేక పోతుంది..!"

"ఓ దేవా! నేనేమి వింటున్నాను. నీవు నా కొడుకువెందుకయ్యావు! పుట్టగానే ఎందుకు మరణించలేదు. అభాగ్యుడా! ఎవ్వరూ నేర్పకుండానే సింహంపిల్ల గడ్డితినకూడదని గ్రహిస్తుంది. ప్రాణం పోయినా అలాగే ఉంటుంది. కాని నీవు జాతిగౌరవాన్ని ఎలా కాపాడాలనే విషయాన్ని నీవు నేర్చుకోలేకపోయావు!"

['పాంచ్ గధే' (అయిదుగాడిదలు); 166]

కథ మృగం మరణించాక కూడా నడుస్తుంది. చిన్న మృగం తల్లి తండ్రి మరణించాక, మరణావస్థలో నీటికోసం పరితపిస్తూ దశదిశలా గాలించే మృగీవేదనను చాటుతుంది. మృత్యుసనుయంలో పశ్చాత్తాప గర్భంనుండి పుట్టిన పేరాశల పట్ల వైముఖ్యం, భూమిపట్ల అపారమైన ప్రేమగీతంగా జన్మిస్తాయి. ఈ ప్రేమగీతం విస్తరించివున్న ఇసుక ఎడారిలో కలిసిపోయి, ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంది.

"ఎవరు జ్ఞాపకంలో తీయనితనాన్ని నింపుకొని పోతారో, వారిని అది ప్రేమతో తనలోకి తీసుకుంటుంది."

['పాంచ్ గధే' – పేజీ – 183]

ప్రతిరచయితలాగే రాఘవకుడా తన విమర్శకుల పట్ల అసంతృప్తితో ఉండేవాడు. ఈ విమర్శకులు – రచనలు చదువకుండానే విమర్శిస్తారని, అందులో వారి వికృత అహంభావం బద్ధలై బయటపడుతుందని, దానివల్ల రచనారంగమూల్యాంకనంలో వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు సంబంధించిన అరాచకత్వం రాజ్యం చేస్తుందనిరాఘవ ఆక్షేపణ.

మార్క్సిస్టు విమర్శకుల్లో రామ్‌విలాస్ శర్మతోను, మార్క్సేతర విమర్శకులతోను రాఘవ చాలాదీర్ఘకాలందాకా సాహిత్య విమర్శలు కొనసాగించాడు. ఈ చర్చలు ఒకోసారి అవధులు దాటి, కఠినంగా కూడా మారాయి.

'కుత్తేకి దుం–ఔర్ శైతాన్' కథలోని పరిస్థితులు చాలా మనోరంజకంగా ఉన్నాయి. రాఘవ ఈ కథలో బొమ్మకట్టించిన ప్రవృత్తులు పూర్తిగా

యధార్థమైనవి. ఒక కాలపు నిర్దుష్ట పరిస్థితులను, సమస్త దృశ్యాలను, విమర్శలను ఈ కథలో చాలా నైపుణ్యంతో చిత్రించాడు రాఘవ. మానవ ప్రవృత్తుల ప్రస్తావనే చేసినప్పటికీ, ఈ కథలో వ్యక్తులు స్పష్టంగా కనబడతారు.

సాహిత్య విమర్శలో తరచూ కనిపించే కాలక్షేప దృష్టి, తీర్పులు ప్రకటించే అహంభావం, విదేశీ రచయితలను ఉటంకించే వోకడ, చాలా పేరుపడిన హిందీవిమర్శకుల రాగద్వేషాలు మున్నగు సాహిత్యారిష్టాలన్నీ ఈ కథలో ఆసక్తికరంగా చిత్రించబడ్డాయి. ఈ అసంపూర్ణ ముద్రితకథ గురించి, 'రణ్ ఛోడ్ దాస్' వ్యాఖ్యలోని కొంత అంశం ఇక్కడ ఉదాహృతం.

"నేను కొన్నిరోజులక్రితం దేవకీనందన్ ఖత్రీ రాసిన చంద్రకాంత సంతతిలోని జాతీయజాగృతికి సంబంధించిన దానిని బట్టి 'నయాకహానీ" (కొత్త కథ) ఎలా ఉండాలో స్పష్టపడి వోయిందనుకుంటాను. ప్రేమ్‌చంద్ వారసత్వాన్ని కొనసాగించాలని చాలాకాలంగా చెబుతూనే ఉన్నాను. ఈ దృక్పథమే మన ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోగలదు."

['మేరీ ప్రియ్ కహానియా'; పేజీ – 21]

దేవకీనందన్ ఖత్రీ రూపంలో కొత్తవిలువలకోసం, పాతను ప్రతిష్ఠాత్మకంగా కోరుకోవడం, ప్రేమచంద్ పేరిట, విమర్శకుల్లో రాగద్వేషాలు, రచనలో అహంభావం, అధికారదర్పం ప్రదర్శించడం వగైరా అంశాలన్నీ రామ్‌విలాస్ శర్మవైపు స్పష్టంగా వేలెత్తి చూపుతాయి. కేవలం ఆయా విమర్శకులపేర్లను కాకతాళీయంగా పేర్కొని వదిలివేయలేదు. వాటితో పాటు గుర్తింపులకోసం. వాటి స్థలపురాణాలను రచనలోకెక్కించాడు రాఘవ. నిరాలా (కవి)ని ప్రస్తావించే సందర్భంలో కొబ్బరికాయల సందును, రామ్‌విలాస్‌శర్మను ఉటంకించినప్పుడు 'లఖ్నవ్‌లో'నితులసీవనకుటీరాన్ని పేర్కొని విమర్శించదలచినవారికి విమర్శ అంటే ఏమిటో స్పష్టం చేశాడు. యశపాల్ సాహిత్యంలో విస్తృతంగా కనిపించే లైంగికప్రవృత్తిపట్ల ఆక్షేపణను మార్క్సిస్టు శాస్త్ర పండితుల విప్లవ వల్లెవేతను ఉటంకించి, రాఘవ చెప్పదలచుకున్నదాన్ని స్పష్టం చేశాడు.

అదే విధంగా క్షేమరాజ్ మార్క్సికవాదాన్ని, జైనేంద్ర కుమారుని భంగపాటును రాఘవ తన విమర్శలో సంకేతంగా చెప్పాడు. ఈ విధంగా అసంపూర్ణంగా రాయడంవల్ల రాఘవ కొంత చెప్పికూడా చెప్పనివాడయ్యాడు. ఆచార్య భగవతీ ప్రసాద్ శర్మలో రవీంద్రుని సాన్నిహిత్యంవల్ల హజారీ ప్రసాద్ ద్వివేదీలో సంకేతాలుభిస్తాయి. కథను చదివీ చదవనట్లు చూశామని చెబుతారు కూడా. సాహిత్యంలో ద్వేషాన్ని చెడుగా భావిస్తారు. ఈ ద్వేషభావంతో కాళిదాసును కూడా కిందికి పడవేయవచ్చు. కవిత్వాన్ని చదవకుండానే, కవిత్వం పొరుగులో దానిని నిర్లక్ష్యంగా పడవేయడం 'అకాడమిక్ విమర్శ'ల అలంకారికత. ఈ తీర్పులవల్ల హిందీసాహిత్యంలో ఒక కొత్తదశ ప్రారంభమయింది.

రామ్‌దులారీ విజయ్‌వర్గీయ్ [నంద్ దూలారీ వాజ్‌పేయ్ కూడా కావచ్చు] పేరుగల విమర్శకుడు రాసిన 'నయాసాహిత్య్ – నయే ప్రశ్న్' అనే విమర్శకు బదులుగా 'నయా సాహిత్య్ – నయీ సమీక్షా' అనే గ్రంథం రాయబడింది. ప్రచురణకర్త ఈ గ్రంథంపేరును, రచయిత పేరును, గ్రంథంలోని విషయాన్ని ఇష్టంవచ్చినట్లు మార్పులకు చేర్పులకు లోనుచేసి ప్రచురించడం వినోదంగా ఉన్నా, సాహిత్య విమర్శలో జొరబడిన అరాచకత్వాన్ని ఇది తెలియజేస్తుంది.

రాఘవ రాసిన "గదల్" 1955లో 'కహానీ' ప్రత్యేక సంచికలో ప్రచురింపబడినప్పుడు, సాహిత్య శిబిరాల్లో తుఫాను చెలరేగింది. ఈ కథకు సంబంధించిన అపూర్వ విజయాన్ని రాఘవ కొంచంభిన్నంగానే వ్యాఖ్యానించాడు. విమర్శకులు, సాహితీవేత్తలు రచనలను, సాహిత్యాన్ని చదవరనే ఆరోపణను రాఘవ ఈ వ్యాఖ్యద్వారా పునరుద్ఘాటించాడు. తన వాదాన్ని బలపరచుకుంటూ, రాఘవ "గదల్" లాంటి రచనలు తానింకెన్ని చేసినట్లు, వాటిని గుణగ్రహణ పారీణులైన విమర్శకులు చూడలేదని, పొరపాటుగా ఈ రచన వారి కంటపడిందని ఒక విసురు విసిరాడు. నిజమే రాఘవ కొన్ని మంచికథలే రాశాడు కాని 'గదల్' అన్నింటికన్నా చాలా మంచికథ.

ప్రేమచంద్ వర్ణించినట్లుగా గ్రామీణ వాతావరణాన్ని రాఘవ 'గదల్'లో వర్ణించలేదు. ఇందుకు సాంఘికమైన శాస్త్రీయ కారణాలున్నాయి. భౌగోళికంగా రాజస్థానం పరిసరప్రాంతం ఈ కథాదృశ్యం కావడం. 'గూజర్ సమాజం' [అహీర్ జాతి పాడి చేసే తెగ – గొల్లవారు – కురుమలు లాంటివారి సమాజం] ఆచార్య వ్యవహారాలవల్ల కూడా ఈ కథ నిర్దుష్టప్రాంతీయ వాతావరణ చిత్రణను సంతరించుకొని 'ఆంచలిక్' స్వభావాన్ని పొందింది. అందము గంధము అలుముకొని రక్తికట్టింది. ఈ కథలో నాటకీయమైన మనోరంజకత్వం మోతాదుకు మించి చోటు చేసుకున్నా, జీవం తొణికిసలాడే కథగా ఇది రాణించింది.

'గదల్' కథలో 'గదల్' ఒక స్త్రీపాత్ర. ఆమె కేంద్రంగానే కథ సాగుతుంది. ఆమె మరిది 'దోఢీపట్ల' ఆమెకు చాలా ఆత్మీయత, చెప్పలేని అనుబంధం ఉంటాయి. ఆ ప్రేమ, ఆత్మీయతలు ఉపేక్షవల్ల ఆమెకు తిరిగి లభించనప్పుడు, వయస్సులో ఉన్న కొడుకులను నిండిన సంసారాన్ని వదిలి, 'లౌహరామౌని' ఇంటివద్ద ఉండిపోతుంది. అశ్రద్ధ, అవమానాలవల్ల చెదిరెన మనస్సుతో 'గదల్' తనమరిది డోఢీతో అంటుంది.

"నీవు? – (ఆగి), మగవాడివా! అరే! – ఎవరైనా స్త్రీతో భయపడతారా?... ముందుకొచ్చి నన్ను కొట్టివుంటే, ఆత్మీయతను వెలిబుచ్చావని గ్రహించేదాన్ని.... నేనీ ఇంట్లోనే ఉంటాను...?"

['అదే పుస్తకం'; పేజీ – 163]

గదల్ లేకుండా మరిది డోఢీ ఒక్కరాత్రి కూడా ఉండలేకపోతున్నాడనే విషయం 'లౌహరా మౌని' ఇంటివద్ద వినగానే, ఇంటికప్పుతొలగించి చేరుకుంటుంది. మరిది తన పనిలో లగ్నమై విధులు నిర్వహించాలని కోరుకుంటుంది. బాహిరమైన ఉపేక్ష ఉన్నా గదల్ అతడితో పెనవేసుకొనివు న్న ఆత్మీయతలో తన్మయం చెందివుంటుంది. పోలీసులు ఒకవైపు కాల్పులు జరుపుతున్నా, నాటి నిషేధాజ్ఞలప్రకారం చట్టవ్యతిరేకమైనప్పటికీ "పెద్దకర్మ" పన్నెండవ రోజు (కారజ్) భోజనం ఏర్పాటు చేస్తుంది. తనమీద ఒట్టు పెట్టుకొని, నిహాల్, నారాయణులను, వారి భార్యాపిల్లలను, ఇంటి

వెనుకద్వారంగుండా బయటికి పంపివేస్తుంది. ఈ సందడిలో ఒక గుండు వచ్చి గదల్ పొట్టలో దూరుతుంది. అయినా ఆమె పట్టించుకోదు. కర్తవ్యనిర్వహణలో ఆమెకు కలిగే తృప్తి అపారమైనది. అదీ తాను లేకుండా ఒక రోజు కూడా బతకలేని వాడి కర్మకాండను పూర్తిచేయడంకోసం ఆమె తన ప్రాణాలను లెక్క చేయలేదు.

హిందీ అభ్యుదయసాహిత్యం మొత్తంలో ప్రయోగవైవిధ్యంకోసం, శైలీశిల్పాలను, రచనా సంవిధానాన్ని మార్చి, ఇదివరకే ఏర్పడిన రచనా సంప్రదాయాలను బద్దలుకొట్టి కొత్తమార్గం తొక్కిన ద్రష్టగా రాఘవ కనబడతాడు.

మానవ నాగరికతా వికాస సంపూర్ణత కోసం, రాఘవ "గాథల" ప్రక్రియను అన్వేషించి సాహిత్యంలోప్రవేశపెట్టాడు.

ప్రాగైతిహాసిక, పౌరాణిక నేపథ్యంలో 'మహాయాత్రా గాథల' రచనేగాక, మరెన్నో కథలను రాఘవ రచించాడు.

"పర్తోంకీపీడా" లాంటి కథలు శిల్పందృష్ట్యా నవ్యతను సూచిస్తాయి. "కార్తికేయ్" లాంటి కథలు వ్యాప్తివల్ల నవలలుగా తోస్తాయి. పౌరాణిక నేపథ్యంలో అధునిక విషయాలు చర్చిస్తాయి.

స్కెచ్, రిపోర్టులు, ఫీచర్లు మున్నగునవన్నీ అతని కథల్లో చోటు చేసుకున్నాయి. వీటివల్ల అక్కడక్కడా రసభంగం జరిగినా, విస్తృతి పెరిగినా, అవి ప్రభావితం చేయగల రచనలుగానే ఉన్నాయి.

'మృగతృష్ణ' చాలా పెద్దకథ. అయినా అందులో యుగసత్యాలు చాలానైపుణ్యంతో రాయబడ్డాయి కాబట్టి, లక్ష్యలక్షణాల సమన్వయంలో గొప్పదనాన్ని సంతరించుకొని, నేటికీ హిందీ సాహిత్యంలో ఒక ప్రత్యేకతగల కథగా అది నిలిచిపోయింది.

అతడి కథలో పెద్ద ఇతివృత్తాలు లేవు జయశంకర్ ప్రసాద్‌లాగా, సంభాషణలద్వారా రాఘవ కథ నడిపిస్తాడు కూడ. సంభాషణలు, అతడీ

కథలో నిర్వహించే పాత్ర మహత్తరంగావుంటుంది. కథను ముందుకు సాగిస్తాడు. పాత్రల వ్యక్తిత్వాలను, లక్ష్యాలను క్రమంగా విశదం చేస్తాడు. కథకు ఒకోసారి నిగూఢమైన నాటకీయతను కూడా తెచ్చిపెడతాడు. రాఘవలో సైద్ధాంతిక ప్రత్యేకతలు ఉన్నప్పటికీ, ప్రాగైతిహాసిక పౌరాణికనేపథ్యంతో కథలు రాయడంవల్ల అతని శైలిలో జయశంకర్ ప్రసాద్‌శైలి ముద్ర బాగాకనిపిస్తుంది. కథా రచయితగా రాఘవకు లభించిన ఉపలబ్ధి సామాన్యమైనది కాదు. రాఘవ రాసిన డజనుకు మించిన మంచికథల వల్లనాటి సమకాలీన కథా రచయితల్లో నేగాక, తర్వాతి తరంవారిలోను అతడు కథారచయితగా, సార్థకుడుగాను, ప్రాసంగికుడుగాను నేటికీ కనిపిస్తాడు. నిజాయతీకి గుర్తింపు ఎప్పుడూ లభిస్తుంది.

# 6. హిందీలో మార్క్సిస్టు సాహిత్య విమర్శ : రాంగేయ రాఘవ

1936లో 'అభ్యుదయ రచయితల సంఘం' [ప్రగతిశీల్ లేఖక్ సంఘ్] ఏర్పడ్డాక, దాని నిర్మాణం, అభివృద్ధి పట్ల ఎక్కువకృషి చేయడం జరిగింది. అభ్యుదయసాహిత్య స్వరూప స్వభావాలు, సాహిత్యానికి సమాజానికి ఉండే అవినాభావ సంబంధం, భారతీయ సాంస్కృతిక సాంప్రదాయంపట్ల సాహిత్య విమర్శ తీరుతెన్నులు, సాహిత్య వారసత్వం మున్నగు విభిన్న సాహిత్యాంగాలపట్ల నాటి యువవిమర్శకుల దృష్టి కేంద్రీకరింపబడింది.

ప్రకాశ్ చంద్రగుప్త్, శివదాస్ సింహ్ చౌహాన్, రాంవిలాస్‌శర్మ, చంద్ర బలిసింహ్, అమృత్‌రాయ్ [ప్రేమచంద్ కుమారుడు] మున్నగు యువరచయితలందరూ అభ్యుదయ సాహిత్యోద్యమానికి సంబంధించిన విభిన్నాంశాలపట్ల సైద్ధాంతిక వ్యాసాలు రాసి, దాని నిర్వచనాన్ని, ఆవశ్యకతను నిర్వహించాల్సిన పాత్రను స్పష్టం చేశారు.

అభ్యుదయ సాహిత్యోద్యమం పట్ల విపులంగా చర్చ జరిగింది. దానివల్ల రాజకీయమైన హద్దులను పరిమితంచేసే బదులు, అభ్యుదయవాదాన్ని విశాలదృక్పథంతో విస్తృతవేదికగా నిర్మిస్తే ప్రయోజనకరంగా ఉండగలదని ఆనాడు బాధ్యతగల ఉద్యమకారులు కొందరు భావించారు.

1945నుండి 1955 దాకా అభ్యుదయ సాహిత్యోద్యమంలో తీవ్రమైన మార్క్సియ చర్చలు కొనసాగాయి. అవగాహన లోపించడంవల్లనేమి, చర్చలు శృతిమించడంవల్లనేమి, పరస్పర రాగద్వేషాలు పెరగడం వల్లనేమి ఇదివరకటి నిజాయితీ తరిగి, ఉద్యమమే క్రమంగా ముక్కలైంది. అంతర్ వైరుధ్యాలమూలంగా, మార్క్సిస్టు అవగాహనాలేమివల్ల అభ్యుదయ సాహిత్యోద్యమమే భగ్నమై, మార్క్సిస్టు సాహిత్య విమర్శ కొందరి అహంభావంగా మిగిలిపోయింది. అది కూడా వారివారి పట్టుదలల కనుకూలంగా సాగి రచయితల సంఘటిత శక్తిని దెబ్బతీసింది.

కాశ్మీరు 'ప్రగతిశీల రచయితల సంఘం' సాహిత్య సమావేశంలో చదవబడిన ఆసక్తికరమైన నివేదికను శివదాన్ సింహ్ చౌహాన్ తన 'సాహిత్యాను శీలన్' గ్రంథంలో ప్రచురించాడు. ఈ నివేదిక ఆనాటి 'అభ్యుదయ యుగ' ఆలోచనావిధానాన్నీ, అవగాహననూ తెలియజేస్తుంది.

కాశ్మీరు సాహిత్యగోష్ఠిలో 'రహ్మాన్ రాహి' అనే అభ్యుదయ కవి 'మౌత్ ఔర్ దోశీజా' అనే సుదీర్ఘకవితను చదవగా, దానిపైన చెలరేగిన సాహిత్యచర్చ మరీ సిగపట్లలోకి దిగింది. చర్చలో పాల్గొన్నవారు ఆ కవిత్వాన్ని తూర్పారబడుతూ, ఉద్యమ నిర్మాణయుగంలో 'మృత్యువు' లాంటి నిరాశావాద అంశం మీద కవిత్వం రాయడం చదవడం వినాశకరమని తేల్చారు. 'మృత్యువు'ను పేర్కొని మానవత్వాన్ని అవహేళన చేసినట్లుగా కూడా ఆ కవిత ఉందని కొందరు అభ్యంతరం లేవదీశారు. కొందరు ఈ కవిత్వంలోని బలహీనతను బహిర్గతం చేస్తూ, "జీవితం", – పోరాడే తన శక్తిసామర్థ్యాలమీదగాక, మృత్యువు దయాదాక్షిణ్యాలమీద గెలుస్తుందని వ్యాఖ్యానించారు. విప్లవయుగంలో స్త్రీ ప్రేమమీద కవిత్వం రాయడంవల్ల ఆ కవిత్వం పార్టీ నిర్మాణాన్ని, ఉద్యమాన్ని నీరుగార్చగలదని కూడా మరికొందరు ఆగ్రహించారు. ప్రేమ ప్రణయ కవిత్వాలు ఉద్యమాలకు లాభం చేయకపోగా, నష్టంకూడా చేస్తాయని వారు హెచ్చరించారు. ఈ విధంగా ఔత్సాహికులందరూ తర్జన భర్జనలు చేసి, మొత్తంగా ఆ కవితా ఖండికనే 'అభివృద్ధి నిరోధకం' అని తీర్పుచెప్పారు. శివదాన్ సింహ్ చర్చ చివరలో జోక్యంచేసుకొని మాక్సిం గోర్కి రాసిన సుప్రసిద్ధకవిత "ది డెత్ అండ్ మేడమ్" అనే కవితకు ఇది అనువాదమని తేల్చిచెప్పాడు. ఆ తర్వాత చర్చలో నిశ్శబ్దం ఆవహించింది. ఇది చెప్పాక కొందరు. 'ఈ విధంగా తమను పరీక్షించి కించపరిచారని అభ్యంతరం లేవదీశారు. శివదాన్ సింహ్ మళ్ళీ జోక్యంచేసుకొని "ఈ కవిత్వంలోని యువతి జారుచక్రవర్తులకాంలోని [విప్లవం కన్నాముందున్న] యువతి అనీ, సోవియట్ల దేశంగా రష్యా అవతరించాక, చైతన్యవంతురాలైన కమ్యూనిస్టు యువతి ఆమె కాదని వివరించాడు. ఈ కవిత్వాన్ని విమర్శించేప్పుడు ఆ కవితాకాలంనాటి పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవాలని, తద్భిన్నంగా

సమీక్షిస్తే తప్పుడుభావాలు ఏర్పడుతాయని కూడా అతడు స్పష్టంచేశాడు. గోర్కీ రాసిన ఈ కవిత్వాన్ని స్టాలిన్ ఏవిధంగా మెచ్చుకున్నదీ కూడా చెబుతూ 'ఈ కవిత్వం మృత్యువుపై ప్రేమ సాధించిన విజయంగా ఉంది', ఆ దృష్ట్యా ఇది [జర్మన్ కవి] గేటే రాసిన 'ఫాస్ట్' కవితకన్నా శక్తిమంతమైనది అని వివరించాడు. అందువల్ల 'రహమాన్ రాహి' అనువందించిన గోర్కీ కవిత 'మౌత్ ఔర్ దోశీజా' ఖండిక దాని చారిత్రక నేపథ్యంలో అర్థంచేసుకోవాలని, శివదాన్ సింహ్ కోరాడు. తన నివేదిక చివర అతడు చేసిన ఈ కింది వ్యాఖ్య ఇక్కడ గమనార్హం. [దోశీజా = కన్య].

"కుత్సితతత్వం నిండివున్న వర్గసమాజంలో, శాస్త్రీయ దృక్పథాన్ని స్వీకరించిన మిత్రులు కొందరు తొందరపాటువల్ల ఆవేశపరులై, రాజకీయ సిద్ధాంత దృక్పథాన్ని చాలాసంకుచితం చేసేశారు. వారు సాహిత్యం, కళలను అర్థం చేసుకునే రసాస్వాదనా దృష్టిని, ఉత్తమాభిరుచిని సంస్కృతికి వ్యతిరేకమైన పోకిరీతనంగాను భావించారు. దాని పర్యవసానంగానే సాహిత్యంలో ఇష్టంవచ్చిన రీతిలో, రకరకాల స్వీయ మానసిక ధోరణుల కొలమానాలు వివేచనలో ప్రయోగంలోకి వచ్చాయి. సాహిత్యాన్ని వెలగట్టే మౌలికాంశాలు, కళా ప్రమాణాలు దృష్టినుండివైదొలగాయి. నాదృష్టిలో ఇంతవరకు సాగిన సాహిత్యచర్చంతా మన దురవగాహనలను బట్టబయలు చేశాయి. మన మిత్రులందరూ కృత్రిమమైన అవగాహనకు గురయ్యారు. సాహిత్యానికి, కళకు జవజీవాలు ప్రసాదించే మౌలికతత్వాల పరిజ్ఞానమేలేకుండా పోయింది. ఈ కారణంగానే వారి ప్రతిస్పందనలన్నీ సామాజిక వాస్తవికతకు భిన్నంగాను, యాంత్రికంగాను, ఏకపక్షంగాను మారిపోయాయి."

['సాహిత్యను శీలన్'; పేజీ – 179]

కాస్త సుదీర్ఘంగా సాగినప్పటికీ, కాశ్మీరు సభల చర్చలు అనేక విధాలుగా ప్రయోజనకరమైనవేకాక మహత్తరమైనవి కూడా. మార్క్సిస్టు సాహిత్యవిమర్శ తీరుతెన్నులు ఈ కాలంలో చాలా ఆత్మవినాశకరంగాను, భయావహంగాను కొనసాగాయి. ఫలితంగా 'అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాణం' ఇకపై

దరిదాపుల్లో కూడా సంభవంకాకుండా పోయింది. అనవసర విషయాల మీద పండితచర్చ పెరిగిపోయింది. ప్రతి విమర్శకుడూ ఈ కాలంలో మరొకడిని సాంఘికావగాహనలేని 'తప్పుడు శాస్త్రీయావాది' గా చిత్రించడానికి సర్వశక్తులూ ధారపోశాడు.

అభ్యుదయ సాహిత్యోద్యమం రెండవదశకంలో [1945−55] సాగిన తర్జన భర్జనల్లో ఇది వద్దు, అది వద్దు అనే 'నిషేధదృక్పథం' అభ్యుదయ సాహిత్య విమర్శలో ఆంతరంగికంగా పెరిగిపోయింది. ఈ 'నెగటివ్ ధోరణి'కి ప్రాతినిధ్యంవహించి, విధినిషేధాలు నిర్వహించిన విమర్శకుడు రామ్‌విలాస్‌శర్మ, ఇతడి విమర్శలవల్ల అభ్యుదయ సాహిత్యంలో 'ఆంక్షల వైఖరి' బలపడింది. ఆంక్షలు విధించే విమర్శలో రామ్‌విలాస్‌శర్మ అతిగా పనిచేశాడు. తత్ఫలితంగా ఉద్యమం దెబ్బతిన్నది. పుంఖానుపుంఖంగా వెలువడే అతడి హాస్యరచనల్లోని ఆంక్షలదృక్పథాన్ని, అనేక విషయాలమీద అతడు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ప్రతిఘటించడానికి ఒక సందర్భంలో కొందరు రచయితలు ఒక్కటై, తమ ప్రతిరచనలద్వారా రామ్‌విలాస్‌శర్మను ఎదిరించారు. ఉన్నదీ లేనిదీ కలిపి ఎక్కువ చేసి చెప్పేధోరణి, ఏకపక్ష వాదం కేవలం అభ్యుదయవాదుల్లోనే ఉన్నాయని కాదు. వారిని వ్యతిరేకించిన విమర్శకుల్లో కూడా ఈ అవగుణం ఉంది. ఆ చర్చలసారాన్నంతా ఇక్కడ చెప్పడం ఉద్దేశ్యం కాదు. కాని ఏ పరిస్థితుల్లో, ఏ సాహిత్య సంక్షోభంలో రాఘవ తన 'సాహిత్య విమర్శ' ప్రక్రియను ప్రారంభించాడనేది పరిగణనలోకి తీసుకోవాలి. అందుకే ఈ వివరణ.

హజారీ ప్రసాద్ ద్వివేదివలె, రాఘవ కూడా తన సృజనాత్మకరచనల్లో కొందరు లేవనెత్తిన ప్రశ్నలకు వారివారి ధర్మసందేహాలకు సమాధానాలీయడానికి సాహితీ విమర్శ ప్రక్రియను చేపట్టాడు. ఈ కారణంగానే అతడి సృజనాత్మక రచనలను, సాహిత్య విమర్శను వేరుచేసి చూస్తే భ్రమలు తప్పవు. అతడివిషయంలో సృజన, విమర్శ రెండూ భిన్నం కావు.

కథల విషయం వచ్చేసరికి అతిప్రాచీన సంప్రదాయమనేది లేనేలేదు.

వాటికి సంబంధించిన విస్తృత భావాల్లో విమర్శలు లేవు. మౌలికంగా రాఘవ కావ్యాలనే కేంద్రంగా తీసుకొని, 'సాహిత్యవిమర్శ' ప్రక్రియను కొనసాగించాడు. సంస్కృతి, తత్వశాస్త్రం, సాంఘిక శాస్త్రం, రాజనీతి మున్నగు సకలశాస్త్రాల లాభంపొంది తగిన సాక్ష్యాధారాలతో ప్రామాణికంగా సాహిత్యవిమర్శకు పూనుకున్నాడ నేది రాఘవ విషయంలో ఉల్లేఖనీయమే కాదు ప్రశంసనీయంకూడా. విభిన్నాంశాలమీద అతడు సాగించిన సాహిత్య విశ్లేషణలు ఉన్నత ప్రమాణాలు కలవి.

"భారతీయ్ పునర్జాగరణ్‌కీ భూమికా", "భారతీయ్ సంత్‌పరంపరా, ఔర్ సమాజ్" [మార్పి తిరిగి అభివృద్ధి చేసిన రూపం], 'సంగం ఔర్ సంఘర్ష్', 'కావ్య్ యధార్థ్ ఔర్ ప్రగతి' 'సమీక్షా ఔర్ ఆదర్శ్', 'కావ్య్ యధార్థ్ ఔర్ ప్రగతి', 'సమీక్షా ఔర్ ఆదర్శ్', 'కావ్య్ కళా ఔర్ శాస్త్ర్', 'మహాకావ్య్ వివేచన్', 'ఆధునిక్ హిందీ కవితామె విషయ్ ఔర్ శైలి' మున్నగు సాహిత్య విమర్శనా గ్రంథాలేగాక, రాఘవ మరణం తర్వాత వెలువడిన అతడి పి.హెచ్.డి సిద్ధాంత (పరిశోధిత) వ్యాసం 'గోరఖనాథ్, ఔర్ ఉన్కా యుగ్', సంస్కృత హిందీ కావ్యాల అభివృద్ధి వికాసాల మూల్యాంకనం వగైరా సాహిత్య విశ్లేషణలకు సంబంధించిన ఉత్తమ విమర్శనా గ్రంథాలు 'ప్రాచీన్ కవితా ఔర్ ఉస్కా విశ్లేషణ్', వేదకాలనిర్ణయంతో పాటు, హిందీ సాహిత్యంలో బహూశా మొదటిసారి వైదిక యుగవాఙ్మయంలోని 'అంతర్వస్తువును లోతుగా పరిశీలించి విశ్లేషణ చేశాడు రాఘవ'. ఈ విషయంలో అతడి స్పష్టమైన అభిప్రాయాలు ఇలా ఉన్నాయి.

"వైదిక కాలంలోని కవిత్వం ఒక యుగానికి సంబంధించిన విశేష కవిత్వం ఏమీకాదు. ఇదంతా అప్పుడప్పుడూ రాయబడిందని కూడా చెప్పజాలం. మనకు లభ్యమైన వైదిక సాహిత్యమంతా, పురోహిత వర్గాలనుండి సంకలితమై లభించింది. పశుపోషణ జీవనకాలంనుండి రాజ్యాలపుట్టుకవరకు మనకు వేదాల్లో సమాచారం లభిస్తుంది."

['గ్రంథావళి 10'. పేజీ – 151]

ఆ తర్వాత రాఘవ రుగ్వేదంలోని పదిమండలాల 'విషయవస్తువును', రచయితలను విపులంగా చర్చించాడు. రుగ్వేదం లోని రుక్కులే మరోక్రమంలో 'సామవేదం'లో ఈయబడ్డాయి. సామవేదంలో ప్రార్థనలను పాడుతారు. 'యజుర్వేదంలో యజ్ఞ ప్రాధాన్యం' ఉంది. వైయక్తిక సాధనాపరిశీలనే 'అథర్వణవేదం'. వేదాలలోని కాండలు. సూక్తాలు, మండలాలు, మంత్రాలు మున్నగు శాఖలను వివరిస్తూ, భారతీయ సాహిత్యంలో వేదాల ఆమోదాన్ని వివరిస్తూ రాఘవ చేసిన వ్యాఖ్య మిక్కిలి ప్రాముఖ్యత కలది.

"భారతీయ సంస్కృతిలో వేదాలు సదాప్రేరణా స్రోతస్వినులు. ప్రాగైతిహాసిక కాలంనుండి నేటిదాకా వేదాలు పూజనీయాలయ్యాయి. అందుకు ముఖ్యకారణం ఇతర మత గ్రంథాలలాగా వేదాలు ఏక పక్ష సిద్ధాంతాలు కాకపోవడమే. వేదాల సందేశం బహూవ్యాప్తమైనది".

రాఘవ చాలావిపుంలంగా వేదాలలోని రుక్కులను ఉటంకించి, వాటికి అర్థతాత్పర్యాలను వివరించాడు. 'అపౌరుషేయాలు'గా భావింపబడే వేదాలలో దేవతల దైనందిన జీవనం, మానవుడికి దగ్గరగా కనిపించే పరిజ్ఞానంగా ఉంది. వేదాలు కేవలం ఆర్యసంస్కృతి చిహ్నాలు కావని రాఘవ వాదిస్తాడు.

వేదాలలో అనేక జాతుల పరస్పర ప్రభావ విశేషాలున్నాయని, ఒక జాతివల్ల మరోజాతి ప్రభావితమై అలవాట్లు, ఆలోచనల్లో, విశ్వాసాల్లో, జీవితవిధానంలో మార్పులు చేర్పులు జరిగాయని, చరిత్ర పరిణామక్రమంలో, సామాజిక దశల వికాసంలో ఒక జాతిమతవిశ్వాసాలు మరో జాతిమతవిశ్వాసాలుగా మారుతూవచ్చాయని, ఈ పద్ధతినే "అంతర్భుక్తివాదం"గా భావించాలని రాఘవ వివరించాడు. ప్రాచీన సాహిత్య సంస్కృతుల వికాస క్రమాల విశ్లేషణలో, వాటి మూల్యాంకనంలో మార్క్సీయ అవగాహనా ప్రాసంగికతను కూడా రాఘవ ప్రస్తావించాడు. కేవలం వర్గపోరాటాలదృష్టితోనే ప్రాచీన సాహితీ సంస్కృతులను వెలకట్టడం సాధ్యపడదని అతని భావన. ఎవరైతే సాంప్రదాయాల వివేచనలో

'యాంత్రికదృష్టి'ని అనుసరించారో వారివల్ల భ్రమలు, అర్థంలేని వివాదాలు తలెత్తాయని రాఘవ హెచ్చరించాడు.

"మార్క్సిస్టు విమర్శకుడు కేవలం వర్గపోరాటంవరకే పరిమితమవు తాడు. తత్వశాస్త్రవిషయాలకు సంబంధించిన అనుభవాలను, అనుభూతులను పరిశీలించినా, అతడు వర్గజీవనాన్ని ఆధారం చేసుకుంటాడు. కాని విమర్శ అంతటితోనే అయిపోదు. వేదాల్లో లభించే సమగ్రమానవుడిని చూడాల్సివుంది. ఆ మానవుడు మౌలికంగా మంచికోరికలతో ప్రేరితుడైన మానవుడు. వాడిలో 'వర్ణదంబం' ఉంది. వాడిలో [ఆర్య, ద్రవిడ వగైరా] జాతి అభిమానము ఉంది. అయినా, తరం తర్వాత తరంలో, ఆ మానవుడు ముందుకు సాగిపోవడానికి ప్రయాత్నిస్తూవు న్నాడు. శతాబ్దాల కావ్యసంగ్రహమైన వేదాల్లో హోమాన్ని వాటి కుండాల పొగను, సకిలించే జవనాశ్వాలను. వాటి వెనుక శాస్త్రాలను హుంకరించే అహంకారులైన యోధులను మాత్రమే చూస్తాము. అగ్నిగుండం నాలుగువైపులా, గడ్డాలు మీసాలు పెరిగిన బలిష్టమానవుల సమిష్టిస్వరంలో గానం చేయడాన్ని కూడా చూస్తాము."

['గ్రంథావళి – 10'; పేజీ – 166]

ఆ తర్వాత శతాబ్దాల నదీప్రవాహాల నీటి ఉపరితలంపై తేలియాడే అందమైన సుగంధ కావ్యాలు 'శాశ్వత ప్రభావాలు' కలవిగా రాఘవ ప్రస్తావిస్తాడు.

భారతీయ కావ్యాల పరంపరలో శాశ్వతమైన విలువలు గల సత్యాలుగా ఒకచోట పురూరవుని కరుణామయమైన పిలుపు ఉంటే. మరోచోట యమీ యమల సంవాదంలో, విషయ వాంఛలు కర్తవ్యాలుగా ముందుకు వచ్చే ద్వంద్వాల ఉదాత్తచర్చ కనిపిస్తుంది. నేటికీ ఈ విషయాలు అలాగే ఉన్నాయి.

వేదకాల సాహిత్య స్వరూపస్వభావాలనువ్యాఖ్యానించినట్లు రాఘవ 'మహాభారత' మూలగ్రంథాన్ని ఆధారం చేసుకొని, 'ప్రాసయుగం'

[క్షీణయుగం] సాహిత్యంగా దానిని విస్తృతంగా వ్యాఖ్యానించాడు.

రాఘువ తన "అంతర్భుక్తిసిద్ధాంతా"న్ని ఆధారం చేసుకొని, మహాభారతం కేవలం ఆర్య సంప్రదాయానికి చెందిన గ్రంథంకాదని, నాగ, అసుర, యక్ష, గంధర్వ, కిన్నెర, రాక్షస, దానవ మున్నగు విభిన్న ఆర్యేతర జాతుల సాంప్రదాయం కూడా అందులో 'అంతర్భుక్తమై' ఉందని వివరించాడు. రచయిత నిష్పాక్షికతా దృష్టితో చూస్తే, ఇది ఒక అపూర్వమైన వివేచన. రాఘువ తన ఈ వివేచనలో మనిషిని రక్తమాంసాలు గల సజీవమానవుడిగానే చిత్రించాడు. ఆ కారణంగానే ఇందులో 'పాలతో కడిగిన పాత్ర లభించదు'. మహా భారత రచనమీద వ్యాఖ్యానిస్తూ రాఘువ చెప్పిన మాటలు గుర్తుంచుకోదగినవి.

"విషయ పరిజ్ఞానం దృష్ట్యా మహాభారతం ఆకాశమంత విస్తృతం. కాళిదాసు, భారవి, మాఘుడు మున్నగు ప్రాచీనకవులేగాక, ఆధునికులు మహాభారత రచననుండి ప్రేరణపొందారు.... మహాభారతంలో మతం 'లౌకిక జీవనం (సెక్యులర్)గా వ్యక్తమైంది. మనిషి మానవత్వాన్ని ప్రధానంగా చూపడంచేత, మహాభారతం సర్వోత్కృష్టంగాను, సార్వకాలిక ప్రేరణగాను జీవించివుండగలిగింది, ఇకపై జీవించివుండగలదు కూడా..."

['గ్రంథావళి – 10'; పేజీ – 187]

మానవత్వపు గుర్తింపుగా మహాభారతాన్ని పరిశీలించాక, రాఘువ 'నాథ–సిద్ధ' సాహిత్యాల గురించి వివేచించాడు. తన గ్రంథంలో 'గోరఖ్‌నాథ్ ఔర్ ఉన్‌కాయుగ్' పేర సాగిన మహత్తర పరిశోధనా గ్రంథరచనలో 'నాథపరంపర' సాహిత్యానికి మహోత్కృష్ట సేవ చేసినట్లుగా కూడా రాఘవ వివరించాడు.

హర్షవర్ధనుడి తర్వాత మహమ్మదీయులరాక దాకా సాగిన కాలం ఒకభాగం [ఖండరూపం]గా చాలా అస్పష్టంగానే పరిశీలించబడిందని రాఘువ అభిప్రాయం.

"తులసీదాస్ గురించి తెలుసుకునే సందర్భంలో ఆ కాలపు

రాజ్యవ్యవస్థ రాజనీతి, మతం, దర్శనాలు, కళలు మిగతావిషయాల పరిజ్ఞానం ఎలా అవసరమో, ఆ విధంగానే గోరఖ్‌నాథ్ విషయంలో కూడా అంతే అవసరం. గోరక్షుని (గోరఖ్‌నాధుని) చరిత్ర నాటి అయిదువందల సంవత్సరాల చరిత్ర. ఆ అయిదువందలసంవత్సరాల చరిత్రను గోరక్షుని జీవితంద్వారా చూడవచ్చు."

["గోరఖ్‌నాథ్ ఔర్ ఉన్కాయుగ్" – భూమిక]

తన పరిశోధిత గ్రంథంలోను, గోరఖ్‌నాథ్ జీవితాన్ని ఆధారం చేసుకొని రాసిన 'ధూనీకా ధువా' జీవిత చరిత్రాత్మక నవలలోనూ రాఘవ తన ఈ భావాలనే ప్రతిష్టించడానికి ప్రయత్నించాడు.

'గోరఖ్‌నాథ్ ఉన్‌కాయుగ్' లోని అంతర్ వైరుధ్యాల గురించి డా॥ ప్రభాకర్ మాచ్వే కొంతచర్చ చేశాడు.

"రాఘవలో వైష్ణవసంస్కారం ఉంది. మార్క్సిస్టుల ఆలోచనవిధానం అతని చింతనలో చోటుచేసుకుంది. 'సాహిత్యం' పేర ఉన్న అధ్యాయాల్లో ఈ ద్వంద్వాలు ప్రస్ఫుటంగా ముందుకు వస్తాయి. ఒకవైపు శాస్త్రీయ భౌతికవాదదృష్టితో రాఘవ గోరఖ్‌నాథ్ సమయం, సదర్భం, సమాజాలను పరిశీలిస్తాడు. మరోవైపు గోరఖ్‌నాథుని 'మార్మికతత్వా'న్ని, మూఢమైన 'మాంత్రికశక్తి'ని, అందలి విశ్వాసాన్ని అర్థం చేసుకోవడంలో కలవరపడి పోతాడు. రెండువైపులా అతడి మనసు లాగడంవల్ల, తన అభిప్రాయం చెప్పే సమయం వచ్చేసరికి రాఘవ స్పష్టంగా చెప్పలేక పోతాడు. ఒకవేళ రాఘవ బతికివుండివుంటే అతడు తప్పక తన 'పరిశోధిత ప్రబంధా'న్ని [సిద్ధాంతగ్రంథాన్ని] సవరించి ప్రచురించేవాడు."

['రాంగేయ రాఘవ్ కా రచనా సంసార్'; పేజీ – 199]

రాఘవ గోరఖ్‌నాథుని కవిత్వంవల్ల చాలా ప్రభావితుడయ్యాడు. తన వ్యక్తిత్వాన్ని కూడా గోరఖ్‌నాథుని వ్యక్తిత్వంలా మలచడానికి ప్రయత్నంచేశాడు. మతం, జాతి, పట్టింపులనుండి విముక్తిపొందడం, గృహస్థజీవన లంపటత్వంనుండి వైదొలగి, సర్వస్వతంత్రంగా బతకాలని

మానవసంఘాన్ని కాపాడడానికి సర్వశక్తులూ ధారపోసి, ఎదురొడ్డి కవచంలా నిలిచి విలువలను కాపాడబూనడం వగైరా లక్షణాలన్నీ గోరఖ్‌నాథుని భావప్రేరితాలేనన్నది యథార్థం. అతడిలో అంతర్లీనంగా గోరఖ్‌నాథుడే ఆవరించి వున్నాడనేది కూడా నిజం.

'భక్తి ఉద్యమం' వల్ల వచ్చిన పరిణామాలను పరిశీలిస్తూ రాఘవ, అది నిర్వహించే సాంఘికపాత్రలపట్లే ఎక్కువ శ్రద్ధచూపాడు. భారతదేశంలో 'భక్తివుద్యమం రావడం, విస్తరించడం అనేది క్రైస్తవమత ప్రసాదమని గ్రియర్సన్ వాదాన్ని నమ్మినవారు కొందరు, ఇస్లాంమతవ్యాప్తికి వ్యతిరేకంగా వచ్చినదే 'భక్తి ఉద్యమం' అని రాంచంద్ర్ శుక్లాలా విశ్వసించేవారు మరికొందరు. రాఘవ ఉభయవాదనలతోనూ విభేదిస్తూ తన సొంతభావాన్ని చెప్పాడు.

''క్రైస్తవ మతంవల్ల కాని, ఇస్లాంమతంవల్లకాని 'భక్తి ఉద్యమం' భారతదేశంలో ఉనికిలోకి వచ్చి బలపడలేదు. ఈ రెండు మతాలకన్నా చాలాపురాతనమైనది 'భారతీయ భక్తి ఉద్యమం' భక్తి ఉద్యమం మానవతావాద ఉద్యమం. ఈ ఉద్యమం వైదికయుగంలోని సంకుచితత్వాన్ని తుదముట్టించింది. అంతేగాక వైదికయుగంలోని భయంకర దేవతా రూపాల స్థానంలో అందమైన దేవతామూర్తులను సృష్టించింది ఈ 'భక్తి ఉద్యమం'. ఈ ఉద్యమం ఆర్య-అనార్య జాతివిబేదాలను తొలగింపజేయడానికి ప్రయత్నించింది. పరమాత్మనిరూపంలో మానవుడి సర్వశ్రేష్ఠగుణాలను ఉదాత్తంగా వ్యాఖ్యానించ ప్రయత్నించింది ఈ ఉద్యమం. దీని ఔదార్య ఫలితంగానే భారతీయ సమాజం ఆ తర్వాత 'యవనులనుండి' 'హూణులు' దాకావచ్చిన వారినందరినీ తనలో ఇముడ్చుకుని 'అంతర్భుక్తం' చేసుకుంది. ఈ కారణంగానే, ఆతర్వాతి భూస్వామ్య సమాజంలో జాతులవైరాలు సన్నగిల్లాక, అగ్రవర్ణాల దాడినుండి ప్రజలను భక్తివుద్యమం కాపాడగలిగింది.

('గ్రంథావళి – 10; పేజీ – 208–209)

ఈ గీటురాయిమీదే రాఘవ 'సంత్ కవుల' మానవతావాద

నిర్వహించాయో రాఘవ విస్తృతంగా చర్చించాడు. తక్కువ జాతులన బడేవారిద్వారా ప్రారంభమైన 'జనజాగృతి ఆందోళన' భక్తివుద్యమం సాధించిన ప్రముఖ వైశిష్ట్యంగా నిలిచిపోయింది. దాని ప్రభావం సమాజంలో చాలాకాలందాకా కొనసాగింది.

మధ్యయుగాల సాహిత్యంలో తులసీదాస్ – ఆధునిక హిందీ విమర్శకుడైన రామ్‌చంద్ర్ శుక్ల్, మార్క్సిస్టు విమర్శకులకు మధ్య చాలావివాదగ్రస్తంగానే ఉండిపోయాడు ఒకవైపు ఆచార్య రామ్‌చంద్ర్ శుక్ల్ పరంపరలోనే మార్క్సిస్టు విమర్శకుడు రామ్ విలాస్ శర్మ తులసీదాసు జనవాదం దృష్ట్యా అతనికి గొప్పదనాన్ని ప్రతిపాదించాడు. లోకోన్ముఖస్వరూపమైన తులసీదాసు భక్తిని వివరిస్తూ, మానవీయ సహానుభూతి అంతఃకరణలేగాక, తులసీదాసు సాహిత్యం భూస్వామ్య వ్యతిరేకవిలువల స్వభావం కలదని కూడా రామ్‌విలాస్‌శర్మ వ్యాఖ్యానించాడు. రాహుల్‌సాంకృత్యాయన్, రాఘవ, మిగతా అభ్యుదయ సాహిత్య విమర్శకులు తులసీదాసును 'వర్ణాశ్రమ ధర్మసంరక్షకుడు'గా భావించి కబీరుతో పోల్చినప్పుడు, తులసీదాసు సాహిత్యం 'యథాస్థితి' వాదాన్ని బలపరుస్తుందని స్పష్టంచేశారు. ఇలాంటి చర్చల్లో సహజంగానే ఏకపక్షభావాలే ముందుకు వస్తాయి. ఎందరినో ఎంతగానో ప్రభావితం చేసిన, చేయగల మహాకవి తులసీదాసును, అతడిలో కనిపించేవై రుధ్యాలను అతడి సంపూర్ణత్వంలో చూడక కేవలం ఒక భాగాన్నే చూసి వ్యాఖ్యానించడంపొరపాటేకాగలదు. ఒకవైపు రాహుల్ సాంకృత్యాయన్ తులసీదాసును 'భూస్వాముల కుక్క' [భూస్వామ్య సంస్కృతికి నమ్మకమైన బంటు] అని అంటే, మరో వైపు రామ్‌విలాస్ శర్మ భూస్వామ్య వ్యతిరేకవిలువలను రక్షించడంలో విప్లవాత్మకమైన పాత్రను నిర్వహించేవాడిగా తులసీదాసును ఘనంగా పేర్కొన్నాడు. తులసీదాసును అభ్యుదయగామిగా చిత్రించిన రామ్‌విలాస్‌శర్మ అతడికావ్యాల్లో మిక్కుటంగా కనిపించే స్త్రీ, శూద్రనిందలు 'ప్రక్షిప్తాల'ని దాటచేశాడు.

రాఘవ తులసీదాసును అతివాదధోరణిలో వ్యాఖ్యానించకపోయినా, ఆక్షేపణలను సంధించడంలో మాత్రం మిగతా వారికేమీతీసిపోలేదు.

రామ్‌విలాస్‌లాగా అతడుకూడా తులసీదాసును 'వర్ణవ్యస్థసంరక్షకుడిగాను, రామ్‌చంద్ర శుక్లాను బ్రాహ్మణవాదిగాను పేర్కొన్నాడు.

తులసీదాసును 'వర్ణవ్యవస్థారక్షకుడి'గా నిరూపించడంవల్ల అతడి సమర్థకులైన ఆధునికుడు ఆచార్య రామ్‌చంద్రశుక్ల, మార్క్సిస్టు విమర్శకులైన రామ్‌విలాస్ శర్మ సహజంగా బ్రాహ్మణ పక్షపాతులవుతారనేదే రాఘవ వాదనీతి.

ఏది ఏమైనప్పటికీ, సంస్కృతాన్ని వదిలి, ప్రజా భాషలో కావ్యాలు రచించినందుకైనా తులసీదాసును మెచ్చుకోవడానికి, కీర్తికిరీటం తగిలించడానికి రాఘవ అంగీకరించలేదు. అమోఘమైన అతడి తర్కం అనితరసాధ్యం.

"గౌతమబుద్ధుడు యుగవిప్లవాన్ని [బౌద్ధధర్మాన్ని], బ్రాహ్మణ సాంప్రదాయాన్ని [వర్ణవ్యవస్థను] భాషలో కూడా స్వీకరించడానికి ఇష్టపడలేదు. [అగ్రవర్ణాలభాష అయిన సంస్కృతాన్ని స్వీకరించలేదు]. చాలాకాలంతర్వాత, సిద్ధులు, నాథులు [పాడుతూ ప్రచారం చేసే మునికవులు] బుద్ధుని సాంప్రదాయాన్నే కొనసాగించారు. కబీరు, జాయసీకవుల్లో కూడా ప్రజాభాషాప్రవాహం కట్టలుతెంచుకు ప్రవహించింది."

['గ్రంథావళి – 10'; పేజీ – 217]

ప్రజాభాష గురించి పై ప్రస్తావనను వదలివేసినా నిజంగా ఆ కవులు ప్రజాభాషలో ఏమి రాశారు? ఈ కవులు [కబీరులాంటివారు] ఆడంబరంగా మతంపేర బతికే ఛాందస బ్రాహ్మణులను ఎక్కడా ఖండించలేదు, నిందించలేదు. ఈ కవులు ఏనాడూ. స్త్రీలు, శూద్రులపట్ల సాహానుభూతిని ప్రకటించలేదు. ప్రజాభాషలో రాసినంతమాత్రానే అంతా అయిపోతుందా?

"అన్నిటికన్నా మించిన నిగూఢరహస్యం తులసీదాసు హిందీని ప్రజాక్షేమంకోసం కాక బ్రాహ్మణవాద పునస్సంఘటన కోసం వినియోగించాడు."

['గ్రంథావళి – 10'; పేజీ – 218]

రాఘవ తులసీదాసును 'పురాణాకారంగా చిత్రించి విలువ తగ్గించే ప్రయత్నం చేశాడు. అభ్యుదయశీలంగా వామపక్షీయులకు కనిపించే అంశాలను అతడు బ్రాహ్మణవాదసమర్థనలకు సాక్ష్యాలుగా పేర్కొన్నాడు. కవిగా తలుసీదాసు చేసిన జీవన సంఘర్షణను విస్మరించి, రాఘవ వ్యాఖ్యానించినతీరు సర్వజనాంగీ కారంగా లేదు.

"రామనామప్రతాపంతో, ఎంగిలి తినే తులసీదాస్, తన జీవితకాలంలోనే ఉన్నతవర్గాల భుజస్కంధాలమీద ఊరేగ గలిగాడు. గజారోహణలు చేయగలిగాడు."

['గ్రంథావళి – 10'; పేజీ – 228]

తులసీదాసు పాండిత్యంగురించి, ఆయన అవసరాల మేరకు అతడు అన్వేషించిన కావ్యవస్తువుగురించి, రామాయణ రచనలో అతడు ప్రదర్శించిన నిగూఢమైన వివేకాన్ని గురించి రాఘవ గొప్పగానే ప్రశంసించాడు. తులసీదాస్ సంసారాన్ని త్యజించిన త్యాగధనుడు, సంస్కర్త. కానీ కబీర్‌లాగా అన్ని వ్యామోహాలూ వదిలి ప్రజల సంక్షేమమార్గంలో విప్లవాత్మకంగా పయనించిన నిష్కామకర్మయోగి మాత్రంకాదు అని తేల్చేశాడు రాఘవ.

'ఆధునిక్ హిందీ కవితామే ప్రేమ్ ఔర్ శృంగార్'; ఇంకా 'ఆధునిక్ కవితామే విషయ్ ఔర్ శైలి' పేర రాఘవ వెలువరించిన సాహిత్యవిమర్శలో అతడు ప్రామాణికంగా వెలకట్టిన పద్ధతి కట్టుదిట్టంగా లేదు. లోతుగా పరిశీలించినట్లుగా కూడా కనిపించదు. ఆయాపత్రికల్లో సర్వసాధారణంగా .ప్రచురింపబడే మామూలు కవితలను ఆధారం చేసుకొని చేసిన విశ్లేషణలు మన అవగాహనను ఏమాత్రం పెంపొందించవు.

రాఘవ తన లేఖల్లో సాహిత్యానికి, రాజకీయాలకు ఉండే అవినాభావసంబంధాన్ని, వ్యక్తిగత స్వేచ్ఛ, ప్రజాసంక్షేమం, పార్టీ క్రమ శిక్షణ, చారిత్రకయధార్థ దృష్టి మున్నగు సైద్ధాంతిక విషయాల నెన్నింటినో విపులంగా చర్చించాడు. సాహిత్యంలో రచయిత ఏవైపు మొగ్గుచూపు

తాడో అనేదానిమీదే అతడి 'కమిట్‌మెంటు' [నిబద్ధత] స్పష్టమై, రాజకీయవైఖరి నిర్ణయింపబడుతుంది.

"మానవుడు ఎప్పుడూ రాజకీయాలతో ముడిపడివున్నాడనే విషయాన్ని ప్రజానుకూల [జనవాద] అభివ్యక్తి స్పష్టం చేస్తూనేవుంది. ఇకపైకూడా మానవుడు రాజకీయాలకు అతీతంగా ఉండలేడు. రాజకీయాలు, సాహిత్యం పరస్పర ఆశ్రితాలై. ఉన్నప్పటికీ, రెండింటి అభివ్యక్తిలోను, పరిస్థితిలోను, కార్యరంగంలోను భేదాభిప్రాయం ఉండితీరుతుంది. . రాజకీయాలకు ఇంతగా ప్రాముఖ్యతనిచ్చే మనం కూడా రాజకీయాలకుండే పరిమితులను కూడా దృష్టిలో ఉంచుకొనక తప్పదు."

['గ్రంథావళి – 10'; పేజీ – 284]

అతి సామాన్యంగా విసిగించే రోజువారీ సంఘటనలమీద మాత్రమే రాసి, 'యుగధర్మం' నిర్వర్తించినట్లుగా భావించే రచయితల భాధ్యతల అనివార్యమైన షరతులను రాఘవ ఏనాడూ ఆమోదించలేదు. ఈ సందర్భంలో అతడు గోర్కీమైకోవస్కీల విభేదాన్ని చూపేవాడు. 'సామయిక రచనలమీదే కేంద్రీకరించిన మైకోవస్కీ, టెలిఫోనులో సంపాదకులను సంప్రదించి నాటి కవితావస్తువును అడిగి తెలుసుకొని రాసేవాడు. గోర్కీ విప్లవానికి ముందు – మానవుడి స్థైర్యాన్ని, పోరాడే సంకల్పాన్ని కేంద్రంగా చేసుకొని రచనలు చేసేవాడు. 'స్టాలిన్ యుగం'లో రాయబడిన రాష్యానవలలు, టాల్‌స్టాయ్, హోవర్డ్ ఫాస్ట్ రచనలకన్నా ఎందుకు ప్రభావరహితంగా, యాంత్రికంగా కనిపిస్తాయి. దీనికి సమాధానం చెబుతూరాఘవ ఇచ్చిన స్పష్టీకరణ అతని అవగాహనా పరిమితులను తెలియజేస్తాయి.

"కారణం! నవీన రష్యా సాహిత్యంలోని పాత్రలు పార్టీ చెప్పిన సత్యాన్ని జనజీవనయధార్థ సత్యంగా మోస్తూ తిరుగుతాయి. అవి భోధకులుగా నిలుస్తాయి. జీవన వైవిధ్యాలకు సంబంధించిన అనుభూతులుండాల్సినచోట, లక్ష్యపరిశీలనలో తలమునకలవుతాయి. హోవర్డ్‌ఫాస్ట్ నవలల్లో పాత్రలుగాక, జవజీవాల మనుషులు కలుస్తారు

వారు తమ 'భావనాశక్తి' ద్వారా సంఘంలో ఆటుపోటులరూపంలో గుచ్ఛబడిన వైవిధ్యాన్ని అద్భుతంగా ప్రకటిస్తారు. ఆ మనషులు అధ్యాపకుల్లాగా పాఠాలు చెబుతూ, ఇది చేయాలి, ఇది చేయవద్దని ఆదేశించరు. ఆ మనుషులను పాత్రలుగామలిచిన సందర్భంలో అంతర్గతంగా అల్లబడిన నిగూఢమైన జీవనపాఠం అద్భుతంగా పైకి తేలివస్తుంది. ఆ రచనానైపుణ్యం ఇప్పుడు మరెక్కడా కనిపించదు."

['గ్రంథావళి - 10'; పేజీ 289]

రాఘవ సాహిత్యంలో 'వ్యక్తిస్థితి' గురించి వ్యాఖ్యానిస్తూ ఇలారాశాడు. "సాహిత్యంలో వ్యక్తి రావాలి ఉన్నత భావాలతో వర్ణింపబడాలి సామాజిక వ్యవస్థలో ఉంటువున్న వ్యక్తి బాహ్య పరిస్థితి చిత్రణ కాదు సాహిత్యం. ఆ వ్యక్తి అంతర్యాన్ని కూడా వర్ణించేది ఉండాలి సాహిత్యం"

['గ్రంథావళి - 10'; పేజీ - 89]

'పార్టీ (కమ్యూనిస్టుపార్టీకి) రచయితకు ఉండాల్సిన పరస్పర సంబంధాలగురించి రాఘవ చాలాసందేహాలతోనిండివుండడమేగాక, సదా జాగరూకంగా కూడా ఉండేవాడు. పార్టీని అభిమానించే అతడు ప్రజలపట్ల ప్రతిబద్ధుడైవుండడం రచయిత 'కమిట్‌మెంటు' [నిబద్ధత]గా భావించేవాడు. పార్టీవిధానాలు, అందులో పనిచేసే వ్యక్తుల ఇష్టప్రకారం వారి ఆశయాలమేరకు ఏర్పడిన అవగాహన మూలంగా త్వరత్వరగా మారిపోతాయి. మారుతూన్న పార్టీల పాలసీలమేరకు ఎప్పటికప్పుడు, సాహిత్య స్వరూపం అంతేవేగంగా మారజాలదు. సాహిత్యం మారినపరిస్థితుల్లో పనికిరాకుండా పోయే 'కరపత్రం' [పాంప్లెట్] లాంటిదికాదు. ప్రజాజీవన వికల్పంగా మరోపార్టీని స్వీకరించడానికి అది సిద్ధంగా ఉండదు. [మారే ఎత్తుగడలగురించి రాఘవ అవగాహన సరిగా ఉండకపోవడంవల్ల పార్టీపట్ల అతడు ప్రశ్నార్థకంగా ఉన్నాడు. ఆ విషయంలో పోరాడే బాధ్యత అతనికీ ఉందనేది అతడు గుర్తించలేదు]

రచయితమీద 'పార్టీ' అంకుశాన్ని కూడా రాఘవ అంగీకరించలేదు. ఈ పద్ధతి సరైనది కాదని. కూడా అతని అభిప్రాయం. అందుకతడు

ఉదాహరణలు పేర్కొంటూ, తులసీదాసు రచించిన ''రామ్ చరిత్ మానస్''ను ప్రచురించాలా వద్దా అనే నిర్ణయాన్ని అక్బర్‌దర్బారులోని మతాధిపతులైన ముల్లాలకు వదిలివుంటే తులసీరామాయణంలాంటి మంచి సాహిత్యం ఎన్నటికీ వచ్చేదికాదు. అలాగే సికిదర్‌లోడి వద్ద ''జీహుజార్'' అంటూ దాసానుదాసులుగా బతికేవారి అభీష్టానుసారం ''కబీరు రచనలు'' ప్రచురింపబడాల్సివుంటే, కబీరులాంటి కవులు వెలుగులోకి వచ్చేవారుకాదు. ఇంత గొప్పసాహిత్యం వెలువడేదికాదు.

'స్టాలిన్‌యుగం'లో జ్దానోవ్‌ద్వారా సోవియట్ రష్యా రచయితలపైన ఏ అంకుశమైతే వేసి బిగించడం జరిగిందో, దాని ప్రతిధ్వని చాలాసంకుచితంగా మారిపోయిన హిందీ అభ్యుదయ సాహిత్యోద్యమ రాజకీయ అవగాహనలో కూడా వినపడింది.

రాఘవ ఈ సంకుచితత్వాన్ని పూర్తిగా సిద్ధపడి ఎదిరించాడు.'ప్రగతిశీల్ సాహిత్యకే మాన్‌దండ్' అనే అతని అభ్యుదయ సాహిత్య లక్షణగ్రంథం రాఘవ చేసిన ఆ పోరాటానికి నేటికీ చారిత్రక ప్రాముఖ్యం ఉంది. వామపక్ష భావాల్లో సంకుచితత్వంవల్ల ఉత్పన్నమైన 'అతివాదం' నేడు కూడా అక్కడక్కడా అప్పుడప్పుడు తన ఒంటెత్తు పోకడను ప్రదర్శిస్తూవుంది. అది వామపక్ష ఉద్యమానికి, అభ్యుదయ సాహితోద్యమానికి, జనవాద సాహిత్య వికాసానికి వినాశకారి.

రాఘవ మౌలికంగా వామపక్షీయుడు, మార్క్సిస్టు, ప్రగతిశీలి అయినా, రచనాస్వేచ్ఛను కోరిన ప్రజారచయిత. భారతదేశ నిర్దుష్ట పరిస్థితుల కనుకూలంగా మార్క్సిజాన్ని అన్వయించి స్వతంత్రంగా ఆలోచించాలని కోరిన వాస్తవికవాది.

# 7. నాటకాలు – పత్రికారిపోర్టులు

నాటకాలు :

రాఘవ తరచూ ఒక ప్రక్రియనుండి మరో ప్రక్రియ వైపు మళ్ళేవాడు. ఏదైనా సుప్రసిద్ధపాత్రనో, సంఘటననో ఆధారం చేసుకొని, నవల రాయాలని అనుకుంటూనే, కవిత్వం లేక నాటకం రాయాలనే నిర్ణయం గైకొనేవాడు.

చారిత్రక పౌరాణిక పాత్రలను ఆధారం చేసుకొని ఎక్కువ రచనలు చేసినవాడు రాఘవ ఒక్కడే. 'స్వర్గ్ భూమీకా యాత్రీ', 'రామానుజ, 'విరూఢక్' అనే నాటకాలు 1949–1953 మధ్యకాలంలో రాశాడు.

హిందీ నాటకరంగ వికాసం దృష్ట్యా పరిశీలిస్తే ఈ నాటకాలు అందుకు దోహదపడేవిగా కనిపించవు. రాఘవ నాటకాలు ఒక రచయిత బహుముఖప్రజ్ఞకు, సృజనాత్మక శక్తికి దోహదంగా కనిపిస్తాయి. రచయిత అభివ్యక్తి, అవసరాల మేరకు తటస్థపడిన ప్రక్రియలుగా కూడా అవితోస్తాయి.

జయశంకర్ ప్రసాద్ 'కావ్యదృష్టి'తో ప్రభావితులైన కొందరు యువరచయితలు నాటకాన్ని నాటి నాటకరంగంతో జతచేయడానికి, ప్రసాద్ పద్ధతికి భిన్నంగా, నాటకరచనలో చురుకుగా పాల్గొన్నారు. జగదీశ్‌చంద్ర్ మాథుర్ రాసిన 'కోణార్క్', మోహన్ రాకేశ్ రాసిన 'ఆషాడ్‌కా ఏక్‌దిన్', ధర్మవీర్ భారతి రాసిన పద్యనాటకం 'అంధాయుగ్' వగైరా నాటకాలు నాటి ఔత్సాహిక నాటకరంగం ఆశయంమేరకే వెలువడ్డాయి.

రాఘవ రాసిన నాటకాలు, రచనావ్యాసంగం అశాంతినుండి వెలువడినవేకాని మరోటి కావు. పౌరాణిక, చారిత్రక పాత్రలద్వారా శేషప్రశ్నలకు సమాధానాలు వెదికే వేదననుండే ఈ నాటకరచనలు వెలువడ్డాయి. సత్యాన్వేషణకు సంబంధించిన అశాంతి, చరిత్రలో దొరకని సమాధానల వెదకులాట రాఘవ రచనలన్నింటిలోనూ సర్వేసర్వత్రా కనిపించే సత్యాలు.

'స్వర్గ్ భూమీకా యాత్రీ' :

'స్వర్గ్ భూమీకా యాత్రీ' నాటకంలో యుధిష్ఠిరుడు సరికొత్తపంథాలో ఆలోచించేట్లు చేస్తాడు రాఘవ. ద్రౌపదిలో ప్రతిహింసాభిలాష చెలరేగడం, జరిగిన అవమానంవల్ల సహజంగానే కనిపిస్తుంది. ద్రౌపది తన మిగతాభర్తలైన భీమార్జునులను కలిసి, కౌరవవినాశంకోసం వారిని రెచ్చగొడుతుంది. ఆమె యధిష్ఠిరుని చలనరహితమైన, ఉద్రేకంలేని శాంతస్వభావాన్ని వ్యంగ్యంగా విమర్శిస్తుంది కూడా. అయినా యుధిష్ఠిరుడు అప్రభావితుడై చలించకుండా ఉండిపోతాడు. అతడు కౌరవుల ప్రతీకారవిషయంలో స్పష్టమైన ధర్మదృష్టి కలిగివుంటాడు.

"ఇతరుల పాపాన్ని తిరిగి పాపంచేసి నిర్మూలించజాలము."

['గ్రంథావళి - 6'; పేజీ - 18]

మహాభారత తీవ్ర పరిణామాలకు మూలకారణంగా, యుధిష్ఠిరుడినే బాధ్యుడుగా భావిస్తుంది ద్రౌపది. అందుకు కారణం అతడు పౌరుషాన్ని ఏమాత్రం పాటించక, దాని అస్తిత్వాన్నే వంచించేదశకు వచ్చేస్తాడు. కౌరవుల అత్యాచారం కొనసాగినా, దానివల్ల దుర్దశ దాపురించినా అతడు చలించకపోవడం ద్రౌపదికి పురుషాకార పతనంగా తోస్తుంది. ఒకవైపు మండిపడే ద్రౌపది, మరోవైపు రోషావేశాలు పెంచుకున్న సోదరులందరూ వ్యతిరేకించినప్పటికీ, యుధిష్ఠిరుడు ఏకాకిగానే తనయుద్ధం తాను కొనసాగిస్తాడు. ధర్మానికి, నీతికి సంబంధించిన 'ధర్మయుద్ధం' అది. 'మానవ కల్యాణం' దాని వెన్నెముక. 'క్షాత్ర ధర్మదీక్ష' నిస్తూ ఒక సందర్భంలో యుధిష్ఠిరుడు పరీక్షిత్తుతో అంటాడు.

"క్షత్రియుండి 'ధర్మయుద్ధం'. కాని యుద్ధం తన తృష్ణను తీర్చుకోవడంకోసం చేయరాదు. హత్య చేయడం వీరత్వమూకాదు. శూరత్వమూ కాదు. అన్యాయం భరించరానంతగా పెరిగిపోయినప్పుడే ఖడ్గాన్ని ఎత్తాలి...!"

['గ్రంథావళి - 10'; పేజీ - 43]

కృష్ణుని చరిత్రే కుటిలనీతి చరిత్ర. అది విస్తృతమైన జాతిప్రయోజనాలకోసం, సత్యాన్ని, న్యాయాన్ని బలపరచడంకోసం యుద్ధం అనివార్యతల అవసరంగా వచ్చిన ఆపద్ధర్మం.

భారతయుద్ధం ముగిశాక, ఒక సరోవరంలో దాగివున్న దుర్యోధమిణ్ణీ పాండవులు యుద్ధం చేయడానికి బయటికి రమ్మని రెచ్చగొట్టిపిలుస్తారు. అతడలా బయటపడ్డాక, పాండవుల్లో ఎవరినో ఒకరిని ద్వంద్వయుద్ధంకోసం ఎన్నుకోమని అవకాశం కల్పిస్తాడు యుధిష్ఠిరుడు. నిజానికి ఈ నిర్ణయం వివేకరహితమైనదేగాక వినాశకరమైనది. ఈ సందర్భంలో కృష్ణుడు తన 'కుటిల నీతితో' పరిస్థితిని చక్కజేస్తాడు. దుర్యోధనుని ప్రశంశించి, భీమునిమాత్రమే గదాయుద్ధానికి ఎన్నుకునేటట్లు రెచ్చగొట్టి 'అసమయుద్ధం' జరుగకుండా వారిస్తాడు.

''చరిత్రకు మమకారమనేది లేదు''

(గ్రంథావళి – 6; పేజీ – 50)

కృష్ణుడా సందర్భంలో అన్న మాట మొత్తంనాటకానికే ప్రాణంలాంటిది. మానవుడి అహంకారాన్ని, భ్రమలను చరిత్ర మాత్రమే భగ్నంచేస్తుంది. అంతపెద్ద మహాభారతయుద్ధాన్ని గెలిచిన యోధానయోధుడు అర్జునుడు అయినా ఆ యోధుడు చివరికి రక్షించమని వేడిన యాదవస్త్రీలను రక్షించడంలో ఘోరంగా విఫలమవుతాడు. అతని అహం ఎందుకూ పనికిరాకుండా పోతుంది. ఆ దృష్ట్యా పైవాక్యం అతడి అహంమీద తీర్పుగా కనిపిస్తుంది. నాటకరచనలో రాఘవ చమత్కారాలకతీతంగా ఉండలేకపోయాడన్నదికూడా యథార్థమే. సత్యమార్గంలో తోడుగా నడిచే కుక్కకూడా చివరకు ధర్మరాజుగా మారిపోతుంది. స్వర్గానికి సంబంధించిన పౌరాణిక కల్పనలను, ఇంద్రరథాన్ని, సారధి మాతలిని స్వర్గారోహణ సన్నివేశంలో రాఘవ చూపుతాడు. ఈ చమత్కారాన్ని ఆశ్రయించడంవల్ల 'మానవీయ సందర్భాలు' క్షీణమైపోతాయి.

రామానుజ్ :

రామానుజాచార్య జీవితాన్ని తెలియజేసే నాటకమే 'రామానుజ్.' రాఘువ – జీవిత చరిత్రాత్మక నవలలను రాసినట్లుగానే ఈ నాటకాన్ని రూపొందించాడు. గోరఖ్‌నాథ్, విద్యాపతి, కబీర్, తులసీ, బిహారి, భారతేందులాంటి జీవిత చరిత్రాత్మక నవలలను అతడు ఆ తర్వాత రాశాడు. ఈ మహాపురుషుల జీవితాలను తెలియజేయడానికి, నాటకాలకన్నా నవలలే మంచివని రచయిత భావించాడేమో తెలియదు.

'రామానుజ' నాటకం రామానుజాచార్య చరిత్రకు సంబంధించిన మౌలికజిజ్ఞాసావిస్తృతిని తెలియజేస్తుంది. బంధానాలవల్ల వికాసం సాధ్యమా? బ్రాహ్మణుడైనప్పటికీ రామానుజుని బ్రాహ్మణుల ప్రచ్ఛన్న శత్రువుగా భావించారు. కులీన అగ్రవర్ణాల వారికి వ్యతిరేకంగా నిలబడి రామానుజుడు. 'అంత్యజుల' పక్షాన యుద్ధం చేశాడు. రామానుజుడు తన యుగపరిమితులను అతిక్రమించలేక పోయినప్పటికీ, తన భావాలను స్పష్టంగా ప్రకటించాడు.

"మతం ఎవరిసొత్తూకాదు. మతం మానవమాత్రుడిది. నేను ఈ నాడు విమ్మల్ని స్వతంత్రులుగా చేశాను. మీ దేవుడు మీ వాడే. బ్రాహ్మణుల సంపద కాదు దేవుడు!"

['గ్రంథావళి – 6'; పేజీ – 132]

విద్వేషకారణంగా రామానుజుని గురువులు యాదవప్రకాశ్, గోష్ఠిపూర్ణ మున్నగువారంతా బద్ధవిరోధులైపోతారు. విపరీతంగా మారినపరిస్థితులను కూడా రామానుజుడు దృఢంగా ఎదర్కొంటాడు. గొడ్డలిని ఎత్తిపట్టే 'ఆధారకర్ర' [కామ]గా రామానుజుని పోలుస్తూ, అతడు బ్రాహ్మణుడైవుండి కూడా బ్రాహ్మణ వినాశనానికి పూనుకున్నాడని గురువు గోష్ఠిపూర్ణుడు రామానుజుని తూలనాడుతాడు.

చోళరాజు కులోత్తుంగుడు రామానుజుని ఉద్యమాన్ని గ్రహించి, రామానుజుని అంతమొందించడంలోనే పరిస్థితి దారికి రాగలదని ఒక

నిర్ణయానికి వస్తాడు. పీడితవర్గాలవారు రామానుజుని ప్రాణరక్షణకై తమ ప్రాణాలను లెక్కచేయరు. అతడిని అంతమొందించే కుట్ర జరుగుతూవుందని, కులోత్తుంగుని రాజనర్తకి రమానుజుని హెచ్చరిస్తుంది. దీని పర్యవసానంగానే ఆమె తన ప్రాణాలను బలిపెట్టవలసివస్తుంది.

చర్మకారులగూడెంలో దాక్కొని, తానిదివరకక్కడ ప్రతిష్ఠించిన "శల్క్ పిళ్ళై" విగ్రహాన్ని కాపాడుతాడు రామానుజుడు. ప్రమాదకరపరిస్థితిలో రక్షాకవచంగా నిలిచినవారికే విగ్రహాన్నితాకే అధికారం ఉండకపోవడాన్ని ఖండిస్తూ, రామానుజుడు హితబోధ చేశాడు. సంఘంలో పాతుకొనిపోయిన వైరుధ్యాలను గమనించి, వాటికి వ్యతిరేకంగా రామానుజుడు మానవశక్తిని ప్రకటిస్తాడు.

"మానవుడి గొప్పతనం జన్మ, కులం, మతం, అధికారంలో లేదు. వాడి గొప్పతనం వాడి మానవత్వంలో ఉంది. వాడి మానవ ప్రేమలో ఉంది."

['గ్రంథావళి – 6'; పేజీ – 151]

రామానుజుని విప్లవాత్మక భావాల పాత్రను వివరించడమే ఈ నాటకం ఉద్దేశం. ఈ నాటకరచన కారణంగానే రాఘవ దక్షిణాది మహాపురుషుల మత, తాత్విక చింతనాధోరణికి అనవసర గౌరవం, ప్రాముఖ్యతనిస్తూ, అభిమానాన్ని ప్రదర్శిస్తున్నాడని లేనిపోని ఆరోపణలు చేశారు, విమర్శకులు. రామానుజుని 'బ్రాహ్మణ పునరుద్ధరణవాది'గా భావించేవారి వాదనలను ఖండిస్తూకూడా, రాఘవ తన భావాలను ఈ నాటకంలో స్పష్టం చేస్తాడు.

వైష్ణవ మత, సాంప్రదాయాభిమాని అయినప్పటికీ, నాటి స్వార్థపరులైన ఛాందస బ్రాహ్మణవర్గాన్ని దెబ్బతీయడంలో రామానుజడు విప్లవాత్మకమైన పాత్ర నిర్వహించాడు.

ఆదిశంకరునిలాగా రమానుజాచార్యుడు స్త్రీని మాయగాను, ప్రపంచాన్ని జంజాటంగాను ఎన్నడూ భావించలేదు. స్త్రీకి, గృహస్థ

ధర్మానికిసరైన గౌరమర్యాదలిచ్చి మానవహక్కులపరిరక్షకుడుగా పోరాడి నిలిచాడు రామానుజుడు.

'విరూధక్!'

"విరూధక్ నాటకం బౌద్ధయగం నేపథ్యంలో రాయబడింది. యుగం మారుతూన్న సందర్భంలో బౌద్ధమతం వామాచారానికి, దేశవ్యతిరేకతకు ప్రాధాన్యతనిచ్చిందనే విషయాన్ని వివరిస్తూ, ఈ నాటక రచన చేసినందువల్లే రాఘవ తీవ్ర విమర్శలకు గురయ్యాడు. సుఖవైభోగాలను పరిత్యజించి, మానవుడి దుఃఖంలో తాదాత్మ్యంచెంది, మమతామానవత్వాల కరుణాసందేశాన్నందించిన బుద్ధుని పట్ల రాఘవకు అపారమైన భక్తిప్రపత్తులున్నాయి. విరూధకుడు తన పరపీడన ప్రవృత్తిని, అహంభావోద్ధతిని వదిలి, చివరకు గౌతమబుద్ధుని కరుణాహింసలను స్వీకరించి, తన జీవితమార్గాన్ని మార్చుకోవడంలో సఫలీకృతుడవుతాడు."

ఏకాంకికలు : ఆఖ్రీధబ్బా (చివరిమచ్చ)

పూర్తినిడివి నాటకాలేగాక, రాఘవ కొన్ని ఏకాంకికలను కూడా రాశాడు. గోవావిముక్తి పోరాటం ఆధారంగా 'ఆఖ్రీ ధబ్బా' అనే ఏకాంకికను రాశాడు. ఈ నాటికలో మూకాభినయం, ఛాయాభినయం, నృత్యగీతాలు ప్రాధాన్యం వహించాయి. ఆధునిక నాటక ప్రదర్శనారీతులు ఈ ఏకాంకికలో చోటు చేసుకోవడంవల్ల ఇది నవ్యతను సంతరించుకుని, ప్రదర్శనాయోగ్యమై ఒక కొత్తప్రయోగానికి నాందిపలికింది. ఆగ్రాలోని 'జననాట్యమంచ్' [ప్రజానాట్యమండలి – ఇప్టా] వారు ఈ ఏకాంకికను దిగ్విజయంగా ప్రదర్శించి ప్రశంసలకు పాత్రులయ్యారు. ప్రేక్షకుల దృష్టికూడా గోవావిమోచన సమరంవైపు తీవ్రంగా మళ్ళింది. రచయిత, ప్రయోక్తల ఆశయం నెరవేరింది.

'హాతిమ్ మర్‌గయా' :

అలాగే రెండవప్రపంచయుద్ధకాలంలో రాయబడిన మరో ఏకాంకిక 'హాతిమ్ మర్‌గయా'. హతుశులైన మేధావులు ఏవిధంగా జీవితవు సుఖాన్వేషణలో దారితప్పి, వెలలేని జీవితపు పరుగుపందెంలో లీనమైనదీ

(కరీరిజం), ఆ వ్యామోహంలో వారు రోజురోజూ విస్తృతమవుతూన్న కార్మిక, కర్షకపోరాటాలను విస్మరించి బయటపడుతున్నదీ ఈ ఏకాంకికలో వివరించాడు. రాఘవ మితిమీరిన జీవనసుఖమయ జీవిత నిర్మాణచింత వ్యక్తిని ఏవిధంగా సమిష్టిసంస్కారంనుండి పడగొట్టగలదో ఇందులో హెచ్చరించి చూపాడు. సొంత సుఖ చింతన, తాము మాత్రమే పైకి రావాలనే ఆదుర్దా, ఆదాయ వ్యామోహం వ్యవస్థను మరీ భ్రష్టుపట్టించగలదని రాఘవ ఆదర్శ ఆగ్రహం.

ప్రదర్శన యోగ్యం కాని నాటకాలు

నాటక రచన దృష్ట్యా ''స్వర్గ్‌భూమికా యాత్రీ'' నాటకరంగ పరిచయలేమిగా కనబడుతుంది. దీర్ఘసమయందాకా కథను కొనసాగించే ధోరణివల్ల, ఒక సన్నివేశాన్ని చాలాసేపు కొనసాగించడంవల్ల సమయం సందర్భం పెరిగి, 'నాటకీయత' పూర్తిగా ఈ నాటకంలో చెడిపోయింది. చమత్కారాలు, ప్రాచీన నాటక సాంప్రదాయాలవల్ల కూడా ఈ నాటకం ఆధునికనాటకంగా ముందుకురావటంలో విఫలమయింది. దీని కథాక్షేత్రం కూడా చాలావిస్తృతం – యుద్ధరంగం, అడవి, హస్తినాపురం, రాజమందిరాలనుండి ద్వారకలోని సముద్రతీరం, రాజప్రాసాదాలదాకా క్షేత్రం విస్తృతమైవుంది. ఈ నాటక ప్రదర్శనలో ఇన్ని దృశ్యాలు చూపడం ఆనాడు అసాధ్యం. విసుగునుకూడా పుట్టిస్తాయి.

పాండవుల పర్వతయాత్రను కొత్తపద్ధతిలో చూపాడు. నేపథ్యంలో వాతావరణానుకూల ధ్వనిని, వేదికమీద దుర్గమయాత్రాస్థితిని చూపాడు. ఇది నాటక ప్రయోగంలో చాలా కొత్తపద్ధతి. దీనివల్ల యాత్రలోని నిరంతరత, దాని దుర్గమత్వం ద్యోతకమయ్యాయి.

'రామానుజ్' నాటకంలో ఏడంకాలు. వాటిలో అనేక దృశ్యాలు ఉన్నాయి. నాటకరంగంలో వచ్చిన మార్పులవల్ల ప్రదర్శనలో పాతపద్ధతులు అంతరించడంతో, ఈ నాటకాలన్నీ దృశ్యకావ్యాలు కావల్సిందిపోయి, శ్రవ్యకావ్యాలుగా మిగిలిపోయాయి. నాటి నాటకాలపట్ల అసంతృప్తిని

వెలిబుచ్చేక్రమంలోనే ఈ నాటకాలు ప్రత్యామ్నాయంగా రాయబడినప్పటికీ. ఇవి నాటిసవాళ్ళను ఎదుర్కొనేట్లు రచించబడలేదని రాఘవను విమర్శించారు. ప్రదర్శనాయోగ్యతను దృష్టిలో పెట్టుకొని రాఘవ నాటకాలు రాయలేదనే విమర్శ ఉంది.

పత్రికా రిపోర్టులు

బెంగాల్‌కరువు రాఘవ పత్రికలకు రాసిపంపిన రిపోర్టులు చాలా మౌలికమైనవి. ఉన్నత ప్రమాణాలు కలవి. భయంకరమైన బెంగాల్‌కరువు సందర్భంగా 'ఆగ్రా అభ్యుదయ రచయితల సంఘం' ఆధ్వర్యంలో, డా॥ కుంటే నాయకత్వాన ఒక వైద్యులబృదం కరవు పీడిత ప్రాంతాలకు పంపబడింది. పందొమ్మిది సంవత్సరాల వయస్సులో విద్యార్థిగా ఉండగా రాఘవ ఈ వైద్యుల బృందంతోపాటు విలేఖరిగా కరువుపీడిత ప్రాంతాలకు వెళ్ళాడు. తూర్పుబెంగాల్‌లో భయంకర కాటకాల విలయనృత్యాన్ని చూసి చలించిపోయాడు. మానవవేదనలన్నీ విరుచుకుపడిన విషాదాలను ఎంతో ఉత్తేజకరంగా 'తూఫానోంకే బీచ్' శీర్షికతో బెంగాల్ కరువుదృశ్యాలను వర్ణిస్తూ రాఘవ పత్రికకు రిపోర్టులు రాసి పంపాడు.

రాఘవ రాసి పంపిన కరువును గూర్చిన విషాదకరవార్తలు 'హంస్' పత్రికలో వరుసగా ప్రచురించారు. ఈ వార్తాపరంపర మొత్తం పత్రికారంగంలోనే ఒక చరిత్రాత్మక సంఘటనగా పేర్కొనడం జరిగింది. ప్రేమచంద్ స్థాపించిన 'హంస్' పత్రికకు అప్పుడు అతని కుమారుడైన అమృత్‌రాయ్ సంపాదకుడుగా ఉండేవాడు. అమృత్‌రాయ్ రాఘవ పత్రికా రచనగురించి వ్యాఖ్యానిస్తూ ఇలా రాశాడు.

"నాకు తెలిసినంతవరకు, సంఘటనలను చూసి వార్తలు రాసే 'రిపోర్టింగు పద్ధతి' హిందీలో రాఘవ రాసిన 'బెంగాల్ కరువు పత్రికారచన' తోనే ప్రారంభమైందనుకుంటాను. నేను, మిగతావారు పత్రికలకు చాలానే రిపోర్టులు రాసిపంపాము. కాని రాఘవ రిపోర్టింగులో తొణికిసలాడే జీవం మిగతావారిలో ఉండేది కాదు. నాడు వీచేగాలిలోనే భయం ఆవహించి

వుండేది. ఆ విషయం నాటి విషయాలు జ్ఞాపకంవున్నవారికందరికీ తెలుసు. స్వాతంత్ర్యోద్యమం చరమాంకంచేరింది. 1942 నాటి దమనకాండ మందగించే దశలో, విముక్తిపోరాటాన్ని భారతనావికాదళం [ఐ.ఎన్.ఎ] సైనికులు దేశంలో తక్షణ కర్తవ్యంగా ముందుకు తెచ్చారు. బొంబాయిలో విజృంభించిన నావికా సైనికుల తిరుగుబాటు మొత్తం దేశంలోనే ఒక ఉప్పెనను లేవదీసింది. ప్రతిచోటా ఊరేగింపులు, కాల్పులు, నిర్బంధాలు ఎదురుయ్యేవి. రాఘవ ప్రాణవంతంగా రాసిపంపే పత్రికారిపోర్టులు జాతీయోద్యమపోరటాలతో భుజంభుజం కలిపి నడిచేవి.

['రాంగేయ్ రాఘవ్‌కా రచనా సంసార్'; పేజీ – 37]

జవజీవాలవిలేఖరి రాఘవ

బెంగాల్ కరువు, గ్వాలియర్ కార్మికులమీద కాల్పులు మున్నగు జాతీయదృశ్యాల్లో ప్రజలసామ్రాజ్యవాదవ్యతిరేక చైతన్యం, స్వాతంత్ర్యోద్యమ పోరాటపటిమ అపారంగా కనిపించేవి. ప్రజలను సంఘటిత పరచివుంచే పోరాటం, మత సామరస్యం, నాటి విశేషాలు – ఉత్తేజకరమైన ఈ చైతన్య దృశ్యాలకంకితమై, రాఘవ సంఘటనలను ప్రత్యక్షంగా చూసి, ఉప్పుకారం తినేవాడిగా కదిలిపోయి, చీమూనెత్తురు ఉండే మనుషుల్లో చైతన్యం వెల్లి విరిసేట్లు జవజీవాలతో రిపోర్టులు రాసి పత్రికలకెక్కించేవాడు. సంక్షోభంలో తక్షణకర్తవ్యం గుర్తుచేసేవాడు.

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో నాజీల అమానుషాలను ప్రతిఘటిస్తూ సోవియట్ ప్రజలు చేసిన మహత్తర యుద్ధాన్ని కన్నులకు కట్టినట్లుగా రాయడంలో సాహిత్య ప్రమాణాలను, మానవ విలువలను, పోరాట చైతన్యాన్ని, త్యాగబుద్ధిని రంగరించిన సోవియట్ రచయితలు ఇల్యా ఎహ్రెన్ బర్గ్ తిఖోనోవ్, యూజినీక్రీగర్, చిరస్మరణీయులు. పత్రికారచనకే కొత్త ఒరవడి పెట్టిన ఈ రచయితలు వార్తల సేకరణలో ప్రతిక్షణం ప్రాణాలను లెక్క చేయకుండా చొచ్చుకుపోయారు. వారావిధంగా పత్రికారిపోర్టింగులో జవజీవాలను, చారిత్రక కర్తవ్యాన్ని ప్రదర్శించి నిబద్ధరచయితలుగా ఆదర్శమూర్తులయ్యారు. ఆ కోవలోని తొలిహిందీ

పత్రికా విలేఖరి రాంగేయ రాఘవ చిరస్మరణీయుడు.

'తుఫానోంకే బీచ్'

రాఘవ చేసిన 'బెంగాల్ కరువు పత్రికారచనలు 'తుఫానోంకే బీచ్' పేర సంకలితం అయ్యాయి. ఈ మహత్తరమైన పత్రికారచనలో నాటి బెంగాల్ కరువు ప్రకృతి వైపరిత్యమని, మానవుడు ప్రకృతిశాపానికి చేయగలిగిందేమీలేదని నిరాశాధోరణిలో రాఘవ రాయలేదు. ఆ భ్రమ అతడిలో ఏకోశానాలేదు. బెంగాల్ కరువు బ్రిటీషు సామ్రాజ్యవాదుల కుట్రలోభాగం అని రాఘవ స్థిర అభిప్రాయం. కృత్రిమంగా వచ్చిన కరువుగురించి ముందుమాట రాస్తూ అతడు చెప్పిన విషయం ఆలోచించతగ్గది.

''బెంగాల్ కరువు మానవతా చరిత్రలోనే పెద్దకళంకం. ఒక సామ్రాజ్యం (బ్రిటిషు రాజ్యం), దానితో కలిసిపోయిన మనదేశంలోని పెట్టుబడిదారీ విధానం కోట్లాది ప్రజలను, స్త్రీలను, పిల్లలను ఆకలితో మలమల మాడ్చి చంపినట్లు - ''ఆనాడు ధనమదాంధతలో, సామ్రాజ్యకాంక్షలో, వైభోగాల జీవన వైభవాలలో కన్నుమిన్నుగానకుండా ప్రవర్తించిన 'క్లియోపాత్రా' సైతం తన బానిసలను ఇంత ఘోరంగా పీడించి దుర్భరదుఃఖాలపాలు చేయలేదు.''

('గ్రంథావళి - 8; పేజీ - 188')

బెంగాల్ ఆకలిచావులను ఈ దేశం పారతంత్ర్యంతో జోడించి ఆలోచించాడు, రాఘవ. ప్రజల మహత్తర శక్తిమీద, సహసంమీద అతడికి ప్రగాఢమైన విశ్వాసం ఉండేది. బెంగాల్ కరువును సందర్శించిన బృందంలో బెంగాలీ, అస్సామీ, హిందూ, ముస్లిం యువకులు కలిసివుండేవారు. వూరంతా కలిసి ఒక బృందంగా కుష్టియా, నారాయణగంజ్, చట్‌గాంవ్ మున్నగు సుదూరప్రాంతాలకు వెళ్ళి కరువువిలయనృత్యాన్ని చూశారు. అయినప్పటికీ కరువుమధ్య ఉత్సాహంతో జీవనపోరాటంచేసే ప్రజల ఆత్మవిశ్వాసాన్ని చూసి వారు ఎంతో నేర్చుకున్నారు. 'బంగారు భూమిగా ప్రశంసలు పొందిన భూభాగం ఆనాడు హాహాకారాలతో నిండిపోయి

'మహాశ్మశానం'గా మారిపోయింది. బంకించంద్రుని 'ఆనంద మఠం', రాఘవ 'విషాధమఠ'ంగా చూడలేనిమలుపు తిరిగింది.

కరువు దృశ్యాలు :

1. మతంలేని కరువు : తమకు వ్యతిరేకంగా పన్నిన భయంకర మైన కుట్రవల్ల ప్రజలు భ్రమలో పడలేదు. ఉదాసీనంగా ఉండలేదు. మానవనిర్మితమైన ఉపద్రవాన్ని ఎదుర్కోగలిగే మనోస్థైర్యం కూడా వారిలో పుట్టుకొచ్చింది. కుష్టియా ప్రాంతంలోని ముస్లిం యువకుడనే మాటలు గమనార్హం.

"అప్పుడు మేము చూసింది హిందువులు ముస్లిములు అని కాదు. మేమంతా ఆకలిలో ఉన్నాం అని. పీడితులం బాధితులం అనే చూశాం. మారక్తం త్రాగడానికి హిందూ, ముస్లిం దోపిడీదారులు ఒకటికాగలిగినప్పుడు, మేము మా రక్తాన్ని కాపాడుకోవడం కోసం మా విభేదాలనధిగమించి ఏకంకాలేమా? ఆ కరువులో హిందూ హిందువుగా లేడు; ముస్లిం ముస్లింగా లేడు. ఆనాడు కేవలం రెండే రెండు వర్గాలు. దోచే దొంగలవర్గం దోపిడికి గురయ్యే ఆకలిగొన్న, పీడిత వర్గం..."

['గ్రంథావళి – 8'; పేజీ – 193]

పద్మానది మూలుగులు

పద్మానదీ తీరంలో కూర్చొని ఒకనాడు మహాకవి [బంకింబాబు] గీతాలను రాశాడు. ఆ గీతాల ప్రతిధ్వని తోనే మానవుడి ధమనిమండలంలో చైతన్యసృష్టి జరిగింది. కొత్త సాహసం పుట్టుకొచ్చింది. ప్రకృతి అలాగే ఉంది.కాని అంతా మారిపోయింది.

"వారు ప్రశాంతంగా ఇంటి వెన్నెలలోనే పడుకునేవారు. నదినీటిమీద ప్రవహించే వెండిబంగారం కలయికలను చూసి ఆహ్లాదపడే అవకాశం మానవుడికెక్కడిది? స్త్రీలు ఇక్కడ వేశ్యలై పోయారు. పురుషులు బిచ్చగాళ్ళుగా మారిపోయారు. పిల్లలు ఇల్లిల్లూ పాకులాడే పశువులైపోయారు. వాతావరణ

మంతా మూలుగులతో చెదిరిపోయేది."

['గ్రంథావళి – 8'; పేజీ – 194]

భార్యాపిల్లల హత్య

రాఘవ చేసిన బెంగాల్ కరవు దృశ్యవర్ణన కలచి వేసేదిగా ఉంది. తన పేగు చించుకొని పుట్టిన పసివాడు పడుకొని వుండగానే, భర్త తెచ్చిన బియ్యంగింజలను త్వరత్వరగా వండుకొని, భర్త రూప్‌లాల్ రాకుండానే తినేసింది. ఆమె ఆకలి బాధ అంత దుర్భరమైంది. ...తిరిగి వచ్చిన రూప్‌లాల్‌కు అన్నందొరకక, క్రోధావేశంలో భార్యను, పిల్లవాణ్ణి నరికేసి పోలిసులకు లొంగిపోయాడు. ఆ విధంగానైనా మర్నాటి నూకలచింత లేకుండా పోతుందని ఆలోచిస్తాడు హతుశుడై.

వళ్ళమ్ము కోవడం

ఇద్దరు ముస్లింస్త్రీలు ఇద్దరేపిల్లలతల్లులు, వారిని భర్తలు కరవులో వదిలేసి వెళ్ళిపోయారు. గత్యంతరం లేక ఆ స్త్రీలు వేశ్యావాటికనాశ్రయించారు. ఇలా సర్వం కోల్పోయిన స్త్రీలు వారిద్దరే కాదు. బెంగాల్‌కరువులో ఇరవై ముప్పై శాతందాకా స్త్రీలు ఇలాగే సర్వంకోల్పోయారు. బయటనుంచి వచ్చిన భట్టాచార్య లాంటివారు ఆడవారు చేసిన ఈ పనికి కాండ్రించి ఉమ్మివేసే స్వరంలో ఏమైనా అనవచ్చు. కాని అక్కడేవుండి కరువు వైపరీత్యాన్ని ప్రతిక్షణం అనుభవిస్తూన్న ఒక ముసలాడి ఆలోచన సహజంగా ఉంది. "ఆకలితోనే మరణించడానికి ఇష్టపడిన స్త్రీలూ ఉన్నారు". వీరూ అలాగే చచ్చిపోతే ఏమయ్యేది? చాలాదుఃఖం ఆవహించిన ఆ ముసలివాడే అడుగుతాడు. "చావడం అంత సులభమా?."

అంతా శ్మశానం :

'శిద్ధిర్‌గంజ్' – ఢాకాలో ఒక గుంపు సభ్యుడు చావడానికి సిద్ధంగా ఉన్న ఎద్దుదగ్గర కూర్చొని కొబ్బరినీళ్ళు తాగుతూన్న మరో ముదుసలి గుడ్డలునేసేవాడితో తన గుంపు పరిచయం ఇస్తూ గ్రామ పరిస్థితిని

వాకబు చేస్తాడు. దానికా ముసలివాడు సమాధానం ఇలా చెబుతాడు.

"పరిస్థితా! అదిగో చూడు!" అనివాడు ఒక సమాధివైపు చూపుతాడు. "శిద్ధిర్‌గంజ్" సంగతులు తెలుసుకోవాలనుకుంటున్నావా? గ్రామం ఈ మూలనుండి ఆ మూలదాకా సాగిపోండి. ఈ గ్రామమేకాదు. అన్ని గ్రామాల్లో చూడండి. ఎవరైనా హాహాకారం చేస్తూ కనిపిస్తే ఒట్టు! ఇప్పుడా చప్పుడే లేదు. ఇదివరకు అక్కడ రేయింబవళ్ళు ఏడ్చే ఏడ్పులు, తీసే మూలుగులు వినిపించేవి. ఇప్పుడవన్నీ లేవు. ఎవరు మిగిలారని? ఏడ్పులు మూలుగులు వినిపించడానికి? అంతాకరువు ఊడ్చుకొనిపోయింది!"

['గ్రంథావళి – 8'; పేజీ – 208]

ఎముకల చిరునవ్వు :

ఢాకాలో తయారయ్యే మల్లువస్త్రాన్ని [ఢాకేకి మల్‌మల్] ఇదివరకు చక్రవర్తులు ధరించేవారు. ఆ నేత కార్మికులు కరవులో ఎలుకల్లా చచ్చిపోయారు! ఒకే వరుసలో పదునాలుగు సమాధులు. ఆ పక్కనేకాలిబాట. దానిమీద చావడానికి సిద్ధంగా ఉన్న కుక్కలభయంకర రూపాలు. శ్మశాన నిశ్శబ్దం – గ్రామం ఈ మూలనుండి ఆ మూలదాకా వ్యాపించి వుంది. బ్రిటిషుసామ్రాజ్యవాదం, భారతీయపెట్టుబడిదారులు మిలాఖత్ అవడంవల్ల దేశమే ఒక పశువులవధశాల [కమేలా]గా మారిపోయింది.

చట్‌గాంవ్‌లో పిల్లల ఆసుపత్రిలో పిల్లలపేర ఎక్కువగా జీవరాసులు పెరుగుతున్నాయి. వారిని చూస్తే ఎత్తుకోవాలనిపించదు. ఆ పసికందులను చూస్తే ఎముకలమీద చర్మంకప్పినట్లు ఉంటుంది. ఆ పసివాళ్ళగురించి నర్సు అన్నమాటలు "ఇందులో ఎక్కువగా వీధిలో పుట్టినపిల్లలు" ఈ దృశ్యానికి చలించిన రచయిత తన కల్పిత ప్రేయసికి లేఖ రాస్తాడు.

ఇల్యా ఎహ్రెన్ బర్గ్ నాజీలబర్బరచర్యలకు వ్యతిరేకంగా చేసిన ఘోష అద్వితీయం! నేను ఘోషపెట్టను. నీవు దూరంనుండి తెలుసుకోలేవు 'నాముందు ఏమున్నదో!' నేను తిరిగివచ్చాక, నీవు నాతోపాటు ఒకరోజు శ్మశానానికి రావాలి. నేనక్కడ ఎముకల్ని ఒకదానికి మరొకటి తగిలిస్తాను.

అప్పుడా ఎముకలగూడు తప్పక చిరునవ్వు నవ్వుతుంది..."
['గ్రంథావళి – 8'; పేజీ – 232]

కరువులో కలిసి పోరాడేదీక్ష :

ఎంతో చలించిపోయే వాస్తవాలను, విషాదగాథలను రాసేటప్పుడు కూడా ఏదో గీకివేయక, వాటికి సాహిత్య ప్రమాణాలను జోడించి, హత్తుకునేట్లు కావ్యదృష్టితో రాయడం రాఘవ ప్రత్యేకత. కరుణ, కోపం, వ్యంగం అతడి ఆటవిడుపు. కరువు తర్వాత మశూచి కలరా, ప్లేగు మున్నగు భయంకర వ్యాధులతో పోరాడుతున్న ప్రజలు ప్రభుత్వాసై నికులు చేసే సహాయకార్యక్రమాలకు, స్వచ్ఛంద స్వయంసేవకులు చేసే నిత్యకార్యక్రమాలకు ఉండే తేడాను బాగానే గ్రహించారు. కరువు రోగబాధితులతో పాటు చచ్చి, బతికే నిర్ణయాన్ని రచయిత అద్భుతంగా రాశాడు. అయితే అది చచ్చే నిర్ణయం కాదు. బతికే పోరాటం. పీడితులతో కలిసి బతికే పోరాటాల దృఢతరమైన ఆకాంక్ష–దీక్ష!

మతసామరస్యం – చైతన్యం :

'యవ్‌గ్వాలియర్ హై' అనే పత్రికారిపోర్టు కూడా రాఘవ విశిష్టరచనల్లో ఒకటి. గ్వాలియర్‌లో కార్మికులమీద అమానుషంగా సాగిన పోలీసుకాల్పులను వివరిస్తూ రాసిన రిపోర్టు ఇది. బ్రిటిషుసామ్రాజ్యవాదుల నిర్బంధ కాండను నిరంకుశ విధానాన్ని జతచేసి చూశాడు రాఘవ, ఈ పోలీసుకాల్పుల్లో మరణించినవారిలో హిందువులు, ముస్లింలు ఉభయులు ఉన్నారు. ఒకవైపు మతోన్మాద ఉద్రిక్తతలు నెలకొని ఉన్నసందర్భంలో – పీడితుల్లోను, పీడకుల్లోను హిందూ ముస్లింలు ఉభయులు ఉన్నారని నొక్కి చెప్పడం, పీడనకు కులం, మతం అడ్డురావని, అలాగే చైతన్యం, మత, కుల విభేదాలను విస్మరించి మహత్తర ఆశయాలకోసం సంఘటితపడి పోరాడుతుందని తెలియజెప్పడంద్వారా రాఘవ పత్రికా రచయితగా నాటి అవసరాన్ని పూరించాడనే చెప్పాలి. శ్రమదోపిడికి, అమానుష అన్యాయానికి మతం, కులం, జాతి ఆచ్ఛాదనల్లా ఉంటాయి. పీడితులకు పోరాట

చైతన్యమే సర్వస్వమని రాఘవ అభిప్రాయం.

తమ హక్కులకోసం పోరాడే ఈ చైతన్య గర్జన 1857నాటి తిరుగుబాటులోనూ ఉంది, జలియన్‌వాలబాగ్‌లోనూ ఉంది, 1930లోనూ ఉంది, 1942లోనూ ఉంది.

స్త్రీలను తుపాకిగుళ్ళతో కాల్చిచంపే అవమానుష బ్రిటిషు సామ్రాజ్యవాదశక్తులను ఖండించడానికి, తన రొమ్మును తెరచి నిలుస్తాడు యువకుడు ఈ యువకుడి ధైర్యసాహసాలముందు, దేశాభిమానంముందు ఎనిమిదవ ఎడ్వర్డురాజు త్యాగంకాని, విశాలమైన వారెన్ హేస్టింగ్ విగ్రంహంకాని ఎంతో తుచ్ఛంగా కనిపిస్తాయి!

కుళ్ళిన తథ్యాలు :

ఈ కాల్పులు జరిగిన గ్వాలియర్‌లోనే, బ్రిటిషు సామ్రాజ్యవాదుల పళ్ళనూడగొట్టగలిగిన వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి సమాధి ఉంది. ఆ వీరవనిత చేతిఖడ్గంలో తళతళ మెరిసే తేజం పీడకులను హెచ్చరిస్తూ కొత్తగర్జనలను చేసింది.

సామ్రాజ్యవాదుల కోటలో కూడా కలవరం బయలుదేరించి. అణచబడిన కార్మికుడు వళ్ళువిరిచిలేచాడు. ఆకాలిగొన్నవాళ్ళు, గుడ్డలు లేనివాళ్ళు సంతరించుకున్న జాగృతి, ఈ జాగృతి, చైతన్యం సామ్రాజ్య వాదుల, దేశీయ పెట్టుబడిదారుల వర్గస్వభావాన్ని నగ్నంచేసి వీధిలో నిలుచోబెట్టింది. మురిగి కుళ్ళిన మురుగుకాలువ మురుగుకాలువ కానే కాదు. కొందరికలాంటి భ్రమ కూడా కలుగుతుంది.

"భారతదేశంలో ఉదయం వచ్చేగాలి స్వచ్ఛంగా ఉండాలి. మనసును పాడు చేసే, విసుగుపుట్టించే దుర్గంధం ఎందుకు వ్యాపిస్తూవుంది? వారెన్ హేస్టింగ్‌శవం ఎందుకు కుళ్ళిపోతూవుంది? శిథిలమైపోతూవుంది? పురుగులు పడ్డాయి. నీచాతినీచాలు, అసహ్యాలు, దుర్భరాలు జరుగుతున్నాయి."

['గ్రంథావళి – 8'; పేజీ – 258]

కుళ్ళి గబ్బుకొడుతున్న ఈ దుర్భరశవం 'వారెన్‌హేస్టింగ్'ది మాత్రమేనని కాదు. అది మొత్తం సామ్రాజ్యవాద దుర్గంధభూయిష్ట అసహ్యరూపమని సంకేతం. ఆ కారణంగానే నీచాతినీచమైన పోలీసుకాల్పులు నిరాయుధులైన కార్మికులమీద జరిగాయని నిరసన. ఇదీ గ్వాలియర్ రిపోర్టు.

# 8. స్వాతంత్ర్యానంతర గ్రామీణ జీవనయదార్థం

'రాయి ఔర్ పర్వత్' 'ఆఖరీ ఆవాజ్'ల నేపథ్యం.

స్వాతంత్ర్యా నంతర గ్రామీణజీవనాన్ని ఆధారం చేసుకొని రాఘవ పథ్ కా పాప్, 'ఆగ్ కీ ప్యాస్', 'రాయి ఔర్ పర్వత్', 'ఆఖ్రీ ఆవాజ్'మున్నగు నవలలు చాలారాశాడు. చివరి నవలను మినహాయిస్తే, ఈ నవలల వైశాల్యం చాలాతక్కువ. రాఘవకాలంలో ప్రేంచంద్‌నాటి గ్రామాలులేవు. ఈ కారణంగానే రాఘవ మొదటి నుండి గ్రామీణ జీవనాన్నిఈ విషయంలో అతడి అధ్యయనం చాలా పరిమితం. తానుండే వైర్, దాని ఇరుగుపొరుగు గ్రామాలను తన నవల క్షేత్రాలుగా స్వీకరించేవాడు. వీటిలో కూడా భారతీయ గ్రామీణ జీవనానికి సంబంధించిన జటిల సమస్యలను, సంక్లిష్ట యథార్థాలను అతడు చూడలేదు. చుట్టుపక్క గ్రామల్లో జరిగిన సంఘటనల మీదికి, అందులో ప్రముఖంగా కనిపించే వ్యక్తులమీదికి అతడి దృష్టి పోయింది. దీనికి సంబంధించిన వివరణ ఇస్తూ అతడు చెప్పిన మాటలు గమనార్హం! 'అఖరీ ఆవాజ్' ముందుమాట:—

"నా ముందు ప్రేంచంద్ (నాటి) గ్రామాలు లేవు. నేను జీవనయథార్థాలను చూశాను. నాకు ఆదర్శాలు లేవనికాదు. నేను నమ్మేది మానవుణ్ణి. శాశ్వత మానవ కల్యాణధర్మంలోనే నా ప్రగాఢ విశ్వాసం."

వ్యక్తుల లోభం, స్వార్థం, ప్రేమ, నైతికవిలువలు, వీటికి సంబంధించిన ద్వంద్వాలు తీసుకునే రాఘవ గ్రామీణ జీవనాన్ని చిత్రించాడు. రాయి ఔర్ పర్వత్, అఖరీ ఆవాజ్ నవలలను విశ్లేషిస్తేగాని వాటి ప్రాముఖ్యత, వాతావరణం తెలిసిరావు.

## 'రాయి ఔర్ పర్వత్'

తనకు సుపరిచితమైన రాజస్థానీ గ్రామీణ వాతావరణాన్ని ఆధారభూతంచేసుకొని, ఆ చట్రంమీదే 'రాయి ఔర్ పర్వత్' నవలా రచనకు పూనుకున్నాడు రాఘవ. గ్రామీణ జీవితంలో పెరిగిపోయిన అవినీతిని, సాంఘికపతనాన్ని స్థానిక దృశ్యాలుగా చూపినప్పటికి, అవి మొత్తం దేశపటంమీద విస్తరిస్తూన్న అవలక్షణాలుగా ప్రస్ఫుటం అయ్యాయి.

ధనబలంతో ఏదైనా సాధ్యపడే స్ఖలిత సమాజం ఒకవైపు, ఆ సమాజంలోని పతితగా ఉండే ఫూల్‌వతి మొత్తం గ్రామానికి ఆదర్శంగా నిలిచే దుర్భరయదార్థం మరోవైపు విలువల ఎగతాళిగాను, పదునెక్కిన వైరుధ్యాలుగాను ఈ నవలలో స్పష్టం అవుతాయి. ఫూల్‌వతి వేశ్య. తన పేగుతెంచుకు పుట్టిన కూతురుతో వైరాన్ని పెంచుకుంటుంది. కారణం కూతరు తన సుఖానికి అడ్డంకిగా తయారు కావడమే. చివరకు తన కూతురుని నైతిక పతనంవైపు నెట్టడానికి తల్లే తప్పుడు మార్గం వెదుకుతుంది. ఆది రాజీగా కూడా పరిణమిస్తుంది. దానిఫలితంగా తల్లికూతుళ్ళ మధ్య ఎవరి దారి వారు ఎన్నుకునే మినహాయింపు ఆ రాజీలో వారికి లభిస్తుంది. తల్లి చూపిన తప్పుడు మార్గాన్ని కూతురు విద్య తిరస్కరించిన పతాక సన్నివేశంలో నవలాలక్ష్యం క్రమంగా ఎదిగివచ్చి రక్తి కడుతుంది.

తల్లిగా ఫూల్‌వతి చేసిన అకృత్యాలను రచయిత సానుభూతితోనే రాశాడు. ఫూల్‌వతికి కూడా ఆర్ద్రక్షణాలున్నాయి. చిన్నప్పటినుండి ఆమె ప్రేమించిన యువకుడు హర్దేవ్. కాని తండ్రి మరణం ఆమె జీవితాన్ని పరాధీనం చేసింది. ఆమె బాబాయి డబ్బుకు కక్కుర్తిపడి, ముదుసలి గిరిధర్‌పాండేకు అమ్మివేశాడు. ఆమె మరిది పహలాపచ్చీసులో ఉన్న యువకుడు. అంతేగాక 'ఆర్యసమాజం' భావాలను ప్రచారం చేసే సంస్కర్త కూడా. అయినా వాడు మొదట చేసిన దుర్మార్గం వదినను పాడు చేయడం. ఆ తర్వాత కోరుకున్న ప్రేమికుడు హర్దేవ్ ఏదో మిషతో ఇంటికి వచ్చి పోయేవాడు. ఎవ్వరూ ఏమీ అనుకోకుండా 'సోదరి' అని పిలుస్తూనే, ఆ మాట చాటున ఆమెను అక్రమ సంబంధానికి దింపాడు.

ఈ విధంగా ఫూల్‌వతి కల చెదిరింది. కథ మిగిలింది. ఈ విధంగా కథా కేంద్రం మారడంవల్ల కూడా రచయిత దృష్టి స్పష్టం అవుతుంది. కాని ఈ కథా కథనంతో రచయిత నిర్వికారంగానే ఉండి పోతాడు. సామాజిక జీవన అవహేళనలను చిత్రించడంలో రచయిత నిష్పాక్షికంగానే వ్యవహరిన్నాడు. తద్వారా తీవ్రమైన వ్యంగ్యం మొనతేలి 'ముందుకు వస్తుంది. మంచి అనబడేదానిలో ఎంతగా 'చెడు' పేరుకుపోయింది. అలాగే చెడుగా ముద్రపడినదానిలో 'మంచి ఏ విధంగా' పొరాడి ముందుకు వస్తున్నదీ తెలియజెప్పడంలో రాఘవ తన రచనా నిబద్ధతను సార్థకంచేసుకున్నాడు.

ఫూల్‌వతి తన కూతురు విద్యకు లోకం తీరును తెలియజేస్తూ చెబుతుంది...

"నా మీదికి వేలెత్తి చూపే దమ్ములు ఈ గ్రామంలో ఎవరికి ఉన్నాయి? ఈ ప్రపంచం పాపంతోనె తయారైంది. ఎవరి ఆడంబరం ఎంత ఎక్కువగా ఉంటే వారి ధర్మం అంత ఎక్కువగా గుర్తింపబడుతుంది. ఈ రోజు నీవు అపఖ్యాతి పాలయ్యావు... రేపు నీవు మంచి పేరు కావాలనుకుంటే సంపాదించలేవా? ఏమైనా చేయి! కాని ఈ ప్రపంచం చాటున..."

('రాయి ఔర్ పర్వత్' పేజి – 74)

'గోదానం' ఆవులాగా అది ఒక చోట మేస్తుంది. మరోచోట పాలిస్తుంది. ఆ విధంగానే తనబతకు తయారైందని అంగీకరించడంలో ఫూల్‌వతి జంకదు. కాని బాధపడుతుంది. తనవారితో గుణపాఠం హెచ్చరికలు చేస్తుంది.

రాత్రి చీకటిలో మోసపూరితంగా హర్దేవ్ విద్యను ముద్దు పెట్టుకున్నప్పుడు తల్లి ఫూల్‌వతి ప్రతిస్పందన చాలా నాటకీయంగా, చమత్కారంగా మారిపోతుంది. తనకు జరిగిన అవమానంవల్ల విద్య క్రోధావేశపరురాలై తిరుగుబాటు పాత్ర నిర్వహిస్తుంది. ఇది సమాజమే

కాని ఫూల్‌వతి ప్రవర్తించిన తీరు, నాటకీయత, పాపస్వీకృతి, ఆ తర్వాతి సంఘటనలు చాలా నమ్మించేవిగా ఉన్నా ప్రభావరహితంగానే ఉండిపోతాయి.

చాలా సందర్భాల్లో రచయిత లోవ్యవహారాన్ని మిక్కిలి సూక్ష్మంగా అర్థవివరణలతోపాటు స్పష్టంచేశాడు. విద్య జైలుకు పోయినప్పుడు ఆమె బాబాయి సోదరులు ఆమెకు చెందిన వస్తువులను కాజేయాలని ప్రయత్నిస్తారు. జైలునుండి తిరిగివచ్చాక, ఇరుగుపొరుగు స్త్రీలు విద్యతో నిర్దయగా ప్రవర్తిస్తారు. క్రూరమైన సంఘటనలను తప్పుడు జీవన ప్రమాణాలుగా తెలియజేస్తూ రచయిత, సమాజగతమైన విధినిషేధాలను చాలాస్పష్టంగా వెలికితీసి చూపుతాడు ఈ పరిస్థితులను చాలానైపుణ్యంతో రచయిత ప్రదర్శించినప్పటికీ, అవి అతి మామూలు విషయాలై పోయినందువల్ల గాఢమైన ప్రభావాన్ని కలిగించవు.

సమాంతరవిలువలను ప్రతిపాదించే మహత్తర పాత్రలుగా విద్య, రామ్‌భరోసేలు ఈ నవలలో ప్రత్యక్షమవుతారు. సంఘంలో చలామణీ అయ్యే ఏకపక్ష విలువలను, వాటికి సంబంధించిన ఆలోచనలను అర్థహీనంగా చూపుతూ, ఈ రెండు పాత్రలు వ్యక్తంచేసే తీరుతెన్నులు వేరువేరుగా ఉంటాయి. గ్రామీణ జీవనంలో నెలకొనివున్న నైతికపతనం. తద్వారా ఉత్పన్నమయ్యే దుస్థితి, మొత్తం భారతీయగ్రామీణ జీవితం భ్రష్టుపట్టిన వైపరీత్యాన్ని వెలుగులోకి తెస్తూ, రాంభరోసే ప్రవర్తించిన తీరుపట్ల నవలలో ఒక ప్రత్యామ్నాయ విలువల స్పష్టత జరగుతుంది. హర్దేవ్ హత్య తర్వాత, పోలీసు స్టేషనులోకి పిలువబడిన రాంభరోసే, జమేదారును, దరోగాను లోబరచుకుంటాడు. ఆ తర్వాత వారిని ఒక గాటకట్టి అన్నమాటలు దృష్టినాకర్షిస్తాయి.

"తెలుసు దొరా! తెలుసు! కేసు అయ్యేది ఒకచోట! కాని అది తయారయ్యేది మాత్రం పోలీసు స్టేషనులో. ఈ విధంగానే ఎల్లప్పుడూ న్యాయం జరుగుతూ ఉంది. కాని దొరా! పరమాత్ముడు తన లీలామహాత్మ్యాన్ని చూపాడు. నల్లని గేదెలో తెల్లనిపాలు వస్తాయి. కాని

దేవునిలీలలకు మించినదానిని పోలీసులు చూపారు. నలుపును తెలుపును చేసి, తెలుపును నలుపు చేస్తుంది పోలీసులీల, ఇదిగో వందనోటు!...."

"ఇదేమిటిబే?" ఇన్స్పెక్టరు గద్దిస్తాడు.

"దొరా! తమరి బూట్ల పాలిష్ కోసం.... ఎవరి బూట్లు ఎంత పెద్దవో అంత పెద్దపాలిష్ చేయాలని అంటారు గద దొర!....."
['రాయి ఔర్ పర్వత్'; పేజీ - 40]

రాంభరోసే అమాయకత్వం అంత నమ్మకంగా తోచకపోవచ్చు, కాని వాడు ఎవరితో తటస్థపడితే వారి కల్యాణగుణాలను బయటికి తేవడంలో అసాధ్యుడు. విద్యపట్ల వాడికి ఆకర్షణ ఉంది. అందుకోసం వ్యంగ్యంగాను, దృఢంగాను నిలిచే స్థైర్యం వాడిలో ఉన్నాయి. వాడి వ్యక్తిత్వాన్ని తెలియజేస్తూ ఈ గుణగణాలు ఈ గుణాలేర్పడే విషయంలో పరోక్షంగా గీటురాళ్ళుగా మారిపోయాయి. ఒకసారి రామ్‌భరోసే స్వయంగా విద్యకు ధర్మోపదేశం చేస్తాడు కూడా!

"అరే! నీకు తేలియదు! ధర్మం దారిన పోతే మానవుడు అన్నీ పోగొట్టుకుంటాను. సత్యహరిశ్చంద్రుడి సంగతేమైంది!.. నున్ను చూడు.."
['రాయి ఔర్ పర్వత్'; పేజీ - 44]

విద్య గుణశీలాలు ఆడంబరమైనవికావు. చాలా సూక్ష్మపరిశీలన చేస్తేకాని బయటపడవు. విలువలదృష్ట్యా ఆమెలోని సూక్ష్మవిశేషాలు ఆమె చరిత్రను నిర్ణయించే గుణ విశేషాలుగా క్రమంగా వెలుగులోకి వచ్చి, అందరినే ఆశ్చర్యచకితులను చేస్తాయి.

మొదట్లో విద్యలో కనిపించే మౌనం అర్థవంతంగాతోచదు. కాని ఆ మౌనమే కథ సాగినకొద్దీ తన పట్టును సంపాదించుకుంటుంది. ఒకానొక నిర్ణయాత్మకఘట్టంలో ఆ మాట్లాడని మనిషి దృఢంగా నిలిచి. దుష్ట సమాజం ఎదుట మోకరిల్లడానికి నిర్భయంగా తిరస్కరిస్తుంది. ఆమెలోని

స్థైర్యం రెండురూపాలుగా ముందు రాగలిగింది. ఒకటి తల్లి ఫూల్‌వతి పతనమార్గాన్ని ఆక్షేపిస్తుంది. రెండోది ఆడంబరమైన ప్రదర్శనలను ఖాతరు చేయక, రామ్‌భరోసేను స్వీకరిస్తుంది.

నవలా నిర్మాణం దృష్ట్యా 'రాయి ఔర్ పర్వత్' నాలుగు అధ్యాయాల్లో విభజింపబడిఉంది. మొదటి అధ్యాయంలో తల్లిని వంచించి, తనను మోసగించ. సాహసించిన హార్దేవ్‌ని విద్య హత్య చేసి, పోలీస్‌స్టేషనకు వెళ్ళడం. రెండో అధ్యాయంలో విద్య పూర్వవృత్తాంతానికి లంకె కుదిరి, కథ బలపడుతుంది. శిల్పందృష్ట్యా ఇదంతా సహజంగాను, ఆసక్తికరంగాను ఉంటుంది. పోలీసుస్టేషను ఏకాకితనంలో గతమంతా ప్రస్ఫుటమై కనిపించడంవల్ల అప్పటి నిస్తబ్ధత, నిష్క్రియత సక్రియమై కదలాడుతాయి. ఆ తర్వాత మూడు, నాలుగు అధ్యాయాల్లో కథ వర్తమానంలోకి వస్తుంది.

భారతీయ గ్రామీణ జీవనాన్ని సమగ్రంగా చిత్రించే దృష్టిని రచయిత ఎక్కడా పేర్కొనలేదు. వ్యక్తి తనవిపరీత పరిస్థితులతో ఢీకొని, ఆదర్శాల మనుగడపోరాటం చేయడమే ఈ నవలలో ప్రధానవిషయమై వికసిస్తుంది.

చాలా పరిమితమై ఉన్నప్పటికీ, వ్యక్తిచేసే విలువల జీవనసమరం, దాని ధైర్యస్థైర్యాలు, శక్తిసామర్థ్యాలు, వాటికి సంబంధించిన దృఢమైన ఆత్మవిశ్వాసం, నైతికబలం మున్నగు గుణశీలాల కేంద్రంగానే ఈ నవల విరాజిల్లుతుంది.

ఆఖిరీ ఆవాజ్

రచయిత అకాల మరణం తర్వాత ఈ నవల వెలువడింది. దీనిపై ఎక్కువచర్చ బయలుదేరడానికి గల ముఖ్యకారణం రచయిత మరణం తర్వాత వెలువడిన చివరి సంపూర్ణరచన కావడం. అంతేగాక ఆ నవలపేరు. ఆఖిరీ ఆవాజ్ [చివరి పిలుపు] రెండర్థాలసూచకం కావడం కూడా. ఇది నవలాపాత్ర అయిన నారాయణ్ అంతిమవాణి మాత్రమే కాదు. రచయిత చివరిపిలుపు కూడా.

ఈ నవల గ్రామీణజీవానానికి అద్దంపట్టే రచన. స్వతంత్ర, ప్రజాతంత్ర దేశంలో పంచాయతీ రాజ్యవ్యవస్థ, జమీందారీవిధానం రద్దు, ఆ తర్వాత గ్రామాల్లో వరదలా వ్యాపించిన అవినీతి, ముఠాలు కట్టడం వగైరా గ్రామీణ జీవన అరిష్టాలనన్నిటినీ తీసుకొని, రాఘవ నవల అల్లడానికి చక్కని ప్రయత్నం చేశాడు.

ఈ నవలకు క్లుప్తమైన ముందుమాట కూడా రాఘవ రాశాడు. ఆ మేరకు ప్రేమ్‌చంద్ నవలా సంప్రదాయానికి భిన్నంగా ఈ నవలను అర్థం జేసుకోవలసివుంటుంది. ప్రేమ్ చంద్‌కాలంలో కూడా గ్రామాల్లో అవినీతి, ముఠాలు, దోపిడి, బాధలు ఉండేవి. ప్రేమచంద్ నవలల్లో గ్రామీణ జీవనం చాలాకరుణాపూరితంగా చిత్రింపబడింది. ఆ నవలలు చాలాధై ర్యంగాను, కళాత్మక వివేకంతోను, గ్రామీణ జీవనంలోని దోపిడీ విభిన్న రూపాల సంపూర్ణ స్వభావాన్ని చిత్రిస్తాయి.

సాంఘికంగాను, రాజకీయంగాను మారిన పరిస్థితులమేరకు ప్రేంచంద్ కాలపు గ్రామీణ జీవనానికి, రాఘవ నాటి [స్వాతంత్ర్యానంతర] గ్రామీణజీవనానికి మార్పు చూపడం అనివార్యం. ఈ మారిన పరిస్థితిని అన్ని రంగాలలోను, అన్ని స్థాయిలలోను చూపక తప్పదు.

ఆ విధంగా రాఘవ రాసిన ఆఖిరీ ఆవాజ్ నవల ప్రేంచంద్ చేసిన గ్రామీణ చిత్రణకు సమానస్థాయిలోనే నిలుస్తుంది. ఇందులో గ్రామీణ జీవన విషమ సమస్యలు, అవహేళనలు, వాటివల్ల కలిగే ఆపదలు, దుఃఖాలు, అసామర్థ్యాలు చాలా విస్తృతంగా చూపే ప్రయత్నం జరిగింది.

ప్రేంచంద్ నవలలో రైతును దోచేవాడు జమీందారు, జమీందారు దోపిడీకి సహాయ సహకారాలు అందించడానికి ప్రభుత్వ, ప్రభుత్వేతరశక్తులు వచ్చిచేరుతాయి. ఈ నవలల్లో కేంద్రం జమీందారు. కాని స్వాతంత్ర్యం తర్వాత గ్రామీణవ్యవస్థ కేంద్ర ఒకటికి [జమీందారు చోట] అనేకం అయ్యాయి. జమీందారీ విధానం రద్దయ్యాక ముఠాలుకట్టడం దోపిడీ చేయడం, అవినీతి, వేయిముఖాలుగా విజృంభించాయి. దోపిడి, అవినీతి

రూపాలు మారిపోయాయి. దోపిడి వరదలాగా పెరిగి పోయింది. ఇదివరకు చెరవులో మొసలి భయం చేపకు ఉండేది. ఆ తర్వాత చెరువులో చేపలవర్గం అనేది ఒకటి తయారై, చిన్న చేపలను చడీచప్పుడు చేయకుండా మింగివేయడం ప్రారంభించింది. ప్రేంచంద్‌నాటి గ్రామీణ జీవనానికి, రాఘవనాటి గ్రామీణ జీవనానికి మధ్య ఉన్న భేదం ఇదే. నాడు జమీందార్ పీడన – నేడు దళారుల దోపిడి.

రాఘవ ఎదుట నిలిచిన జీవనస్వరూపంలో పైన వివరించినట్లుగానే దోపిడి అనేక రూపాలుగా విస్తరించి ఉంది. ఆఖిరీ ఆవాజ్‌లో వర్ణింపబడిన గ్రామంలో, ఒక సర్వసామాన్యుడైన రైతుకూతురు సుశీలవతి, సచ్చరిత్ర కలది అయినప్పటికీ, ఆకస్మికంగా హత్య చేయబడుతుం.ది మాధోసింగ్‌ల చేతుల్లో ఆమె చంపబడుతుంది. ఆమెను నిహాల్ సింగ్ తన వాంఛలకు గురిచేసినట్లు వీరు ఆమెను పొందాలనుకుంటారు. ఈ కారణంగానే వారు నిహాల్ గుప్తమైన అనైతిక సంబంధాలను ప్రకటించలేక పోయారు. నిహాల్ అవలక్షణాల పరిచయం కేవలం ఆమెకే తెలుసు కాబట్టి, ఆవెను వశం చేసుకుంటే ఆమెనూ అనుభవించవచ్చు; ఆమె ద్వారా నిహాల్ విషయాలూ బయట పెట్టవచ్చునని వారు ఊహిస్తారు. వారిద్దరూ వరుసగా సర్పంచ్, వార్డపంచ్ సాక్ష్యాలను లేకుండా చేస్తారు వారిపెద్దలు. ఇక్కడినుండి కథ దేశం నాలుగువైపులా విజృంభించివున్న అవినీతిని, నైతిక పతనాన్ని చూపించేదిశలో సాగుతుంది. స్వతంత్రదేశం కుహనా నాయకుల స్వరూపస్వభావాలను బయటపెట్టడంలో రచయిత తన మెలకువలన్నీ ప్రదర్శించాడు. స్వాతంత్ర్యానంతర రాజకీయాలమీద, ముఠాలమీద రాఘవ చాలా తీవ్రమైన విమర్శ చేసిన వాస్తవాలకు దూరంగా ఎప్పుడూ పోలేదు. పోలీస్‌స్టేషన్ జవానునుండి అతి పెద్ద అధికారిదాకా ఈ అవినీతి మురుగుకుంటలో తలదాకా మునిగి పోయివున్నారు. స్వతంత్ర గ్రామీణ జీవన స్వరాజ్యకల్పన ఊహాజనిత స్వర్గమనీ (ఉటోపియా) రాఘవ పేర్కొంటాడు. ఊహాజనిత స్వర్గాలు పేదలను భ్రమలపాలు చేస్తాయి. స్వార్థపరులను చేస్తాయి. స్వార్థ పరులను అందల మెక్కిస్తాయి. పాపం పుణ్యమవుతుంది. పుణ్యం పాపమై పోతుంది.

ఈ చిత్రణవల్ల మనకు సహజంగా ఒక ప్రశ్నతలయెత్తుతుంది. ఈ నవలలోని గ్రామం సంపూర్ణ గ్రామం కానేకాదు అని, ఇది గ్రామీణ జీవితానికి సంబంధించిన ఒకవైపు చిత్రణే అయినప్పటికీ, సంపూర్ణ జీవితానికి సంబంధించిన ప్రాతినిధ్యం వహించే గుణదోషాల పరిశీలన ఇందులో వ్యాపించివుంది. ఒకవేళ చీకటినే జీవనయధార్థంగా ఒప్పుకుంటే [రచయిత ఒప్పుకోవాలని కోరుతాడు కూడా] మానవుడి విశ్వాసానికి ఆధారం ఏమి కాగలదు? ఈ ప్రశ్న అర్థంకావడం అనుపాత దృష్ట్యా దుర్భోధకంగానే కనిపించినా, కావలసిన సమాధానం మాత్రం అసాధ్యంగానే కనిపించినా, ఆ కావలసిన సమాధానమే చివరకు ఈ నవలలో ఆత్మగా మారి, సరళంగా చక్కగా చోటు చేసుకుంటుంది. నవలలో ఈ కేంద్రీయసత్యమే శేషప్రశ్నకు సమాధానంగా నిలుస్తుంది.

బహుముఖంగా విస్తృతమైన సామాజిక నైతిక పతనాల మధ్య ఆఖరిఘట్టం వచ్చేసరికి ఆ నారాయణే ఉజ్వలస్తంభంలా ప్రకాశిస్తాడు. వాడి అంతఃకరణలో తిరుగుబాటు, తప్పును ఒప్పుకోవడం, ఆత్మస్వీకృతి జరిగి దుర్భేద్యమైన అంధకారం మధ్య లేచి, సూర్యునిలా వెలిగివ్యాపిస్తాడు. పాపం చేసి నారాయణ్ ఏమీ తెలియని అమాయకుడిలా బతకలేదు. పాపంవల్ల వాడిలో మానసిక అశాంతి చెలరేగడం, తత్ఫలితంగా వాడు ఆత్మహత్యకు పూనుకోవడం ఒక విచిత్ర పరిణామంగా కనిపిస్తుంది. వాడీ విధంగా మారడం, మనిషిలో మనిషి పోగొట్టుకున్న విశ్వాసాన్ని తిరిగి పొందడంలాంటిది. ఈ విషయాల్లో రచయిత మరికొన్ని సంకేతాలు కూడా చేశాడు. నారాయణ్ స్కూలు ప్రధానోపాధ్యాయుని డబ్బు ఇచ్చి కొనడం అసాధ్యం. అర్థవంతమైన దూరదృష్టితో దృశ్యాన్ని నిర్వహిస్తూ, చాలా జాగ్రత్తగా తననుకున్న మానవవిలువల నూతన ప్రత్యామ్నాయ మానవు లను నిర్మిస్తూ పోతాడు.

పోలీసు యంత్రాంగం, వ్యవస్థమొత్తంతో ముడివేసివున్న అమానుషత్వాన్ని రచయిత సానుభూతితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. చిన్న దౌర్జన్యాన్ని అణచడానికి పెద్ద దౌర్జన్యం అవసరమని

పోలీసు గుండాయిజాన్ని చాలా చెడుగా భావిస్తుంది. కాని పోలీసు లేకుండా ప్రపంచమే నడవదు. ఏ జీవితంలో హంతకులు, బందిపోట్లు, మోసగాళ్ళు, అబుద్ధీకులు మున్నగు సంఘవ్యతిరేక శక్తులతో ఎదురుపడతామో, అక్కడ మంచితనంతో పని సాగదు. కాలువలను శుభ్రపరచడానికి పూలగుత్తులు పనికిరావు, చీపురుకట్టలే తీసుకోవాలి....

ఇలాంటి విశ్లేషణ రాఘవ రచనా సంస్కృతిని స్పష్టం చేస్తుంది. దేశవ్యాప్తంగా విస్తరించివున్న అవినీతిని రచయిత నిర్వికారంగానే చిత్రించాడు. మంచి భావాలున్నప్పటికీ, రచయిత అసహజత్వంనుండి బయటపడలేక పోయాడు. ఏ అవినీతి సమస్యనైతే రాఘవ ఈ నవలద్వారా దేశస్థాయిలో లేవదీశాడో, దాని పరిష్కారాన్ని కేవలం వైయక్తిక స్థాయిలో మొత్తంగా పరిష్కరించ ప్రయత్నించాడు.

నారాయణ్ అంతఃకరణలో జరిగే తిరుగుబాటు, తద్వారా వెదకదలిచిన సమాధానం కూడా ఏకపక్షంగానే ముందుకు వస్తుంది. ఆ కారణంగానే రచన తన ప్రభావంనుండి తాను బయట పడడానికి విఫలమవు తుంది.

వ్యభిచారం, నైతికపతనం మున్నగు విషయాల ప్రస్తావన నవల కళాత్మకరూపాన్ని ప్రభావితం చేస్తుంది. దీనివల్ల నవల కొంత సమతూకం చెడి, అవసరం లేని విస్తృతిని ప్రోత్సహిస్తుంది.

ఆఖరీ ఆవాజ్ లోని యధార్థం ఒక సామ్యవాద రచయిత యధార్థం కాదు. ఇందులో రచయిత అసాంఘిక, అనారోగ్య, అభివృద్ధి నిరోధక శక్తులను తన పద్ధతిలో బయటికి తేవడంలోనే ఖర్చయిపోతాడు. ఈ అమానుష శక్తులతో పోరాడడానికి కావలసిన చైతన్యం, తగిన బలం రూపొందకపోవడంవల్ల రచన ఏక పక్ష చిత్రణై ఆగిపోతుంది. సమస్యలను లేవనెత్తడం ఎంత ప్రధానమో. వాటికి పరిష్కారాలను సంతరించిపెట్టడం కూడా అంతే ప్రధానం. సమస్యలను లేవనెత్తడంతోనే రాఘవ అలసిపోయాడు.

# 9. 'గదల్' – సంవేదనా దృష్టి

గదల్ రాఘువ రాసిన అత్యుత్తమ కథ. గతమూడు దశాబ్దాలుగా, దాన్ని శ్రేష్ఠత్వాన్ని రెండోస్థాయికి పడవేయగల మరోకథ రాలేదు. రాజస్థానంలోని పొలిమేర గ్రామాల నేపథ్యంలో రాయబడిన కథ ఇది. కథ చాలానాటకీయంగా ప్రారంభమై, క్రమంగా విచ్చుకొని విస్తరిస్తుంది. గదల్ ఒక స్త్రీ పాత్ర. నలభై అయిదేళ్ళ విధవరాలు. అలిగి వయసులో ఉన్న కొడుకులను, మనవలు మనవరాళ్ళను వదిలి, ఇల్లు విడిచి వెళ్ళిపోతుంది. అదే ఊళ్ళో భార్య చనిపోయిన ముప్పై అయిదేళ్ళ లౌహారావౌని ఇంటివద్ద కాలంగడుపుతుంది. ఆమెకొడుకులు కూడా మిగతావారి లాగే ఈ వయసులో ఆమె అందరినీ తలదించుకునేట్లు చేస్తూవుందని ఆలోచిస్తారు. ఒకసారి దారిలో తటస్థపడగా, వారామెను ఇంటికి తీసుకువచ్చే ప్రయత్నం చేస్తారు. ఈ సందర్భంలోనే గదల్ తన మరిది డోఢీని నిలదీసి అడుగుతుంది.

"....ఇప్పుడు కుటుంబం ముక్కుమీద వేటుపడితే ఆలోచించడం మొదలుపెట్టావు!... నీ గదల్‌ను. కోడళ్ళు గుడ్డురిమి చూసినప్పుడు ఇదంతా ఆలోచించలేదు. అయినా ఎవరు ఎవరిని లక్ష్యపెడతారాని? ..."

['కహానీ వార్షిక సంచిక – 55'; పేజీ – 79]

పైన గదల్ చేసిన ఆరోపణే ఆమె చరిత్రకు సంబంధించిన జీవరహస్యం మరిది డోఢీని సంబోధిస్తూ 'నీగదల్' అని జ్ఞాపకం చేస్తుంది. ఈ అనుబంధాన్ని, మూగమమకారాన్ని వివరిస్తూ గదల్ చెప్పినమాటలు ఆకట్టుకుంటాయి.

"నేను చిన్నదానిగా ఉండగానే, నా మరిది నాభర్తతో పాటు వచ్చాడు. లాఠీ పట్టిన నా మరిదిని ఆనాడు అలాచూస్తూనే ఉండిపోయాను. అనుకున్నాను మరిదినీడలో బతుకుదామని. కాని నా భర్త చనిపోయాక,

ఆ నా మరిదే నాకు రక్షణకాలేక పోయాడు. ఏమి చేయగలను?.. తన కొడుకులను గద్దిస్తూ అంటుంది... అరే! నేను లేకపోతే అతడికేమయింది? రెండు రోజుల్లో బాబాయి ఎగిరిపోయాడుకదా! అయ్యో! వీరి నీడన పడివుంటే ఏమయింది? –"

['కహానీ – 55'; పేజీ – 83]

ఆమెకు తన కొడుకులు కోడళ్ళమీద ఫిర్యాదు లేదని కాదు. వేదనపడే ఆమె మనసు చెప్పే దీనగాథ వేరు. ముప్పై ఏళ్ళు తాను మరిదితోపాటు అదే ఇంట్లో కాలం గడిపి వేసింది. తనలో రాజుకొనివున్న నిప్పును. తాపాన్ని, పొగను ఎప్పుడూ బయటికి రానీయలేదు గదల్. ఇప్పుడామెకు భర్తలేడు. మరిది [ముద్దుగా చిన్నతనంనుంచి పిలిచేగున్నా] లేడు. మరిది డోఢీ భార్యాపిల్లలెవరూ లేరు.

గదల్ ప్రేమానురాగాలు తెలిసికూడా, ఆత్మీయత అర్థం అయి కూడా లోకం ఏమనుకుంటుందోనన్న భయంతో మరిది ఆమెను నిర్లక్ష్యం చేశాడు. ఈ నిర్లక్ష్యమే ఆమెకు తన వేదనై కూర్చుంది.

మరిదితో తమ తల్లికి ఏదో సంబంధం ఉందని కొడుకులు అనుకునేవారు. ఈ లేనిపోని అనుమానంవల్ల, లోకం ఏమను కుంటుందోనన్న భయంవల్ల తల్లికి, తమకు మధ్య అడ్డుగోడ నిలుపుకున్నారు పేగు చించుకుపుట్టిన కొడుకులు. వారి అనుమానం, భయాలగోడ చాలాపలు చనిది, పచ్చి మట్టితో కట్టుకున్నది. తోస్తే ముక్క చెక్కలయ్యేది. ఆ కారణంగానే కొడుకులు తల్లిని ఎప్పుడూ ఆత్మీయంగా దగ్గరికి చేర్చేవారు కాదు. పూర్తిగా నిర్లక్ష్యం చేసేవారు. ఈ విధంగా కొడుకులకన్నా ఎక్కువగా చూసిన మరిదిచేత నిర్లక్ష్యానికి గురికావడంవల్ల, ఇష్టం లేకపోయినప్పటికీ గదల్ ఇల్లు వదలివచ్చేయ వలసివచ్చింది.

మరిదిపట్ల చిన్ననాటినుండి పెనవేసుకుపోయిన ఆత్మీయత గదల్‌లో వటవృక్షంలా వేళ్ళూని విస్తరించింది. అందుకు ఒ. ెలుగా మరిది డోఢీ వదినను ప్రేమించలేదని కాదు. ముప్పై ఏళ్ళదాకా వారు ఒకే ఇట్లో

కలిసివున్నారు. నైతికవిలువలను, వారసత్వ సంస్కృతిని, మానమర్యాదలను పాటిస్తూ వదినామరుదులు ఒకే ఇంట్లో ముప్పై ఏళ్ళుగా ఉంటూ సహజీవనం సాగించారు. మరిది చనిపోయాక ఆమె పరిస్థితి మరీ దయనీయమైంది. నిద్రిస్తున్న నిప్పును కెలికి లేవదీస్తే అది మరో చోటినుండి మండినట్లుగానే గదల్ గుండెమంట మరోరూపందాల్చింది. ఇప్పుడామెను మయస్సు, మానమర్యాదలు, వారసత్వబాధ్యతలు మున్నగునవేవీ అణచి వుంచగలిగే పరిస్థితిలో లేవు.

ఒకే పరిస్థితిలో ఇద్దరి ప్రతిస్పందన భిన్నంగా ఉంది. లోకాన్ని ఏమాత్రం ఖాతరు చేయక ఎదురు తిరుగుతుంది గదల్ - మరిది డోఢీ లోకానికి వెరచి, మాట్లాడకుండా అన్ని వేదనలు అనుభవిస్తాడు. లోకాన్ని ఎదిరించి గదల్ బతికిపోతుంది. లోకానికి భయపడి కృంగి కృశించి ముక్క చెక్కలయ్యాడు మరిది. భరించరాని చలి రాత్రిలో డోఢి గ్రామగీతాలు [ఢోలా] వినడానికి పోవడంవల్ల చలిదెబ్బకు చనిపోయాడని అందరూ అనుకున్నారు. మద్దెల వాయిస్తూ పాడే జానపద ప్రేమగీతాలను డోఢీ రెండే రెండుసార్లు విన్నాడు. ఒకసారి తన శోభనం రాత్రి వేడుకలో. వదిన గదల్ ఇల్లు వదలిపోయినప్పుడు రెండోసారి విన్నాడు, ఎక్కడికో పోయి. ఈ రహస్యం వాడితోనే పోయింది. అతడికేనాడూ పాటలతో కాలక్షేపం చేయాలనే ఆలోచన లేదు.

గదల్ మారినపరిస్థితులతో రాజీపడదు. భర్త చనిపోయాక, నిహాల్, అతడి భార్యతో కలిసి బతికే మార్గాన్ని ఆమె వెదకదు. దీనివల్ల ఆమె ఆత్మగౌరవానికి దెబ్బవస్తుంది. అధికారం చలాయించే స్వభావానికి ఆటంకం కలుగుతంది. కొడుకులు కోడళ్ళు చాకిరి చేయడానికే ఆమె ఓ ఇంట్లో పడివుందా అంటే అదీ కాదు.

మౌని ఇంట్లో ఉండగా, గదల్ చిన్నకొడుకు నారాయణ్ తల్లిదగ్గర భూమిశిస్తు తీసుకుపోవడానికి వచ్చినప్పుడు, వాణ్ణి గడపలోనే ఆపి, అంతకుముందు నవ్వుతూవున్న ముఖాన్ని మార్చి శిస్తుడబ్బును విసిరికొడుతుంది. మౌని వదిన ధుల్లో సూటిపోటీ మాటలకు మాటకుమాట

జవాబు చెప్పి, గుక్క తిప్పుకోకుండా చేస్తుంది ధుల్లో. మోకాలు చివరకు పొట్టవైపే మళ్ళుతుంది కదా! అని ఎత్తి పొడుస్తుంది. దానికి జవాబుగా గదల్ అన్న మాటలు దెబ్బకు దెబ్బలా ఉంటాయి.

"భలే వదినగారు భలే! [జితాని! పెద్ద బావ భార్య]. పాతమొగుడి ధరను కొత్తమొగుడితో వసూలు చేయడమా? ఇంటిఇల్లాలే చెల్లిస్తుంది! గదల్ ఎప్పుడూ యజమానురాలుగానే ఉంటుంది. అర్థం అయిందా! దాసిగా బతకదు. నా భర్త సేవనే చేస్తాను. కాకపోతే భూమిపన్ను కాలిగోటితో సమానం. మధ్యలో మాట్లాడేదానిని నేవెవరు? –"

['కహాని', పేజీ – 80]

గదల్ఎత్తిపొడిచిన ధుల్లో ఇల్లాలుగాదు. గదల్ ఉంటూన్న ఇంటియజమాని మౌనివదిన, సుమారు వాని భార్యగానే ఉంటూవుంది. అలాంటి ఆమె – కొడుకు భూమిపన్ను అడగడానికి వచ్చినప్పుడు, గదల్‌ను ఎత్తిపొడవడాకి సాహసిస్తుంది. ఆమె తప్పుడు చరిత్రనంతా బయటపెడుతూ మాటకు మాట అని బుద్ధిచెబుతుంది. ఊళ్ళోఅందరి జాతకాలు ఆమెకు తెలుసు. ఆమె జాతకంలో వెదకినా తప్పు దొరకదు. అందుకే తప్పుడు మనుషులందరికీ ఆమెమీద లేనిపోని అక్కసు! అయినా ఆమె జంకదు. ఎవరికీ లొంగదు. అసాధ్యపిండం!

మరిది డోఢీ చనిపోయాడనే వార్తను గిరిరాజ్‌గ్వారియా ద్వారా వింటుంది. ఆ ఇంట్లో భార్య భర్తకు తిండి పెట్టి పోతుండగా, వారనుకునే మాటలు విని జరిగిన సంగతి తెలుసుకుంటుంది గదల్.

సంసారమంతా వదిలేసి అలిగివచ్చి, తెలిసిన మౌని ఇంట్లో ఆశ్రయించివుంటూన్నప్పుడు అభ్యంతరం చెప్ప సాహసించినవారు లేరు. డోఢీ చనిపోయిన వార్త వినగానే పరుగెత్తిపోవడానికి సిద్ధమైన గదల్‌ను మౌని లక్షచెప్పి ఆపడానికి ప్రయత్నించినా వినిపించుకోదు. తనకు తోచింది చేస్తుంది. నచ్చింది స్వీకరిస్తుంది. నచ్చనిది ఎంత దగ్గరదైనా వదిలేస్తుంది. గదల్ ఉప్పుకారం రుచి తెలిసిన పౌరుషం – చీమునెత్తురున్న అభిమానం.

ఏ మరిది ఉపేక్ష కారణంగా అలిగి, ముప్పైఏళ్ళ బంధాన్ని తెంచుకు బయటపడిందో, ఆ మరిదే పోయినప్పుడు ఇక పంతాలుపట్టింపులకు అర్థంఏమిటి?

తండ్రి చనిపోయినప్పుడు పిసినారితనంతో కేవలం పాతికమందికే భోజనంపెట్టి కర్మకాండ జరిపించినందుకు కొడుకులను మందలించింది గదల్. కాని మరిది చనిపోయినప్పుడు నిర్లక్ష్యంగా కర్మకాండ జరగడానికి ఒప్పుకోలేదు. వ్యవహారం తన చేతుల్లోకి తీసుకుంది. ఇన్‌స్పెక్టరుకు లంచం ఇచ్చి, మరిది పెద్దకర్మ ఘనంగా జరిగేట్లు చూసింది. నాటి చట్టపరమైన చిక్కులు, ఆంక్షలను ఏమాత్రం ఖాతరుచేయలేదు.

మౌని తనకు జరిగిన అవమానానికి, అందరిలో నవ్వులాటకు తగిన ప్రతీకారం తీర్చుకోవడానికి వచ్చిన అవకాశాన్ని వదులుకోరాదని పథకంవేశాడు.

కర్మకాండలో పన్నెండవరోజు బ్రాహ్మల భోజనం [కారజ్] సాగుతూండగా, లంచం తీసుకున్న ఇన్‌స్పెక్టర్‌కింది జవాను వచ్చి, విందు భోజనం ఆపివేయమని ఆజ్ఞాపించాడు. అందరికన్నా పెద్ద అధికారి వచ్చాడని హెచ్చరించాడుకూడా.

ప్రభుత్వం, చట్టం వగైరాలు గదల్‌కు ఏమాత్రం తెలియవు. ఆమెకు తెలిసిందల్లా బంధు పరివారాల మర్యాదలు, వంశాచారం, వారసత్వ సంస్కారం, అనుకున్నది ఇటు సూర్యుడటు పొడిచినా చేసితీరడం.

వచ్చిన అతిథులు భోజనం చేయకుండానే తిరిగిపోవాలా? అంతేకాదు తన ఇంట్లోనే తన బంధువులకు అవమానం జరగడం. తను చూస్తూ వుండిపోవడం — గదల్‌కు ఏ మాత్రం ఇష్టంలేదు.

లంచం తీసుకున్నా దరోగా ఇప్పుడు వీరిని గుర్తించనట్టుగానే ప్రవర్తిస్తాడు.

నిహాల్ మొండికేసిన గదల్‌ని హెచ్చరించాడు. కాని వారు మాటలతో

ఆగిపోరు. తుపాకులు పేలుస్తారు.

నీవు భయపడకు! ఇంటికప్పుమీద నా చిన్నకొడుకు నలుగురిని తీసుకొని తుపాకులతో సిద్ధంగా ఉన్నాడు....

రెండు వైపులా తుపాకులు పేలుతాయి. గదల్ కేకపెట్టి అరుస్తూ అతిథులను ప్రార్థించింది.

"నా మీద ఒట్టు! మీరంతా భోంచేసే లేవండి!"

['కహానీ'; పేజీ – 85]

లాంతరు ఆరిపోవడంతో చీకటి ఆవరించింది. తనమీద ఒట్టుపెట్టి, తన చిన్నకొడుకు నారాయణను, వాడి భార్యా పిల్లలను వెనుకద్వారంనుండి బయటికి పంపివేసింది. గదల్ స్వయంగా తుపాకి అందుకొని, కాల్పులు కాల్చింది. వచ్చిన గుండు పొట్టలో గుచ్చుకొని, ఆమెను కింద పడవేయగా, అప్పుడు ఆమె లంచంతీసుకున్న ఇన్‌స్పెక్టరుతో సంతోషంగా అన్నమాటలు ఆమె గుండె చించుకొనివచ్చాయి.

"శ్రాద్ధభోజనం అయిపోయింది. ఆత్మకు శాంతి దొరికింది." ఇన్‌స్పెక్టరు ఆమెను "నీవెవరివి?" అని అడ్గితే, అప్పుడామె మెల్లనికంఠంలో సమాధానమిస్తుంది....."

"ఎవడైతే ఒక్క రోజు కూడా ఒంటరిగా ఉండలేక పోయాడో వాడి....!" ఆమాట నోటినుండి వెలువడుతుండగా ఆమె తల వాలిపోయింది. అయినా ఆమె పెదవుల్లో చీకట్లో వెలిగించుకొని తెచ్చిన ఇదివరకటి ఆర్పివేసిన లాంతరు...

గదల్ కథ ఎంత నాటకీయంగా ఉన్నప్పటికీ, రచయిత ఆలోచనలనుండి బయటపడి సర్వస్వతంత్రంగా వికసించింది. ప్రేమ బయటపడడానికి కాలగతమైన పరిమితి అనేది ఏదీ ఉండదు. మెల్లమెల్లగా మనసులోని మట్టిని తొలగిస్తూ పోతే ప్రేమ బయటపడదు. మొత్తంగా

ఒకేసారి ఆకస్మికంగా దెబ్బతగిలి కదిలినప్పుడు ప్రేమ విస్ఫోటనలా బయటపడుతుంది. ఉద్రిక్త ఘట్టాల్లోనే ఉబికివస్తుంది. మట్టిని కోసే నీటిలోనే అమాంతంగా అది పడిపోతుంది.

ఇతివృత్తం మొత్తం గదల్ పాత్ర కేంద్రంగానే అభివృద్ధి చెందింది. ఆమెలేని సంఘటన లేదు. ఆమె లేని చర్చలేదు. ఆమె లేని ముచ్చటలేదు. ఆమె లేని మొదలు, మధ్య, ముగింపులు లేవు. ఆ కథనిండా ఆవహించిన విరాట్‌రూపం గదల్. ఆటుపోటుల గంభీరసముద్రం గదల్.

సంఘంలోని నీతిరీతులను కాలదన్నుతూ, తిరిగి వాటిని నిర్మిస్తూ, మళ్ళీ విరగ్గొడుతూ గదల్ గుణశీలాలు వికసిస్తాయి. పోలీసులు, చట్టం క్రూరమైన వాస్తవాలైనప్పటికీ, వాటి విషయంలో ఏమీ తెలియని గదల్, వాటి ప్రమాదాల భయంతో ఏమాత్రం చలించిపోయి. లోకం తెలిసీతెలియని అమాయకురాలు, అంతఃకరణకు చలించిన ఆవేశపరురాలు గదల్.

గదల్ గుణశీలాలు సర్వశ్రేష్ఠమైనవి. స్వచ్ఛమైనవి. గదల్ తన మట్టిలో చాలా లోతు దాకా దిగి పెనవేసుకు పోయింది. ఆ కారణంగానే ఆమె పలుకులో నుడికారం, సామెతలు పోటీబడి జీవన అనుభవసారంగా వచ్చాయి. ప్రతిమాట జవజీవాలతో తొణికిసలాడింది. మాటకు చేతకు వైరుధ్యం కనిపించలేదు.

గదల్ పట్టుదల, ఆత్మాభిమానం, దృఢసంకల్పం, అధికారభావం, అలక, ఉలుకు పలుకు వగైరా ప్రత్యేకతలు ఆ మట్టిలోని సుగంధ విశేషాలు, అవి ఆమె భాషతో కలగలిసిపోయిన నిత్య సత్యాలు. ఆమెను దృఢంచేసిన జీవితానుభవాలు. వాటి ప్రభావం ఆమె జీవితంలోగాక సంఘంలో కూడా చాలాకాలందాకా వ్యాపించిపోయాయి. ఎదురు తిరిగిన కాలాన్ని తనకనుకూలం చేసుకున్నది. తాను మాత్రం కాలానికి తలవంచలేదు.

రాఘవ గదల్ పాత్రను మహోత్కృష్టంగా చిత్రించాడు. నాటి కాలాన్ని. గ్రామాన్ని, సంఘాన్ని, కూలిపోతున్న విలువలను, ప్రేమలను,

రాగద్వేషాలను, ఉన్నత ప్రమాణాలను, మానవతా విజయాన్ని ఆ పాత్రలో చిత్రించి, ఆ కథను న భూతో న భవిష్యతి గా మలిచి, కథా సాహిత్యంలో చెరగనిముద్ర వేశాడు. ప్రేమ, ప్రాణం, మార్పు, విలువలు, విశ్వాసం, సంఘం, జీవితం, త్యాగం, శౌర్యం కలిస్తే గదల్ పుట్టుకొచ్చింది. ఇప్పటికీ అలాంటి ప్రేమమనుషులు అక్కడక్కడా కనిపిస్తారు. చెడిన గ్రామాల్లో ప్రేమలు వెలిగిస్తారు.

# 10. ముగింపు

అభ్యుదయ సాహిత్యోద్యమ కాలంలోనే, దాని అండదండల్లో రాఘవ సాహిత్యాభిరుచులు, కళాసక్తి, సాంఘిక చైతన్యం ఉనికిలోకి వచ్చాయి. 1936లో ప్రగతిశీల రచయితల సంఘం స్థాపింపబడేనాటికి రాఘవ వయస్సు కేవలం పదమూడు సంవత్సరాలు. ఆ మరుసటి సంవత్సరమే అతడి మొదటి రచన సాప్తాహిక్ 'విశ్వామిత్ర' పత్రికలో వెలువడింది.

అయిదవ దశకంలో [1950–60] ఆగ్రా ప్రగతిశీల రచయితల సంఘం కార్యకలాపాలకు కేంద్రంగా ఉండేది. భిన్నాభిప్రాయాలు, విధానాలకు సంబంధించిన అసంతృప్తి నెలకొనివున్నప్పటికీ, రాఘవ ప్రగతిశీల రచయితల సంఘంతోనే కలిసివుండేవాడు. ఈ సంఘం ఆధ్వర్యంలోనే అతడు డా॥ కుంటే నేతృత్వంలోని వైద్యులబృందంతోపాటు బెంగాలు కరువుపీడిత ప్రాంతాలు సందర్శించి, పత్రికా రిపోర్టులు రాశాడు. ప్రజానాట్యమండలి. [ఇప్టా] ద్వారా తన సాంస్కృతిక చైతన్యాన్ని ప్రదర్శించాడు. రచయితల సంఘంలో తరచూ జరిగే చర్చల్లో అతడు క్రియాశీలుడై పాల్గొనేవాడు. రాజకీయాల పరిమితులను సాహిత్యక్షేత్రంలో స్పష్టం చేయడానికి బహుశా అతడే మొదట ప్రయత్నించాడు. రాజకీయాల్లో ఔత్సాహికుల తీవ్రత నెలకొనివున్న తరుణంలో రాఘవ అలా సాహసించడం సామాన్యంకాదు. రచయిత మీద విధింపబడే ఎలాంటి ప్రతిబంధకాన్నైనా ఎదిరించేవాడు. రచయిత స్వాతంత్ర్యం అతడికి మౌలికవిషయంగాను, రచనాస్పృహగాను ఉండేవి. అతడు కోరుకునే వ్యక్తి స్వాతంత్ర్యం పూర్తిగా భిన్నమైనది. సామ్రాజ్యవాదుల, పెట్టుబడీదారుల కుట్రల ఫలితంగా సాహిత్యంలో రాజకీయాలను నిషేధించాలని కోరుకునే బూర్జువా రచయితల స్వాతంత్ర్యా కాంక్షకు భిన్నమైనది రాఘవ 'వ్యక్తి స్వాతంత్ర్యం.'

రాఘవ పీడిత ప్రజల పక్షాన నిలిచి రచనలు చేయడానికి కంకణం కట్టుకున్న సామ్యవాదరచయిత. ఆ పరిధిలోనే అతడికి స్వేచ్ఛ కావాలని

పట్టుపట్టాడు. దీనిని కొందరు అపార్థం చేసుకున్నారు కూడా. అయినా అతడు అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని వీడిపోలేదు.

సాహిత్యంలో 'శాశ్వతవిలువల' ప్రసక్తిని స్పష్టం చేసినవాడు రాఘవ. తాత్కాలిక ప్రయోజనాలైన పోస్టర్ రచన లకు, కళాకృతికి భేదం ఉండాలని, ఉంటుందని, ఆ కారణంగానే రచయిత తాత్కాలిక ప్రయోజనాలనధిగమించి రచనలు చేయాలని రాఘవ దృఢంగా వాదించి సాహిత్య సూత్రీకరణలు చేసేవాడు. రాజకీయ అవసరాలమేరకు అతడు పోస్టర్‌వాద రచనలను కూడా వ్యతిరేకించేవాడు కాదు. కాని వాటినే సాహిత్యంగా అతడు భావించేవాడు కూడ కాదు.

1918లో ఎర్ర సైన్యానికి నావికాదళం మహా ప్రస్థానాన్ని ప్రోత్సహిస్తూ మైకోవస్కీ రాసిన కవిత 'లెఫ్ట్ మార్చ్'ను స్వయాన అనువదించి, హంస్. పత్రికలో ప్రచురింపజేశాడు రాఘవ. అయినా అతడు ఈ రచనకన్నా గోర్కీ, హోవర్డ్స్ ఫాస్ట్ రాసిన రచనలకే ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చేవాడు.

తాత్కాలిక ప్రయోజనాలను అధిగమించి, శాశ్వత ప్రమాణాన్ని చేరుకొని, ఉన్నతమైన విలువలను స్థాపించగలిగిన రచనలనే రాఘవ గుర్తించి గౌరవించేవాడు. సామయిక రచనల తాత్కాలికత అతడికి సాహిత్య ప్రమాణంగా కనిపించేది కాదు. తన కాల పరిధులనుండి ముందుకు సాగి జయప్రదంగా చూడగలిగే ఉత్తమరచనే శాశ్వత విలువ కలదని రాఘవ నిశ్చితాభిప్రాయం. రచయితగా రాఘవ ఆలోచనా ధోరణి చాలా మౌలికమైనది. సర్వ స్వతంత్రమైనది.

సుప్రసిద్ధ హిందీకవి అభ్యుదయ రచయిత కీర్తిశేషుడు అయిన ముక్తి బోధ్ భావాలకు రాఘవ అభిప్రాయాలకు భేదం లేదు. సుమారు ఇద్దరి అభిప్రాయాలు ఒకేరకంగా ఉన్నాయి. రచయిత స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గురించి, సామ్యవాద లక్ష్యాలతో అతడు నిర్వహించాల్సిన భాధ్యతాయుత మైన పాత్ర గురించి ముక్తి బోధ్ నాటి కమ్యూనిస్టు నాయకుడు, పండితుడు, చింతనా శీలి అయిన శ్రీపాద అమృత డాంగేకు ఒక సుదీర్ఘమైన రహస్య

లేఖను రాశాడు. రచయితకు సంబంధించిన అనేక విషయాల గురించి అతడు చర్చలు లేవదీశాడు.

రాఘవ కూడా, ముక్తిబోధ్‌లాగే అనవసరపు పడికట్టు పదాల [జార్గన్] తో నిండివుండే అవకాశవాద, యాంత్రిక, పిడివాద విమర్శలవల్లే అభ్యుదయ సాహిత్యోద్యమానికి తీరనినష్టం జరిగిందని భావించేవాడు. అందువల్లే రాఘవ ప్రజలకు మాత్రమే కట్టుబడివుండాలనే దృఢసంకల్పాన్ని స్పష్టంచేస్తూ నిబద్ధతాసూత్రాన్ని [కమిట్‌మెంటును] పునర్ నిర్వచించేవాడు. ప్రజల సమున్నత గౌరవాన్ని పార్టీకి ఈయడానికి అతడు అంగీకరించేవాడు కాదు. రెండింటి మధ్య వైరుధ్యాన్ని అతడు ఆలోచించడానికి గల ముఖ్యకారణం నాటి పార్టీ మనుషులు రచయితల పట్ల యజమానులుగా, తీర్పునిచ్చేవారుగా, నిరంకుశులుగా ప్రవర్తించడం, దురుసుగా వ్యవహరించడం. – ప్రజలకు విధేయుడై ఉండనానికి అతడికే మాత్రం అభ్యంతరం ఉండేదికాదు. ప్రజల పేరిట పార్టీమనుషులు చలాయించే ఇష్టారాజ్యాన్ని అతడు ప్రతి విషయంలోనూ ప్రతిఘటించేవాడు. ఈ కారణంగానే అతడు కొందరి స్నేహాన్ని, కొంత పేరును పోగొట్టుకుని ఏకాకి కూడా అయ్యాడు.

నాటి మార్క్సిష్టు విమర్శకులుకావాలని, సాహిత్య క్షేత్రంలో రాఘవను నిర్లక్ష్యం చేయడంవల్ల, నానా ఆరోపణలు చేసి, ముద్రలు వేసి వైరం పెంచుకోవడంవల్ల, విసిగి, రాఘవ ఒక చోట 'నేను మార్క్సిస్టును కాను' అని రాసివేశాడు కూడా.

రాఘవలో బహుళంగా కనిపించే మానవతా చింతనను చూసి, కొందరు స్తనశల్యపరీక్ష చేసి, అతడి ప్రకటనలను ఆధారం చేసుకొని, అతడిని మార్క్సిస్టుగా భావించేబదులు, మానవతావాదిగా భావించి వ్యవహరించడం ఎక్కువ ప్రయోజనకరం అనే నిర్ణయానికి వచ్చారు. విమర్శకులిలా వ్యంగ్యంగా వ్యాఖ్యానించడంవల్ల మానవతావాదానికి, మార్క్సిజానికి వైరుధ్యం ఉన్నట్లు అపోహ కలిగింది.

రాఘవ మానవతావాద చింతనను గురించి ఇదివరకే స్పష్టం చేయబడింది. అతడు విశ్వసించి, రాసి ప్రచారం చేసిన మానవతావాదం అమూర్తమైనది [అబ్‌స్ట్రాక్ట్] కానేకాదు. అది భావవాదం [ఐడియలిజం] కూడా కాదు. అమూర్తభావన కాని రాఘవ మానవతావాదం మార్క్సిజంసంస్కారంనుండి పుట్టింది. అందులో మానవుని శ్రమవిలువ అంతర్లీనమైవుంది. మార్క్సిజం మౌలిక అవగాహన ఆధారంగానే మానవతా చింతన రాఘవలో పెనవేసుకుపోయింది. మానవత్వం ఉన్నత దశగానే మార్క్సిజాన్ని గుర్తించి విశ్వసించాడు రాఘవ. మానవుడి ప్రగతిశీల సామాజిక సంస్కారంగానే మార్క్సిజాన్ని దర్శించాడు. శ్రమకు, పోరాటాలకు నిర్ణయాత్మకమైన స్థానాన్ని ఇచ్చాడు తన చింతనాపరంపరలో.

మొత్తం హిందీ అభ్యుదయ సాహిత్యంలో, సువిశాల నేపథ్యంతో మానవుడి సంఘర్షణను, మానవ వికాసయాత్రను రాఘవ చిత్రించినతీరు బహుశా అనితరసాధ్యం, అద్వితీయం. అతడి చారిత్రక పరిశీలన, సామాజిక వేదన, సాంస్కృతిక అన్వేషణమున్నగు జిజ్ఞాసలు స్వరూపంలో కేవలం మానవతావాదంగా కనిపించవచ్చు. కాని అతడి సత్యాన్వేషణ, మానవ వికాసపరిశీలన అంతా గతితార్కిక భౌతికవాద పద్ధతిలోనే కొనసాగింది. చారిత్రక పరిణామక్రమంలో మార్క్సు చెప్పిన వర్గపోరాట సిద్ధాంతాన్ని అనుసరించే అతడు తన సామాజిక, చారిత్రక, సాంస్కృతిక సత్యాన్వేషణలో సారాంశాన్ని, సత్ఫలితాలను ముందుకు తెచ్చాడు.

తన పరిశీలనలో రాఘవ అక్కడక్కడా మార్క్సును, మార్క్సిస్టు చింతకులను ఉటంకించాడు కూడా. చరిత్ర, సంస్కృతి, కళలు మున్నగు వాటి విషయాల్లో రాఘవ మార్క్సు చెప్పిన భావాలను ఆమోదిస్తూనే ముందుకు నడిచాడు. ఎక్కడా విభేదించలేదు.

మారిన జాతీయ పరిస్థితులమేరకు మార్క్సిజాన్ని దేశకాలాల నిర్దుష్టపరిస్థితులకు అన్వయించే సందర్భంలో, మార్క్సిజాన్ని సక్రమంగా ఆలోచించి అనుసరించాలని రాఘవ హెచ్చరించాడు. మార్క్సిజం అనేది కూడా మానవ జాతి వికాసంకోసం ఏర్పడిన మానవ జ్ఞానసంపద. మార్పులు

చేర్పులు పరిస్థితులకనుగుణంగా చేయడం దోషం కాదని కూడా అతని అభిప్రాయం. మార్క్సిజం ఒక అంతిమ లక్ష్యమే కాదు నిరంతర లక్షణం కూడా. సరైన అవగాహనకోసం, ఆచరణ కోసం అంతర్, బహిర్ పోరాటాలు చేయాలని అతడి ఆవేదన.

మార్క్సిస్టు సిద్ధాంత పవిత్రత కోసం మనిషిని నిర్లక్ష్యం చేయడానికి రాఘవ ఏమాత్రం అంగీకరించలేదు. అలాగే రాజ్యాధికార పరిరక్షణకోసం మనిషిని యంత్రంలా మార్చి వినియోగించడాన్ని కూడా అతడు ప్రతిఘటించాడు. రాఘవ భావజాలమంతా ఇలా రూపొందిన కాలం రష్యాలోని స్టాలిన్‌యుగ కాలం. స్టాలిన్ సన్నిహితుడు జ్దానోవ్ సాహిత్య, కళా, సాంస్కృతిక రంగాలలో అక్కడ విధాన నిర్ణేతగా ఉండేవాడు. అతడి పిడివాద ధోరణులు భారతీయ హిందీ సాహిత్యంలో మార్క్సిస్టు సాహిత్య విమర్శలుగా ప్రతిధ్వనించాయి.

రష్యాలోని వీరపూజ, ప్రభుత్వ నిరంకుశ విధానంవల్ల కూడా రాఘవకు ఆశాభంగం కలిగింది. పార్టీ పాలసీల మూలకంగా సాహిత్యంలో నేరుగాకాని, పరోక్షంగాకాని జోక్యం కలిగించుకోవటాన్ని అతడు అంగీకరించేవాడు కాదు. ఆ విధమైన పార్టీపెద్దల జోక్యంవల్లే సోవియట్ సాహిత్యంలో ఆనాడు యాంత్రికధోరణి, సంవేదనాశూన్యమైన రచన ఏర్పడ్డాయని రాఘవ సోదాహరణంగా, స్పష్టంగా వాదించే వాడు.

మానవుడిపట్ల సంవేదనను, పోరాటంలో కొత్త విశ్వాసాన్ని కలిగించడం అభ్యుదయ సాహిత్యోద్యమానికి రాఘవ ఇచ్చిన గొప్పకానుకలు. సాహిత్యంలో రాజకీయ జోక్యం యాంత్రికంగా జరుగుతున్న ఆ రోజుల్లో రాఘవ ఈ రెండు ఆదర్శాలను అభ్యుదయ సాహిత్యంలో ప్రవేశపెట్టి, తర్వాతి తరానికి ఆదర్శపాత్రుడయ్యాడు.

మానవుడిపట్ల ప్రగాఢంగా సంవేదన ఉన్నందువల్లే రాఘవ చరిత్ర గుణదోషాలు పరిశీలించి వెలగట్టగలిగాడు. అతడి సాహిత్యపాత్రలు, ఆయా వాతావరణాల్లో పరిమితమై ఉన్నప్పటికీ, మానవ సంఘర్షణలను,

వికాసాన్ని అద్వితీయంగా రేఖాంకితం చేస్తాయి.

రాఘవ ప్రతిప్రక్రియలోనూ రచనలు చేశాడు. కావ్యాలు, నవలలు, కథలు, విమర్శలు, నాటకాలు, ఏకాంకికలు, పత్రికారిపోర్టులు మున్నగు నవేకాక, చరిత్ర, సంస్కృతి విషయాల్లో కూడా మౌలికమైన ఆలోచనలతో ప్రామాణిక రచనలు చేశాడు. గాథలు, రిపోర్టులు, ఆత్మకథలాంటి శైలీ సంవిధానం హిందీ అభ్యుదయ వాద సాహిత్యంలో అతడి మౌలికతకు అక్షరసాక్ష్యాలు. శైలీగత ప్రయోగాలకు సంబంధించినంతవరకు అతడితో సమానంగా మరో అభ్యుదయరచయితను సమాన స్థాయిలో నిలపడం సాధ్యం కాదేమో!

ప్రాగైతిహాసిక, పౌరాణిక, చారిత్రక, ఆంచలిక, నగర, గ్రామీణ వాతావరణంతో అతడు రాసిన రచనల్లో భాషాశక్తి, ప్రవాహవేగం, తన విషయం మేరకు మెలికలు తిరుగగలిగే భాషలోని తాంతవత, వాతావరణాన్ని ఆత్మీయంగా సన్నిహితం చేయడానికి తగిన సామెత మున్నగునవన్నీ అతడి నైపుణ్యాలు. ఒక రచయిత క్షమతమేరకు హిందీ ప్రగతీశీల సాహిత్యోద్యమంలో అతడి స్థానం చాలా సుదృఢంగా, ప్రేరణగా నిలిచివు ండగలదు. సామాజిక స్పృహకు, స్ఫూర్తికి అతడి మూర్తి సదాప్రభావితం చేస్తూనే ఉండగలదు.

సాహిత్యక్షేత్రంలో, సృజనాత్మక రచయిత ప్రతిభా పాటవాలకు ఎప్పుడూ వికల్పం అనేది ఏర్పడదు. కళకు సామాజికమైన పాత్ర ఉన్నప్పటికీ, దాని సృజనాత్మక శక్తి స్వతంత్రమైనది, అదృశ్యమైనది. అది ఒక రహస్య ప్రక్రియ. ఈ కారణంగానే ఇంతకాలం అయినప్పటికీ రాంగేయ రాఘవకు ప్రత్యామ్నాయంగా అంతటి రచయిత హిందీలో రాలేదు. సుదూర భవిష్యత్తులో అంతటి ప్రతిభావ్యుత్పత్తి అభ్యాసాలు సంతరించుకున్న అభ్యుదయ రచయిత రావడం సంభవం కూడా కాదేమో!

# అనుబంధం – 1
# రాంగేయ రాఘవ రచనలు

| నవలలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. ఘరౌందా | 1946 |
| 2. విషాద్‌మఠ్ | 1946 |
| 3. ముర్దోం కాటీలా | 1948 |
| 4. సీదాసాదా రాస్తా | 1951 |
| 5. హుజూర్ | 1951 |
| 6. చీవర్ | 1951 |
| 7. ప్రతిదాన్ | 1952 |
| 8. అంధేరేకే జుగునూ | 1953 |
| 9. కాకా | 1953 |
| 10. ఉబాల్ | 1954 |
| 11. పరాయా | 1954 |
| 12. దేవకీ కా బేటా | 1954 |
| 13. యశోధరా జీత్ గయీ | 1954 |
| 14. లోయీకా తానా | 1954 |
| 15. రత్నా కీ బాత్ | 1954 |

16. భారతీ కా సపూత్ 1954
17. ఆంధీకీ నీవె (రాణాకి పత్ని) 1955
18. అంధేరేకే భూఖ్ 1955
19. బోల్తె ఖండహార్ 1955
20. కబతక్ పుకారూ 1957
21. పక్షి ఔర్ ఆకాశ్ 1957
22. బౌనే ఔర్ ఘాయల్–ఫూల్ 1957
23. లఖ్నౌకీ ఆంఖే 1957
24. రాయి ఔర్ పర్వత్ 1958
25. బందూక్ ఔర్ బీన్ 1958
26. రాహ్ నరుకీ 1958
27. జబ్ ఆవేగీ కాలీఘటా 1958
28. ధూని కా ధువా 1959
29. ఛోటి సీ బాత్ 1959
30. షథ్ కా పాప్ 1959
31. మేరీ భవ్ బాధాహరో 1959
32. ధర్తి మేరా ఘర్ 1960
33. ఆగ్ కీ ప్యాస్ 1961
34. కల్పనా 1961

35. ప్రొఫెసర్ 1961

36. దాయరే 1961

37. పత్‌ఝర్ 1962

38. ఆఖరీ ఆవాజ్ 1962

(రచయిత దీనికి పెట్టిన పేరు 'లౌటితీ ఆవాజ్')

| కథలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. సామ్రాజ్ కా వైభవ్ | 1947 |
| 2. దేవదాసీ | 1947 |
| 3. సముద్ర కే ఫేన్ | 1947 |
| 4. అధూరీ మూరత్ | 1949 |
| 5. జీవన్ కే దానే | 1949 |
| 6. అంగారేన బుఝే | 1951 |
| 7. అయ్యాశ్ ముర్దే | 1953 |
| 8. ఇన్సాన్ పైదాహువా | 1957 |
| 9. పాంచ్ గధే | 1960 |
| 10. ఏక్ ఛోడ్ ఏక్ | 1963 |

| చరిత్రగాథలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. మహాయాత్రా –1 (అంధేరా రాస్తా) | 1960 |
| 2. మహాయాత్రా –2 (రైన్ ఔర్ చందా) | 1964 |

| పత్రికారిపోర్టులు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. తూఫానోంకే బీచ్ మే | 1946 |
| 2. యహ్ గ్వాలియర్‌హై | |

| కావ్యాలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. అజేయ్ ఖండహర్ | 1944 |
| 2. పిఘల్తేపత్థర్ | 1946 |
| 3. మేధావీ | 1947 |
| 4. రాహ్ కీ దీపక్ | 1948 |
| 5. పాంచాలీ | 1955 |
| 6. రూప్ ఛాయా | 1956 |

| నాటకాలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. స్వర్గ్ భూమి కా యాత్రి | 1951 |
| 2. రామానుజ్ | 1952 |
| 3. విరూఢక్ | 1955 |

| ఏకాంకికలు | వెలువడిన సంవత్సరము |
|---|---|
| 1. ఆఖిరి ధబ్బా | |
| 2. హాతిమ్ మర్‌గయా | |

సాహిత్య విమర్శలు – చరిత్ర , సంస్కృతి – చింతన

| | | వెలువడిన సంవత్సరము |
|---|---|---|
| 1. | భారతీయ్ పునర్జాగరణ్ కీ భూమికా | 1946 |
| 2. | భారతీయ్ సంత్ పరంపరా ఔర్ సమాజ్ | 1949 |
| 3. | సంగం ఔర్ సంఘర్ష్ | 1953 |
| 4. | ప్రాచీన్ భారతీయ్ పరంపరా ఔర్ ఇతిహాస్ | 1953 |
| 5. | ప్రగాతిశీల్ సాహిత్యకే మానదండ్ | 1954 |
| 6. | హిందీ సాహిత్యకీ ధార్మిక్ ఔర్ సామాజిక్ పీఠికా | 1955 |
| 7. | సమీక్షా ఔర్ ఆదర్శ్ | 1955 |
| 8. | కావ్య – యదార్థ్ ఔర్ ప్రగతి | 1955 |
| 9. | కావ్య–కళా ఔర్ శాస్త్ర్ | 1955 |
| 10. | కావ్యకే మూల్‌వివేచన్ | 1955 |
| 11. | కాల్ విజయ్ | 1955 |
| 12. | మహాకావ్య వివేచన్ | 1958 |
| 13. | తులసిదాస్ కా కథాశిల్ప్ | 1959 |
| 14. | ఆధునిక్ హిందీ కవితామే విషయ్ ఔర్ శృంగార్ | 1961 |
| 15. | ఆధునిక్ హిందీ కవితామే విషయ్ ఔర్ శైలి | 1962 |
| 16. | గొరఖ్‌నాథ్ ఔర్ ఉన్కాయుగ్ | 1963 |

# అనువాదాలు

1. షేక్స్పియర్ నాటకాలు – 15

2. గాల్స్ వర్ధ్ – 1

3. సోఫో క్లీజ్ – 2

1. సంస్కృత రచనల అనువాదాలు – చాలా

2. ఇంగ్లీషు నవలల అనువాదాలు

3. 'సంసార్ కే శ్రేష్ఠ ఉపన్యాస్' పేర సుప్రసిద్ధ ప్రపంచ రచయితల నవలలను వ్యాఖ్యానాలతో విమర్శలతో కలిపి సారాంశాలను ప్రచురించాడు.

4. దేశగాథలనుతిరగరాశాడు.

ఇతరులతో కలిసి చేసిన రచనలు

1. బారహఖంబా

2. గ్యారహ్ సప్నోంకాదేశ్

3. సాంఘిక శాస్త్రగ్రంథాలు

'రాంగేయ రాఘవ గ్రంథావళి' పేర రాఘవ సమస్తరచనలు 10 భాగాల్లో వెలువడ్డాయి.

సంపాదకురాలు : శ్రీమతి సులోచనారాఘవ్
మొదటి ప్రచురణ : 1982
రెండవ ప్రచురణ : 1989
ప్రచురణకర్తలు : రాజ్‌పాల్ అండ్ సన్స్
కశ్మీరి గేట్ – ఢిల్లీ

# అనుబంధం – 2

'రాంగేయ రాఘవ్'రచన కోసం ఉపయుక్తమైన గ్రంథాలు

1. పునః – శ్రీమతి సులోచనా రాంగేయ రాఘవ్

2. రాంగేయ రాఘవ్‌కా రచనా సంసార్
– గోవింద్ రజనీశ్ (సంపాదకుడు)

3. డా॥ రాంగేయ రాఘవ్ ః ఉపన్యాస్ ఔర్ మేరీ మాన్యతాయే
– దేవరాజ్ ఉపాధ్యాయ్

4. సమీక్షా కే సందర్భ్ – భగవతీ శరణ్ ఉపాధ్యాయ్

5. మార్క్సవాద్ ఔర్ ప్రగతిశీల్ సాహిత్య – రామ్ విలాస్ శర్మ

6. సాహిత్యానుశీలన్ – శివదాస్ సింహ్ చౌహాన్

7. రుగ్వేదిక్ ఆర్య – రాహుల్ సాంకృత్యాయన్

8. ఆర్యోంకా ఆది దేశ్ – సంపూర్ణానంద్

9. హిందీ ఉపన్యాస్‌కా అధ్యయన్ – ఎస్. ఎన్. గణేశన్

10. శశాంక్ – రాఖాల్‌దాస్ బందోపాధ్యాయ

11. సంభవామి – 1, 2 – కన్హాయ్యాలాల్ ఓఝా

పత్రికలు

1. నిష్ఠా – రాంగేయ రాఘవ్ అంక్ – 1966

2. హంస్ – అక్టోబర్ – 1944 నుండి సెప్టెంబరు 1945 దాకా వున్న సంచికలు.

3. ఆలోచనా —ఫూర్ణాంక్ 13, 16, 31

4. లహర్ — సెప్టెంబర్ —1963

5. సాక్షాత్కార్ — ఏప్రిల్ — 1985